# భూమి లోపలి రహస్యాలు (వ్యాసం)

డా॥ ఎస్. భగవంతం

35-4

ంధ్ర
చిత్ర
ర
త్రిక

7-1959

యాపైసలు



ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY



"అలుకదేలనే చిలుకా!"

కత్తిరింపులచిత్రం : ఓ. వి. నరసింహులుగుప్త (మదనపల్లె)

నేడే
చూడండి



శ్రీ కృష్ణసాయి ఫిలింస్ వారు సమర్పించు

ప్రభాత్ వారి

# గాంధారి గర్వభంగం

తెలుగు

పూర్ణా రిలీజ్

మాటలు, పాటలు...... శ్రీ శ్రీ

FLOODLIGHT

నిర్మాత... యర్రా అప్పారావు * సంగీతం... పామర్తి

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంవత్సర చందా
రు. 18—0—0
విడిప్రతిక 25 న.పై

**Founder: K. NAGESWARA RAO**

వికారి వైశాఖ బహుళ ఏకాదశి బుధవారం

సంపుటము 53
సంచిక 39
1 7-59


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

శ్రీ కృష్ణసాయి ఫిలింస్ వారి 'గాంధారి గర్వభంగం' చిత్రంలో

సులోచన.



## వచ్చే సంచికలో కొత్త ఆకర్షణ.





# రాజధాని కబుర్లు

ప్రవీణ్

# కోపంలేని గోపాలరెడ్డి

క్కాగా చేతపట్టి, సాహితీ క్షేత్రంలో వ్యవసాయం సాగించి, రాజకీయ క్షేత్రంలో ధాన్యని పంటని అనుభవించే పెద్దలుకొందరు. శాసన పరిషత్తుల్లో సభ్యత్వంకోసం 'కేన్వాసు' చేసుకు కవులయ్యే పెద్దలు మరికొందరు. రాజకీయాల్లో ఉండి రసికులనిపించుకోడం కోసం కవిత్వం ప్రారంభించే పెద్దలు ఇంకొందరు. ఎందరో మహానుభావులు. వారందరి విజయాలు పదవులు ఇంధనములు.

మొదటితరహా పెద్దమనుష్యులకు తమ పదవులమీదగలమను కారం రాజకీయ సమస్యలపై ఉండరు. 'నాకు మాటాడవలసింది ఏమీ లేదు; ఎవరో మాటాడమనాగు కనుక మాటాడ్తాం' అంటూ ప్రారంభిస్తారు వీరు ఉపన్యాసాలు. వీరివల్ల వీరికే గాని దేశానికి ఉపకారం లేదు. దేశానికి అపకారంకూడా యంగా చేయలేని పెద్దలు వీరు.

రెండవ తరహా పెద్దమనుషులవల్ల కూడా దేశానికి నష్టంలేదు 'నేను రాసింది పలాని బాగుందని పలానావాడు రాశాడు; నువ్వుకూడా ఎందుకు రాయకూడదు?' అని మిత్రులకు లేఖలు వ్రాసుకుంటారు వీరు. నాకుగాని నువ్వు పదవి గా సన్మానం ఏటు చేస్తావా? కావాలంటే, డబ్బు చేస్తాను' అని మరికొందరికి వ్రాసుకుం ఫలితం? పత్రికల్లో వ్యాసపరంపర; సభల్లో సన్మాన పరంపర; పరిషత్తుల్లో సభ్యత్వ పరంపర.

మూడవతరహా పెద్ద మనుష్యులవల్ల కూడా దేశానికి నష్టం అధికంగా లేదు. సంపదవల్ల కాకపోతే, పదవులంగా కొని ప్రాముఖ్యత సంపాదించుకొని, సాహితీ క్షేత్రంలో ఒకంటి లేండ్ లార్డిజమ్'పై పు చేయి చూపుతారు. 'బీనామీ' గ్రంథాలు కొన్ని ఉద్భవిస్తాయి. రచయిత అధికారంలో ఉండడంవల్ల —'భళిభళీ నీరాతి బ్రహ్మకైనను తరమా?' అంటూ విమర్శకులు సాష్టాంగ దండప్రణామాలు చేస్తారు.

'ఇబ్సెంటీ లేండ్ లార్డిజమ్' దేశం అంగీకరించదు. సాహితీ క్షేత్రంలో ఈతరం వాళ్లు అంగీకరించినా, ముందుతరాలవారు అంగీకరించరు. అందువల్ల వీరివల్ల కూడా దేశానికి తీరని నష్టం లేదు. వారు సాహిత్యాన్ని విడిచి, భావ పైపడి తమ అభిప్రాయాలను వెలువిచ్చి, చట్టాలు చేసినప్పుడే ప్రమాదం.

అసలు ఈ విషయాలన్నీ ఎందుకు రాసినట్టు? ఊరికే! ఉబుసుపోక. ఈ విషయాలు ఇక్కడే వదిలేసి ముగించివేదాం.

## గోపాలరెడ్డి ఉవాచ

కేంద్రమంత్రి శ్రీ గోపాలరెడ్డిని గురించి అనేకులకు అనేకాభిప్రాయాలుండవచ్చు. రసజ్ఞుడని కొందరనవచ్చు. నుప్పల మంత్రి అని అభిశంసించవచ్చు. రవిగాంచని సన్నులను కూడా ఈ 'కవి' గాంచగలడని పేరనవచ్చు.

నన్నడిగితే డా. గోపాలరెడ్డిలో ప్రధాన లక్షణం హాసమ్మఖత. విజయాలను పరాజయాలను నవ్వుముఖంతో స్వీకరించగల వ్యక్తి ఈయన. కోపం ఎరుగనివాడు అంటే అతిశయోక్తి ఔతుంది. కోపం లేకుండా రాజకీయాల్లో నిగ్గుకురావడం కష్టం. కాని శ్రీ గోపాలరెడ్డిని కోపం ప్రదర్శించని వ్యక్తిగా వర్ణించవచ్చు.

గోడమీద పిల్లి ఎటు ఊరుకుతుందో ముందే చెప్పగలిగిన మానవుడు రాజకీయవేత్త కాగలడు. కన్నుమూయకుండా అబద్ధం చెప్పగలవాడు మంత్రి కాగలడు. ఈనాడు ఇక్కడ ఈ ఉపన్యాసం ఇచ్చిన రాజకీయవాది, అది అవాంఛనీయ పరిణామాలను దారితీస్తే, 'ఆమాట నేను అనలేదు; పత్రికలవాళ్లు తప్పు రాసుకున్నారు'అని కప్పదాటు వేస్తాడు. ఓహో కాబోలనుకుంటారు ఏమీ ఎరుగని ప్రజలు.

ఆ విధంగా జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు అనలేదు అనని రాజకీయవేత్తలు కోటింలో చాలా తక్కువ. నాకు తెలిసినంతవరకు ఆ కొద్దిమందిలో డా. గోపాలరెడ్డి ఒకరు. ఎప్పుడైనా పొరపాటున అనరానిమాట ఏదైనా అన్నా, అల్లా అనలేదని ఎన్నడూ ఆయన అనలేదు.

రాజధానినగరంలో ఒకసారి ఆయన ప్రసంగిస్తూ "నలభై ఏళ్ళు దాటిన తర్వాత మన కవులంతా తమ పూర్వ ప్రతిష్ఠపై నిలబడి పరాన్న భుక్కుల్లా జీవిస్తున్నారు" అన్నారు బహుశః ఆయన ఉపన్యసించిన సందర్భాన్ని బట్టి, ఆయన పలుకుల్లో సత్యలేశం లేకపోలేదు కాని 'ఆంధ్రపత్రిక'లో ఈ వార్త దేశంలో అలజడి లేవనెత్తింది. ఈ అభిప్రాయాన్ని ఖండిస్తూ వ్యాసాలు, లేఖలు ప్రచురించబడ్డాయి డా. గోపాలరెడ్డి చలించలేదు. హైదరాబాదులోని సాహితీ బంధువొకాయన డా. గోపాలరెడ్డి ఆ విధంగా అనలేదన్నారు. అనలేదని డా. గోపాలరెడ్డి మాత్రం అనలేదు.

* * *

ఈవారం గోపాలరెడ్డి గారు రాజధాని

ఉంటుంది.

పదకొండవ తరగతికి ఇంతవరకు పాఠం చెప్పిన ఉపాధ్యాయులను క్రింది తరగతులకు పంపిస్తున్నారు. ఆ క్రింది తరగతుల వారు ఇంకో క్రిందికిపోతున్నారు. పైనుండి పెక్కనులకు పాఠం చెప్పే ఉపాధ్యాయుల ఉద్యోగాలకు ముప్పువస్తోంది.

* * *

పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులకు ఇచ్చే కొద్ది జీతాలతో రాజధాని నగరంలో జీవించడం కష్టమే. తమ జీతానికి మించి అంతో ఇంతో సంపాదించాలని వారు యత్నించడం సహజమే. కాని వారి యత్నాలు విద్యార్థులను వారి తల్లిదండ్రులను బాధపెట్టేటట్లు ఉండకూడదు.

తాము, తమ మిత్రులు రచించిన కొన్ని గ్రంథాలను విద్యార్థుల చేత బలవంతంగా కొనిపించాలనే యత్నం కొందరు ఉపాధ్యాయులు చేస్తున్నట్లు తెలుస్తోంది. ఈ వాక్యాలు నేను రాస్తున్నప్పుడు నా బల్ల మీద అట్టి ఉపాధ్యాయుల పేర్లు, వారు పనిచేసే సంస్థల పేర్లు ఉన్నాయి. అవి ప్రచురించి వారికి హాని కలుగచేయడం నా ఉద్దేశ్యం కాదు. కాని బలవంతంగా విద్యార్థులచే పుస్తకాలను అవసరం లేకపోయినా కొనిపించే యత్నం ఉపాధ్యాయులు మానుకోవాలి.

## నవ్యసాహితీ సమితి

గత ఆదివారం వేమనాంధ్ర భాషా నిలయంలో జరిగిన వార్షిక సమావేశంలో నవ్యసాహితీ సమితి కొత్త కార్యవర్గాన్ని ఎన్నుకొంది.

గత మూడేండ్లుగా అధ్యక్ష పదవి నిర్వహించిన శ్రీ కురుగంటి సీతారామయ్య పదవీ విరమణ చేశారు. వారి స్థానంలో శ్రీ బోయి మన్న ఎన్నుకోబడ్డారు.

ఈ సంవత్సరం ఎన్నుకోబడ్డవారు: శ్రీయుతులు సోమంచి యజ్ఞన్న శాస్త్రి, రాయప్రోలు శ్రీనివాస్ (ఉపాధ్యక్షులు), శ్రీ పోతుకూచి సాంబశివరావు (ప్రధాన కార్యదర్శి), శ్రీ టి. వి. భద్రిరాజు (కార్యదర్శి), శ్రీ వి. ఎస్. హరి (కోశాధికారి) శ్రీ అక్కిరాజు జనార్దనరావు (సంచిక సంపాదకులు), శ్రీ పోరంకి దక్షిణామూర్తి (కార్యాలయ కార్యదర్శి).

శ్రీయుతులు భాస్కరభట్ల కృష్ణారావు, హెచ్. వి. సుందర్, వి. నరసింహారావు సాహిత్య, ఆర్థిక, నాటక ఉపసంఘాలకు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. సాహిత్యోపసంఘంలో సభ్యులు శ్రీమతి దుల్ల శారదాదేవి, శ్రీయుతులు వంగరాజు లింగమూర్తి, 'లసూనా', 'మంజుశ్రీ'. నాటకోపసంఘంలో సభ్యులు: శ్రీమతి వి. రతన్‌ప్రసాద్, శ్రీయుతులు ఎ. రామమోహనరావు, జోగారావు, వేదాంతం, నంబూరి శ్రీనివాసరావు, కె. వీరరాజు, డి. రాజేశ్వరరావు. ఈ ఉపసంఘానికి కార్యదర్శి శ్రీ ఎస్. శ్రీనివాసరావు. ఆర్థికోపసంఘంలో సభ్యులుగా శ్రీమతి సుభద్రాదేవి, శ్రీయుతులు ఎమ్. రఘురామ్‌రావు, ఎమ్. శ్రీనివాసరావు, వి. కామేశ్వరరావు ఉన్నారు.

ఈ సమితి గత సంవత్సరంలో మూడు పథకాలు తలపెట్టి, దాదాపుగా అమలు జరిపింది. విభిన్న దృక్పథాలకు చెందిన సభ్యుల రచనలను కూర్చి కవితా సంకలనం ప్రకటించింది. కొందరు సభ్యుల కథానికలను ఆంగ్లంలోకి అనువదింప చేసి ప్రచురిస్తోంది. గత సంవత్సరంలో (ఏప్రిల్, 1958–మార్చి '59) సుమారు పదహారు పత్రికల్లో ప్రచురితమైన కథల్లో ఉత్తమమైన దానికి రు. 116లు బహుమానం ప్రకటించింది.

సమితి కార్యక్రమంలో ఈ మూడు మెచ్చుకోదగిన అంశాలు.

## కుంభకర్ణ పునర్జన్మ : (5)

'ఇంటింట ఆనంద దీపావళి – మా ఇంట శోకాంధ తిమిరావళి' అని పాడేరు సినీమా గాయక గాయనీమణులు. ఈ పాట 1957 దీపావళికి నల్లకుంటలో నివసించే ఒక కుటుంబంపట్ల దారుణంగా నిజమైంది. దీపావళి అలంకరణలను చూడ్డానికి అలంకరించుకు పోయిన ఒక బాలిక ఆనాటిరాత్రి నల్లకుంట చీకటి అడివిలో అమానుషంగా హత్య చేయబడింది.

ఈ విషయం క్రిందటివారం 'రాజధాని కబుర్ల'లో ప్రస్తావించాను. ఇదే విషయం గత జనవరిలో శ్రీ కమీషనర్ ముందు శ్రీ మేయర్ ముందు ప్రస్తావించబడింది. కాని ఫలితం శూన్యం. ఆరు నెలల తర్వాత ఈ నాటికీ దీపాలు వెలగవు చిక్కడపల్లి నుంచి నల్లకుంట పోయే త్రోవలో. ఆ ప్రాంతానికి ప్రాతినిధ్యం వహించే నగరపాలక సంఘ సభ్యుడు అక్కడే నివసించడు. అదికూడా ఒక కారణమేమో మరి?

దీపాలార్పడం అలవాటైన తరువాత, ఆర్పకుండా ఉండడం కష్టం. కాచిగూడా రైల్వే స్టేషన్‌నుండి బాదర్ ఘాట్ వంతెన పైకి పోయేబాటపై సగం రాత్రులు పదకొండుదాటితే దీపాలు ఉండవు. అదికూడా ఆవాసగృహాలకు దూరంగా ఉండే నిర్జన ప్రదేశం.

కాని మనం ఇప్పుడక్కడకు పోవడం లేదు. నల్లకుంట వంతెనవద్ద చీకట్లో నిలబడి ఉన్నాం. కొత్తవంతెన కాదు; పాత వంతెన. మీ ఎడంచేతి పక్కన 'మురికినీరు పారని' చెరువుఉంది చూశారా? దానికటువైపు 'ప్రభుత్వ జ్వర చికిత్సాలయం' ఉంది. ఎంత చక్కటి పేరు! ఈ మురికినీటిపై ఎగిరే పురుగులు జ్వర చికిత్సాలయంలో చేరుతున్నారో, అక్కడి అంటువ్యాధుల క్రిములువచ్చి, ఈ మురికినీటిలో ఉతికిన బట్టలపైవాలి నగరంఅంతా సంచారం చేస్తున్నారో తెలియదు.

ఈ మురికినీటి కాలువకి చరిత్రఉంది. అది మరోసారి ప్రస్తావిస్తాను. నేను ప్రస్తావించకపోయినా – సమర్థుని ఎంచి ప్రభుత్వం నియమించిన శ్రీ కమీషనర్‌కి, అనుభవజ్ఞుడని భావించి ప్రజలు ఎన్నుకున్న శ్రీ మేయరుకి ఆచరిత్ర తెలుసు. కాని వారు మాత్రం ఏం చేయగలరు? కుంభకర్ణుడు గాఢంగా నిద్ర పోతున్నాడు.



### కథ కాని కథ

**రచనకు నిబంధనలు**

ఈ శీర్షికలో ప్రచురణార్థం పంపే రచనలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండాలి. సంఘటనలు యథార్థంగా జరిగినవే అయివుండాలి. ఎవరినీ నొప్పించేవిగా, అవమానించేవిగా ఉండకూడదు. ఉత్తమ రచనకు పది రూపాయలు బహుమతి. రెండవ బహుమతికి (తగిన రచన వచ్చినప్పుడు మాత్రమే) అయిదు రూపాయలు పారితోషికం. బహుమతుల విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. ప్రచురణకు స్వీకరించని రచనలను తిప్పి పంపటం గాని, రచయితలతో ఉత్తర ప్రత్యుత్తరాలు గాని జరగవు. కనుక రచనలతోపాటు స్టాంపులు పంపరాదని మనవి. రచనపంపే కవరుపై 'కథకానికథ' శీర్షికకు అని రాయాలి. అలారాయనివి పోటీకి స్వీకరించబడవు. ఈశీర్షిక వారంవిడిచి వారం ప్రచురిస్తాము.



# కథ కాని కథ



## స్థానబలం

[మొదటి బహుమతి]

మా వూళ్ళో (చిన్న బాడాము) ఒకాయన ఉన్నాడు. నిజంగా చాలా మంచివాడు. కాని, అతన్నెవరైనా మోసగించాలనుకుంటే, సమయస్ఫూర్తిగా వాళ్ళనే బోల్తాచేసే రకం.

రెండునెల్లక్రితం ఏదో పనిమీద "నర్సన్నపేట" వెళ్లాడు. పనులన్నీ చూసుకునేసరికి ఆఖరుబస్సుకూడా వెళ్ళిపోయింది. చీకటికూడా పడింది. 'రాజుల' హోటల్లో భోంచేసి, ఏదైనా లారీవస్తే దాంట్లోనే పోవచ్చునుకుని "పెట్రోల్ బంకు" దగ్గర కాచుకూర్చున్నాడు. మరో 10 నిమిషాల్లో ఓ లారీ వచ్చింది. "ఏమండోయ్, డ్రైవరుగారూ! కాస్త 'చిన్న బాడాము'వరకు తీసుకుపోతారా" అన్నాడు. "ఆఁ! త్వరగా ఎక్కు" అన్నాడు తలుపుతీస్తూ డ్రైవరు.

లారీ మూడు, నాలుగు మైళ్ళు దాటుంటుందో లేదో, "ఏమండీ! ఆ పైసాలు ఇచ్చేస్తారా" అన్నాడు డ్రైవరు. పెద్దమనిషి జేబులోనుంచి 1-8-0 తీసి ఇవ్వబోయాడు. "మరో 1-8-0 ఇవ్వండీ," అన్నాడు డ్రైవరు. "చినబాడామునుండి నర్సన్నపేటకు బస్సుఛార్జి రూపాయిన్నరేనండి. లారీలకు కూడా అంతే ఇస్తుంటాను" అన్నాడు పెద్దమనిషి. "ఇస్తే 3-0-0 ఇవ్వండి. లేకపోతే దిగిపొండి." అన్నాడు డ్రైవరు "ఇక్కడా!" అన్నాడాయన. ఆ దరిదాపుల్లో ఏ ఊరూ లేదు. ఏమనుకున్నాడోగాని మూడు రూపాయలు డ్రైవరుచేతిలో పెట్టాడాయన.

పరిగ్గా రాత్రి ఒంటిగంటకు చిన్నబాడాము హైస్కూలు దగ్గరలో లారీ ఆగింది. గాఢాంధకారముగా ఉంది. పెద్దమనిషి లారీనుండి గభాలున దిగుతూనే, "ఏమండోయ్! నా పెన్ను పడిపోయింది. "టార్చి" ఉంటే ఓ మారిస్తారా!" అన్నాడు. క్లీనరిచ్చిన 'టార్చి'ని పట్టుకుంటూనే నాల్కాలు గండా ఎక్కాడు. "ఏయ్! టార్చిలా లేవా'య్? అంటూ దిగాడు డ్రైవరు.

"డ్రైవర్! కాస్త జాగ్రత్తగా మాటలు రానీయ్! ఇది మావూరని తెలీదూ! 3-0-0 యిచ్చేసి టార్చి తీసుకుపో!" అన్నాడాయన. "ఏమిటి! స్థానబలము చూపిస్తున్నావా?" అంటూ దిగాడు క్లీనరు. "మరి మీరేంచేశారు బ్రదర్?" అన్నాడాయన. చేసేదిలేక, ఒక్క మొగమేసి, డ్రైవరు 3-0-0 చెల్లించి, టార్చి తీసుకున్నాడు.

డి.వి నారాయణ, చిన్న బాడము (శ్రీకాకుళం జిల్లా)

## తెలీక* చేసిన* పొరపాటు

(రెండవ బహుమతి)

మాది ఏలూరికి దూరంగావున్న చిన్న పల్లెటూరు అప్పటికి మూడు సంవత్సరాలనుంచి ఏలూరులో చదువుకొంటున్నాను హోటల్లో భోజనం, హాస్టల్లో మకాం.

యూనివర్సిటీ పరీక్షలు దగ్గర కావడంవల్ల శ్రద్ధగా పాఠాలు చదువుకొంటున్నాను. ఇంతలో మా మేనమామ కూతురుపెండ్లి నిశ్చయమై ఏలూరులో చేయడానికి ఏర్పాటు చేసుకొని మా వాళ్ళంతా వచ్చేసి సత్రవులో విడిది దిగారు. పెండ్లికొడుకుదీ ఏలూరే.

ఆ రోజు రాత్రి రెండుగంటల ఎనిమిది నిమిషాలకో పెండ్లి. నేనున్న గదికి మా మేనమామ వచ్చి మరి మరీ చెప్పిపోయాడు. వంటిగంటన్నరవరకూ చదువుకొని ముహూర్తానికి పెండ్లికెళ్లాను, పెండ్లితతంగం పూర్తి అయింది. మా మేనమామ నన్ను పెండ్లికొడుక్కి, అతని తండ్రికి పరిచయంచేశాడు. వాళ్ళ దగ్గర సెలవుపుచ్చుకొని వచ్చేస్తూవుండగా పెండ్లికొడుకు తండ్రిగారు నన్ను పిలిచి మధ్యాహ్నం భోజనానికి నన్ను మరీ మరీ రావలసిందిగా కోరాడు. సరేనని చెప్పివచ్చేశా.

ఆ రోజు మధ్యాహ్నం మళ్ళీ నాకు కబురు పంపాడు మామయ. అందులోనూ పెండ్లిభోజనం జారవిడువకూడదని బయలుదేరాను సైకిలుమీద.

పెండ్లికొడుక్కి ప్రెజెంటు చేద్దామని ఒక పెద్ద 'ఫేస్ మిర్రరు' స్టెయిన్ లెస్ స్టీల్ స్టాండ్కి ఫిట్ చేసింది కొని 'ప్యాక్' చేయించి పట్టుకెళ్లాను. పెండ్లి కొడుకు తండ్రి చెప్పిన జాడప్రకారం తూర్పు వీధి కొచ్చి పెండ్లి యింటి కోసం వాకబు చేయగా ఆ సందు మలుపు ఇల్లేనని ఎవరో చెప్పారు. అటు వెళ్ళాను. అప్పుడే మొదటి బంతి భోజనంముగించి తాంబూలం నములుతూ వేంచేస్తున్నారు. నాకసలు ఎవరింటికన్నా వెళ్ళడమంటే చాలా సిగ్గు. తప్పనిసరిగదా అని వచ్చాను. పందిట్లో రెండో పంక్తికి జనం కూర్చున్నారు. నన్ను చూసి ఎవరో యిద్దరు లోపలికి ఆహ్వానించి కుర్చీలో కూర్చోబెట్టారు.

అక్కడ నాకు తెలిసిన వారు ఒక్కరూ లేరు. వడ్డనకి ఇంకా ఆలస్యముందిగదా, యీ లోపున పెండ్లి కొడుకు దగ్గరకెళ్ళి యీ ప్రజెంటు ఇచ్చేద్దామని లేచి, అక్కడ వున్న ఒక కుర్రవాని సహాయంతో పెండ్లి కొడుకు గదిలోకెళ్ళాను, అక్కడ మా సుశీల వుంటుంది గదా అన్న ధైర్యంతో. తీరా అక్కడకెళ్ళి చూస్తునుగదా అతడు నేనుఅనుకొన్న పెండ్లి కొడుకు కాడు. అతన్ని చూసి నేనూ, నన్ను చూసి అతడు నిర్ఘాంతపోయాము. నా చేతిలో వస్తువు అతని చేతిలో పెట్టి ఇదిమా పెండ్లి బహుమతి అని చెప్పి వెనక్కు తిరిగి వచ్చి పందిట్లో ఆగాను. ఇది ఎవరిల్లో నాకు తెలియదు. పొరపాటున పెండ్లి పందిరి కనిపించగానే మా మేనమామ కూతురు నిచ్చిన వాళ్ళయిల్లు ఇదే నేమో అనుకొని వచ్చేశాను. తెచ్చిన బహుమతి ముక్కూ ముఖం ఎరగని ఒక అపరిచిత వ్యక్తికి బహూకరించాను. ఇక ఇప్పుడు భోజనం చేయడమనేది పెద్ద సమస్యగా వుంది. ఏదో వంకని బయటకిపోయి తిన్నగా సైకిలెక్కి ఉడాయిద్దామంటే ఆ పెండ్లి పెద్దలు వడ్డన అయిందని కాళ్ళు కడుక్కోమని తొందరచేసి లాక్కుపోయి వడ్డించారు. మనసు మనసులో లేదు భోజనం చేసినంత సేపూ...... బహుశా ఆ పెండ్లి కొడుక్కి ఆ బహుమతి ఎవరిచ్చారో ఇప్పటికీ తెలియక పోవచ్చు.

ఎస్. ఎల్. (దుమ్ముగూడెం)




రాజమండ్రి స్టేషనులో కలకత్తా మెయిలు వచ్చి ఆగింది. ప్లాట్ ఫారం అంతా దిగేవారితోను, ఎక్కేవారితోనూ చాలా కోలాహలంగా ఉంది. సెకండ్ క్లాస్ కంపార్టుమెంటులోంచి దిగి, విశ్వనాథం ఒక చేత్తో సంచీ పుచ్చుకొని, స్టేషనుబయటికి వచ్చాడు. ఎండ బాగా మాడ్చేస్తోంది. ఒకసారి వాచీ కేసి చూసుకున్నాడు. పన్నెండుగంటలు కావస్తోంది. ఒక సైకిలు రిక్షా ఎక్కి పడవలరేవుకి పోనిమ్మన్నాడు.

లాంచి అప్పుడే రేవు దాటి వెళ్ళిపోయింది. ఇంకా రెండుగంటలు గడపాలి కదా అని వరదారావు హోటల్ కివెళ్ళి కొంచెం ఫలహారం చేసి, ఒకసిగరెట్టు పాకెట్టు కొనుక్కొని రేవుదగ్గిరకు వచ్చాడు. అక్కడ ఒక రావిచెట్టుక్రింద విశ్రాంతి తీసుకుందామని, సంచీ ప్రక్కన పెట్టుకుని కూర్చున్నాడు. సాఫీగా ఒకసిగరెట్టు వెలిగించి తాపీగా ఆలోచించసాగాడు.

విశ్వనాథంది అమలాపురం. వయస్సు సుమారు ముప్ఫయిరెండు ఉంటుంది. తండ్రి బాగా ఉన్నవాడే. రెండువందల ఎకరాల మాగాణీ ఉంది. పదిహేనుఏళ్ళక్రితం తన స్వగ్రామం వదలి మద్రాసు వచ్చేశాడు. ఇప్పుడు ఒక కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. తనపైన ముగ్గురు అన్నలు, ఇద్దరు అక్కయ్యలు ఉన్నారు. అన్నలెవ్వరూ కాలేజీ చదువులు చదవలేదు. తండ్రితోపాటు సేద్యం చేస్తున్నారు. అక్కయ్యలిద్దరికీ తన చిన్నప్పుడే పెళ్ళి అయిపోయింది.

విశ్వనాథం మద్రాసులో బియ్యే ఫస్టు ఇయర్ చదువుతుండగా తనపెళ్ళి నిశ్చయమైంది. అదీ తనఇష్టానికి వ్యతిరేకంగా. మద్రాసులో కొంచెం పలుకుబడి ఉన్న తన చుట్టం ఒకాయన కూతురి మీద తనకు మనసుకలిగింది. తను ప్రయ

## గంటి సూర్యప్రకాశరావు

త్నిస్తే ఆమెతో వివాహంఅయ్యేదేమో. కాని తండ్రికి ఎదురుచెప్పటానికి సాహసించలేకపోయాడు.

రేవుదగ్గరకి లాంచి పెద్దరొదతోవచ్చి ఆగింది. దాంతో విశ్వనాథం ఆలోచనలకి బ్రేకుపడింది. కాబిన్ కి టికెట్టు తీసుకొన్నాడు, లాంచిలో తలుపుదగ్గిర గుమ్మం పైనే కూర్చున్నాడు. కొంచెంసేపయినతర్వాత లాంచి కదిలింది. చూస్తూఉండగానే రేవు బాగా దూరమైంది.

విశ్వనాథం ఒకసారి గోదావరివైపు చూశాడు. నీళ్లు పోతపోసిన బంగారంలా మెరిసిపోతున్నాయి. అక్కడక్కడ చేపలు కుప్పిగంతులు వేస్తున్నాయి. విశ్వనాథం ఆలోచనలు సుడిగుండాలవలె తిరుగుతున్నాయి. ఒకదానికీ, ఒకదానికీ సంబంధం లేదు. ఒకవైపు, ఇన్నేళ్ళతర్వాత తనవాళ్ళను కలుసుకోబోతున్నాంగదా అని ఒక వింతసంతోషం. రెండోప్రక్క మేలుకున్న గతస్మృతులు పెట్టే కలవరం.

విశ్వనాథం తన పెళ్ళినిగూర్చి ఆలోచించసాగాడు. ఆ పెళ్ళిజరిగిన వారంరోజులలో తనుపడ్డఅవస్థకు తానే ఆశ్చర్యపడుతున్నాడు ఇప్పుడు. కాని ఆనాడు తన సన్నిహితులనుకున్న వారంతా కత్తికట్టినట్టు వ్యవహరించారు. ఆనాటిపరిస్థితులకు తాను లోబడినందుకు, తనజీవితంఎలామారిపోయిందో తలుచుకుంటే, ఆవేదనఇంకా ఎక్కువవసాగింది. తండ్రి అధికారం, తల్లి కన్నీళ్ళు అక్కయ్యల అర్థంలేని ఉపశమనాలతో, తన పెళ్ళి ముక్కాముల కాపురస్థులు, సూరన్నగారి కుమార్తె, శాంతతో పెద్దల సముఖాన వైభవంగా జరిగింది. అందులో తాను ఒకనిమిత్తమాత్రుడు అన్నట్లుగా సంచరించాడు. కాని తను పడిన ఆవేదన, తాను ఆశించిన అమ్మాయి తనకు కాకపోవటం అన్నీ కలిసి తన్ని బాగా కృంగదీశాయి.



తెలుగుభాషా సమితి నవలల పోటీలో బహుమతిపొందిన "అన్వేషణ" నవల రచయిత శ్రీ పోతుకూచి సాంబశివరావు సమితి ఆధ్వర్యాన గతమాసం విజయవాడలో జరిగిన ఉత్సవంలో లోక్‌సభస్పీకరు శ్రీ ఎమ్. అనంతశయనంఅయ్యంగార్ నుంచి బహుమతి స్వీకరిస్తున్న దృశ్యం.

# ★ గమ్యస్థానం ★

శోభనపు గదిలో జాలిగొలిపే చూపులు ప్రసరిస్తున్న శాంత; కాటుక పెట్టుకున్న కళ్ళో, మరీ ఆకర్షణీయంగా కనిపించే నేత్రాలు, 'తల్లీ నువ్వు నాకు మాతృసమానురాలవు. నన్ను పిరికివాన్నిక్రింద జమకట్టినా సరే, నీకూ నాకూ ఎటువంటి సంబంధమూ ఉండబోదు' అని తను కఠినంగా పలికిన పలుకులూ, ఆమర్నాడే ఎవ్వరికీ చెప్పకుండా తను మద్రాసుకి వచ్చేయడం, అంతా ఒక సినీమారీలులావిశ్వనాథం మెదడులో మెలగింది

మద్రాసులో హోటలు భోజనం, ఆఫీసుకి దగ్గరలోనే కుదుర్చుకున్న తనరూము... ఏదో ఇన్నేళ్ళు ఒంటరిగానే కాలం గడిపాడు. మొదట్లో తను ఎప్పటికైనా నిర్ణయం మార్చుకుంటాడేమో అని తన తండ్రి, మామగారూ ఉత్తరాలు వ్రాసేవారు. కాని వాటి కన్నిటికీ ఒకటే సమాధానం—మౌనం. వాళ్ళకీ విసుగెత్తిందేమో—కొన్నేళ్ళయిన తర్వాత, ఆ ఉత్తరాలు వ్రాయడం కూడా మానేశారు.

బొబ్బర్లంక రేవును లాంచి సమీపించింది. ప్రయాణీకులు బస్సు ఎక్కడ [illegible] అన్నట్లు కంగారుగా సామానులు సర్దుకుని ఎప్పుడు గట్టు చేరుతామా అన్నట్లుగా నిల్చుని చూడసాగారు. ఆ కోలాహలంలో గతంలో విహరిస్తున్న విశ్వనాథం బాహ్యప్రపంచంలోకి ఊడిపడ్డాడు. ప్రయాణీకుల త్రోపిడి ఆగేవరకు నిలబడి విశ్వనాథం మెల్లిగా బస్సుస్టాండుకి చేరుకున్నాడు. మొదట రెండు బస్సులలో ఖాళీ లేదు. మూడో బస్సు అప్పుడే వచ్చింది కాబోలు, అందులో డ్రైవరు ప్రక్కన ఫ్రంట్ సీటులో కూర్చున్నాడు. కండక్టరు రాగానే, అమలాపురానికి టికెట్టు పుచ్చుకొన్నాడు. కొంత సేపటికి బస్సుకూడా కదిలింది. విశ్వనాథం రోడ్డువైపు చూశాడు. తారురోడ్డు నిలంగా మెరిసిపోతోంది.

విశ్వనాథం ఆలోచన తన స్వగృహం మీదికి మళ్ళింది. తన తల్లిని, తండ్రిని చూసి చాలా ఏళ్ళయింది. తను మద్రాసు వచ్చేసిం తర్వాత, ఉత్తరాలలోనే, వాళ్ళ క్షేమసమాచారాలు తెలుస్తూ ఉండేవి. 'ఇప్పుడు బాగా ముసలివాళ్ళయి పోయుంటారు,' అనుకున్నాడు.

బస్సు ఓబలంకదగ్గిర ఆగింది. ప్రయాణీకులంతా కాఫీ ఫలహారాలు చేయడానికి దిగుతున్నారు. విశ్వనాథం తన సీటులోనే కూర్చుని సిగరెట్టు వెలిగించి ఏదో ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఎవ్వరో ఇద్దరు బస్సు దగ్గిరికి రావడం చూశాడు. భార్యాభర్తలు కాబోలు, ఆ అమ్మాయిని కొంచెం పరిశీలించి చూశాడు. వెంటనే ముఖం అవతల వైపుకి త్రిప్పి ఆలోచించ సాగాడు. ఆ అమ్మాయిని చూడగానే, విశ్వనాథానికి తను మనసుగొన్న మద్రాసు అమ్మాయిలా కనిపించింది. ఇదే ఇదివరకయితే తను ఎంతో ఆనందం, ఆందోళన కనపర్చి ఉండేవాడు. ఇప్పుడు ఆ తలపు వచ్చినా, శూన్యంలో ఆలోచిస్తున్నట్లే ఉంది.

ఆ పెద్దమనిషి విశ్వనాథం ప్రక్కనే కూర్చున్నాడు. ఆయనే పల్కరిద్దామా, వద్దా అని ముందు కొంచెం శంకించినా, చివరికి "ఏ ఊరు వెళ్తున్నారండీ" అని మాటవరసకి అడిగాడు. విశ్వనాథం అప్రయత్నంగా "ముక్కామల" అని చెప్పాడు. కాని వెంటనే నాలిక కరచుకున్నాడు. తను అలా ఎందుకు చెప్పాడు? తను వచ్చినా అక్కడకు వెళ్ళడుగదా! దాని అధ్యాయం ఏనాడో పూర్తిఅయి పోయింది. అని సర్దుకుని "క్షమించండి. అమలాపురమే వెళ్తున్నాను" అని ఆ పెద్దమనిషికేసి తన లోటుబాట్లు ఏమైనా గమనించాడా అని చూశాడు. పొరబాటు ఎవ్వరికైనా సహజంలే అన్నట్లు ఆయన ఓ పత్రిక తీసి చదువుకుంటూ ఉన్నాడు.

ప్రయాణీకులంతా తిరిగి ఎక్కాంతర్వాత బస్సు బయలుదేరింది. విశ్వనాథం ఎంత వద్దనుకున్నా అతని ఆలోచన ముక్కామల మీదికే మళ్ళింది. తన మామగారిల్లు... ఇంటిలోపల పెద్దమండువా ఆమండువా ఒక్కటే తనకుబాగా గుర్తుకు వస్తోంది. మిగతా పరిసరప్రాంతం తనకు అంతగా గుర్తుకురావటంలేదు. ఇప్పుడు ఆ ప్రాంతం అంతా ఎలా వుంటుందో కొంచెం ఊహించుకోసాగాడు. శాంత పెద్దకళ్లు కాటుక పెట్టుకొంటే మరీపెద్దగాకనిపిస్తాయి. అవి తనకు గుర్తుకువచ్చేవి. 'ఇంతికన్నా ఎక్కువ ఆలోచించకూడదు' అన్నట్లుగా విశ్వనాథం ఒక్కనిట్టూర్పు వదిలాడు.

బస్సు కొత్తపేటదాటి పలివెల వంతెన దగ్గర మలుపు తిరిగింది. విశ్వనాథం కాలువ అవతలిగట్టువైపు చూడసాగాడు. అప్పటికి బాగా చల్లబడింది. సూర్యుని కిరణాలు కొబ్బరి ఆకులచాటునుంచి దోబూచులాడుతున్నాయి. ఇంతలో అవతలిగట్టున ఒక పల్లకీ ఎదురయింది. కొత్త పెళ్ళికొడుకు కాబోలు చాలా ఉత్సాహంగా కూర్చున్నాడు. విశ్వనాథం ఆదృశ్యం చూసీచూడనట్టు కాలువవైపు చూడసాగాడు.

బస్సు ముక్కామల సమీపిస్తోంది. విశ్వనాథం గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. బస్సు ముక్కామలదగ్గిర ఆగింది. విశ్వనాథానికిబాగా దాహం వేసినట్లయింది. ఒకసోడా త్రాగుదామని దిగి కిళ్లీకొట్టు దగ్గిరికి వెళ్ళాడు. సోడా త్రాగినతర్వాత తన సీటుదగ్గిరకివచ్చి సంచీ తీసుకొన్నాడు. ప్రక్కసీటులోని పెద్దమనిషి ఏదో అడుగుతున్నా వినిపించుకోకుండా వంతెన వైపు దారితీశాడు. బీడీ వెలిగించి తాపీగాబస్సులోకి ఎక్కుతున్న కండక్టరు 'ఇదేమిటి ఈయన ఇక్కడే దిగిపోయాడే, అనివిస్తుపోయి చూశాడు.





## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# 'ముక్కాలి పీట' పై నిలబడ్డ కాంగ్రెస్

ఇటీవల వార్తల్లో ప్రముఖంగా కనిపించే వారు సిక్కులు, ఢిల్లీ మునిసిపల్ కౌన్సిలర్లు. అధికారం చేజిక్కించుకోవాలని వీరిద్దరూ తాపత్రయపడుతున్నారు. సిక్కులు గురుద్వారాలను, కౌన్సిలర్లు మేయరు పదవిని చేజిక్కించుకోవాలని తెగ ఉబలాట పడుతున్నారు. సిక్కులలో మాస్టర్ తారాసింగ్ పార్టీదే పైచెయ్యిగా ఉంది. ఢిల్లీ గురుద్వారాలపై ఈ పార్టీ అధికారం సంపాదించుకుంది. ఇప్పుడు సిక్కులలో అంతఃకలహాలు అట్టే కానరావటంలేదు. పార్టీల మధ్య స్పర్థలు తగ్గిపోయి, ఇద్దరు వ్యక్తులమధ్య స్పర్థమాత్రం పరిఢవిల్లుతోంది. ఒకాయన మాజీ రక్షణమంత్రి బలదేవ్ సింగ్, రెండో ఆయన గురుముఖ్ సింగ్ ముసాఫిర్. రెండో ఆయన ఇప్పుడు డల్హౌసీలో విహారం చేస్తున్నారు.

మాస్టర్ తారాసింగ్ కూడా ఉత్తర ప్రదేశ్‌లో పర్యటిస్తున్నారు. ప్రధానితో ఆయన చేసుకున్న ఒడంబడిక ప్రకారం నలుగురు సభ్యులతో ఒక కమిటీ నియమించాల్సివుంది. పంజాబ్ ప్రభుత్వం తన కోటాగా ఇద్దరు సభ్యులను నామినేట్ చేసింది. మాస్టర్జీ ఇంకా ఎవరినీ నామినేట్ చేయలేదు. అసలా తన ఒడంబడిక సక్రమందా కాదా అని మళ్ళీ ఆలోచన మొదలైందేమో. ఆయన మనుషులు ఇద్దరూ తేలితేగాని కమిటీపని ప్రారంభించటానికి వీలులేదు. 'అనుమానంగా ఉంటే తురుపు ఆడేసెయ్' అని బ్రిడ్జి ఆటలో మూలసూత్రం. అలాగే మాస్టర్జీ మళ్ళీ పంజాబీ సుభా అంటూ తిరుగుతున్నారు.

సాధారణంగా ప్రభుత్వాల్ని నడిపేది లాయర్లు. లాయరు వృత్తిలో బాగా పేరు మోసినవాడుగాని, దెబ్బతిన్నవాడుగాని సహజంగా రాజకీయవేత్త అవుతాడు. కాని ఢిల్లీలో చిక్కేమిటంటే ఢిల్లీ రాజకీయాల్ని పట్టించుకునేటంత శ్రద్ధ లాయర్లకు లేదు. రాజకీయాలు వ్యాపారస్థుల చేతుల్లో పడ్డాయి. వీరు తమ వ్యాపారమే కాకుండా, ఢిల్లీ మ్యునిసిపల్ కార్పొరేషన్ వ్యాపారంకూడా చేస్తున్నారు. కార్పొరేషనులోని కాంగ్రెస్ పార్టీలో ఎక్కువగా వ్యాపారస్థులే. చేపల బజారు పద్ధతిలో నడిపిస్తున్నారు కార్పొరేషన్ని. అందుకే అంత వాసనకొడుతుంది కార్పొరేషను.

* * *

ఊటీలో జరిగిన సెమినార్ సాదాగా అయిపోయింది. అనుకున్నంత అలజడి కలిగించలేదు.

మొదటి ప్రణాళిక భారీగా వేశారు. రెండో ప్రణాళిక ఇంకా భారీగా వేశారు. మూడో ప్రణాళిక మరీ భారీగా వుండబోతుంది. మన దేశంలో ఎన్నికలు, ప్రణాళిక ఒకేసారి వస్తాయిగనక, ప్రణాళిక అంటే కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళిక అనే అర్థం ఏర్పడింది. రాబోయే ఎన్నికలలో కాంగ్రెసు 'ముక్కాలిపీట' మీద నిలబడి గెలుద్దామని ఆలోచిస్తోంది. ఆ పీటకు ఒక కాలు భూవసతికి పరిమితి, రెండోది సహకార పద్ధతి, మూడోది ఉద్యోగావకాశాలను భారీఎత్తున పెంచటం.

ప్రజాస్వామిక దేశాల్లో అధికారంలో ఉన్న పార్టీ ఎన్నికల్లో మళ్ళీ గెలవాలంటే తను చేసిన ఘనకార్యాలను ఏకరువుపెట్టి సమర్థించుకోవటం అవసరం. రెండో ప్రణాళికవల్ల కలిగిన ఫలితాలేమిటి? ప్రణాళిక ఖర్చు రూ. 4800 కోట్లు అని అంచనా వేశారు. ఇది చాలా తక్కువ అంచనా సుమా అని ఊరడించారు. కాని కొందరు ఇది తలకు మించిన బరువు అని విమర్శించారు. నినాదాలతోను, పిడివాదాలతోనూ ఈ విమర్శకుల నోరు నొక్కారు. ఈ విమర్శకులు చేసిన విమర్శ అంతా హేతురహితమే అయినపక్షంలో ప్రణాళికలోని కొన్ని భాగాలు ఎందుకు కత్తిరించారు? ఇవిమాత్రమే ముఖ్యమైన భాగాలని కొన్నిటిని ఎందుకు పేర్కొన్నారు?

ప్రణాళికా సంఘంలో మిగతా సభ్యులతో ఏకీభవించని శ్రీ కె. సి. నియోగికి సమాధానంగా ప్రణాళికా నిపుణుడు శ్రీ వి. టి. కృష్ణమాచారికి మెరుపులాంటి ఆలోచన తట్టింది. వ్యవసాయోత్పత్తి లక్ష్యాలను నాటికి ఇరవైవంతుల చొప్పున పెంచితే, అంతకంతా నరలం తగ్గిపోయి ప్రణాళిక అమోఘంగా విజయవంతం అవుతుందని ఆయన ప్రకటించారు. ఈ సంకల్పం ఆమోదించబడింది. దీనిపై ముస్సోరీలో పెద్ద సమావేశంకూడా జరిగింది. నా సందేహం ఏమిటంటే — రెండో ప్రణాళిక అంతా తయారై దానిమీద సంతకాలుకూడా పెట్టిన తరవాత వ్యవసాయోత్పత్తిని ఇలా పెంచా

# న్యూఢిల్లీ లేఖ



'హిందూ' పత్రికాధిపతి, సంపాదకులు శ్రీ కస్తూరి శ్రీనివాసన్ గారు జూన్ 22 ఉదయం 3 గంటలకు స్వర్గస్థులయ్యారు. 1934 ఫిబ్రవరిలో వీరు 'హిందూ' పత్రిక సంపాదకత్వం స్వీకరించారు. నాటినుండి దేశంలో పత్రికా వ్యవస్థ ప్రగతికి కృషి చేస్తూ వచ్చారు. కర్ణాటక శాస్త్రీయ సంగీతంపట్ల వీరికి విశేషాభిమానం ఉండేది. మద్రాసు సంగీతపరిషత్ నిర్వహణలో ప్రముఖపాత్ర నిర్వహించారు. శ్రీ శ్రీనివాసన్ వయసు 72 సంవత్సరాలు. భార్య, ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు.

లనే ఆలోచన ఎందుకు వచ్చిందా అని. ప్రణాళికా సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ వి. టి. కృష్ణమాచారి ప్రణాళిక తయారు చేసేటప్పుడు లేరా? మరి ఉన్నట్లుండి ఆయనకు వ్యవసాయోత్పత్తి లక్ష్యాలను పెంచాలని ఎందుకాలోచనవచ్చింది?

ఇదంతా గతజల సేతుబంధనమే అనుకోండి. అయినా శ్రీకృష్ణమాచారిగారిని అడిగితే ఏమంటారంటే, వ్యవసాయోత్పత్తి నాటికి ఇరవై వంతుల చొప్పున పెరగక పోవటంవల్లనే ప్రణాళిక విఫలమైందని అంటారు. ఇది నిజమే కాని, ప్రణాళికా సంఘం మూడో సంవత్సరానికి నిర్ణయించిన మొదటి అంచనాలైనా నెరవేరాయా అని ప్రశ్న.

ఇది గతజలసేతుబంధనమే కాని, ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే, చరిత్ర పునరావృత్తమయ్యే ధోరణి కనిపిస్తోంది. రెండో ప్రణాళికకైతే బ్రిటిష్‌వాళ్ళు అట్టేపెట్టిన స్టెర్లింగ్ నిలవలుండేవి. ఇప్పుడీ నిలవలు కర్పూరంలా హరించిపోయాయి. అదిగాక, ప్రణాళికకోసం భారీ ఎత్తున పన్నులు వేసి ఎలాగో అలాగ ధనం సేకరించారు. కాని ప్రణాళిక పేరు చెప్పి అదనపు పన్నులద్వారా సేకరించిన అదనపు ధనం కాస్తా, ప్రభుత్వోద్యోగుల జీతాల పెరుగుదల క్రిందే ఖర్చయిపోయిందని శ్రీ ఫిరోజ్ గాంధి నిరూపించారు. అందుచేత రెండో ప్రణాళికంతే మూడో ప్రణాళికను వేసినా, దానికి డబ్బు చాలేట్లులేదు.

ఇదీ అసలు పరిస్థితి. కాని ప్రభుత్వమూ, కాంగ్రెసువారిలో ఒక వర్గమూ అంటున్నదేమిటి? పదివేలకోట్ల పెట్టుబడితో భారతదేశాభివృద్ధి సాధించగలమనీ, ఇంత ధనాన్ని ఆహారధాన్యాల వ్యాపారం జాతీయం చేయటంవల్లను, పెట్రోలియం వ్యాపారం, విదేశీ వ్యాపారంవల్లను సేకరించవచ్చుననీ అంటున్నారు.

ఇప్పుడున్న ఉద్యోగాల పరిమితిని అలాగే ఉంచాలని కాంగ్రెసు పట్టుదలగా వుంది.

ఈ విధానం అనుసరించే, పనివారిని రిట్రెంచ్ చేయకూడదని నిబంధన చేశారు. లాభసాటిగా నడవని పారిశ్రామిక సంస్థలను స్వాధీనపరచుకోవాలని ప్రయత్నాలు కూడా జరుగుతున్నాయి. ఉదాహరణకి ఏదైనా పెద్ద నదీలోయ ప్రాజెక్టు పూర్తయిందనుకోండి. అక్కడ పనిచేసే వారికి వేరేచోట పని చూపించాలనే ప్రయత్నం జరుగుతుంది. ఇదిలా ఉండగా నిరుద్యోగాన్ని నివారించటానికిగాని, ఉద్యోగాలెక్కువ చేయటానికి గాని, కనికైతేనేం, ఖాదీ చేనేత పరిశ్రమల మీద, సమాజ వికాస పథకాలమీద కోట్లకొలది ధనం ఖర్చు పెడుతున్నారు.

పరిశ్రమలను జాతీయం చేయడంవలన భారతదేశంలో ఉద్యోగాలకు ఏ నష్టమూ జరగలేదు. జరగకపోగా, ఎయిర్ లైన్స్ కార్పొరేషన్, లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్, స్టేట్ బాంక్, ఆఖరికి ఢిల్లీ ట్రాన్స్‌పోర్టుసంస్థలో పనిచేసే కార్మికుల పరిస్థితులు పూర్వంకంటె బాగుపడ్డాయి.

మరి ఆహారధాన్యాల వ్యాపారాన్ని జాతీయం చేయటంవలన, సహకార సేద్యం వలన కూడా ఇదే మాదిరిగా జీవనాధారమైన వృత్తి ఉద్యోగాలకు హానికలగకుండా ఉంటుందా అని ప్రశ్న. వంశపారంపర్యంగా కనీసం వంద ఏళ్ళనుంచీ కొన్ని కొన్ని వృత్తివ్యాపారాల్లో ఉంటున్న కొన్ని లక్షలమందికి వీటివలన జీవనాధారంపోదా అని ప్రశ్న. పాపం వీరు చేసిన తప్పల్లా సంఘటితులై ఉండకపోవటమే. ఈ వృత్తి వ్యాపారాలను జాతీయం చేయటంవలన జరిగే మేలుకంటే అపకారమే ఎక్కువ.

దేశంలో ఎవరేమనుకుంటున్నదీ సాధారణంగా న్యూఢిల్లీదాకా రాదు. కాంగ్రెసు మొదట జమీందారీలను రద్దుచేసింది గనుక ఇక మిగిలిందల్లా భూస్వామిక విధానాన్ని సంస్కరించటమేననీ, ఒక పరిమితికి పైబడిన భూమిని లాగివేసుకుంటే అది కూడా తీరిపోతుందనీ కాంగ్రెసువాదులు చెబుతున్నారు. భూవసతిని తగ్గించేపని ఒక పదేళ్ల తరవాత తలపెడితే ఏంపోయింది? ఇప్పుడు స్వాధీనం చేసుకునే భూములను భూములు లేనికూలివారికి ఇస్తారా అంటే అది లేదు. అవన్నీ సహకారసంఘాలకిస్తారు. ఈ విధానంవలన అసలు సొంత ఆస్తి అనే వ్యవస్థకే హాని జరుగబోతోంది.

ఆహారధాన్యాల వ్యాపారంలో ఇదివరకు నుంచీ ఉంటున్న వ్యాపారస్థుల స్థానంలో మూడవతరగతి గుమాస్తాలను ప్రవేశపెట్టడం, ప్రభుత్వానికి విధేయులుగా ఉండే భూస్వాములను శత్రువులుగా చేసుకుని అటు భూములు లేని కూలీలకు కూడా అసంతృప్తి కలిగించటం—ఇదంతా కమ్యూనిజంకు దారితీసేపద్ధతి.

సోషలిస్టు పార్టీని రద్దు చేయమని కాంగ్రెసు మూడేళ్ళక్రిందట సోషలిస్టులను కోరింది. ఈ కోరిక కాంగ్రెసువారి సోషలిజంవలన కాక, సోషలిస్టు పార్టీ బలహీనతవలన నెరవేరింది.

కమ్యూనిస్టు పార్టీనికూడా ఇదేవిధంగా నాశనం చేయాలని కాంగ్రెసు సంకల్పిస్తోంది. చైనాలో 'కమ్యూనులు' ఉంటే భారతదేశానికి సహకారసేద్య సంఘాలుంటాయి. చైనాలో భూమిని లాక్కొని, కమ్యూనులకిస్తే, ఈ దేశంలో భూవసతికి పరిమితి పెట్టి, తీసుకున్న భూములను సహకార సంఘాలకిస్తారు. చైనాలో గ్రామీణ వ్యాపారస్థులను రద్దు చేశారు. ఇక్కడా అదే చేయాలని చూస్తున్నారు. ఇంత చేసినా, కమ్యూనిజంకు కాంగ్రెసు సరైన సమాధానం చెప్పగలదా అని. చైనాలో కమ్యూనులు పనిచేసే పద్ధతిలో చేస్తే కాంగ్రెసుకు విజయం లభిస్తుంది. కావలసింది సహకార సంఘాలు కాదు, కష్టపడి పనిచెయ్యడం. నినాదాలు, సిద్ధాంతాలతో పనిజరగదు. పనికితగిన ప్రతిఫలం లభిస్తేనే పనిజరుగుతునది. సహకార సంఘాలవలన సామాన్య మానవుడికి లభించే దేమీలేదు. ఈ సంగతి కాంగ్రెసువారే చాలామంది చెబుతున్నారు. అయితే బహిరంగంగా కాంగ్రెసు విధానాలను వ్యతిరేకించరాదనీ, చాటుగా వ్యతిరేకించే బదులు సంస్థనుంచే తప్పుకోమనీ, నాయకులు అనుచరులను ఒత్తిడి చేస్తున్నారు. ★

# పరోపకారి

సత్యశ్రీ

(గతవారం తరువాయి)

శేషాద్రి ప్రవర్తనకు ఆశ్చర్యపోయాడు బాబాయి.

"యిదేవిట్రా...! యిప్పుడేగా వస్తా! అప్పుడే వెళ్ళడం ఏమిటీ... రెండురోజు లుండి వెళుదువు గాని—" అన్నాడు బాబాయి.

"అదికాదుమావయ్యా...!" అని ఏమిటో చెప్పబోతోంటే బాబాయి మధ్యలో అందుకున్నాడు.

"ఏదికాదు—నీసుఖం...! యిప్పుడు నువ్వు యింటికివెళ్ళి మాత్రం వెలగబెట్టే రాచకార్యాలు ఏమున్నాయని...? వుండు. రెండురోజులు. చేసేలోపులో...?అంటూండగా, సుభద్ర బయటకొచ్చింది తల దువ్వుకుంటూ.

"చూడావే..." వీడిప్పుడే యింటికెళ్తాడట...!" అన్నాడు బాబాయి సుభద్ర కేసి చూస్తూ. సుభద్ర దిగులంతా పోయినట్టుంది, ముఖం ప్రశాంతంగానే వుంది.

సుభద్ర నవ్వింది...శేషాద్రికేసి చూచి మళ్ళా నవ్వింది...! ఆ మందహాసంలో ఎన్నో ఎన్నో కెంపులు, రత్నాలు చప్పుడు చెయ్యకుండా శేషాద్రి ఒడిలో రాలినట్టయింది శేషాద్రికి.!

"అప్పుడే...! ఎలాగూ వచ్చావుగా శేషాద్రీ...! రెండురోజు లుండకూడదూ?' అంది సుభద్ర నవ్వుతూ. "పాపం!" అనిపించింది శేషాద్రిని చూస్తోంటే సుభద్రకు!

"అవునురా—! వుండు! రేపివ్వాళ [illegible] బస్‌లో రామారావుదగ్గరకు వెళ్ళి వాణ్ణి, ఆ వుంగరాల జుత్తు పట్టుకు లాక్కొస్తా...! నువ్వుచూచి చాలారోజు లైందిగా వాణ్ణి... మీరు ముగ్గురు చిన్నప్పుడు కలిసి ఆడుకునే వాళ్లుగా..." అన్నాడు బాబాయి.

శేషాద్రి మస్తిష్కంలో ఏవో ఏవో గత చరిత్రలు గిరగిరా తిరిగాయి. "అవును. ఆడుకునేవాళ్ళం...!" తనలో తనే గొణుక్కున్నాడు.

అయితే యిప్పుడు యింటికి బయలుదేరాలో, బాబాయి కోరినప్రకారంగా, ముఖ్యంగా సుభద్ర అడిగిన ప్రకారం వుండిపోవాలో అర్థంగాక సందిగ్ధావస్థలో పడ్డాడు శేషాద్రి.

"యింటికెళ్ళకపోతే ఎలా...?" అనిపించింది.

"వుండకుండా వెళ్ళిపోతే మాత్రం ఎలా?" అనికూడా అనిపించింది! తను మూర్ఖంగా వెళ్ళిపోతే ఏమనుకుంటాడు... బాబాయి! ముఖ్యంగా సుభద్ర- (తన) సుభద్ర— నోరారా పిలిచి వుండమన్నప్పుడు మాట త్రోసి వెళ్ళిపోతే ఏమనుకుంటుంది...? తిక్కరాయుడు క్రింద కట్టదూ...!

సుదీర్ఘంగా యోచించి, చర్చించిన మీదట రెండురోజు లుంటానికే నిశ్చయించుకున్నాడు శేషాద్రి.

"యింతలో ఏం కొంపమునుగుతుంది! తప్పులేదు ఎల్లుండేగా వెళ్ళిపోయేది." అనుకున్నాడు శేషాద్రి.

చేతులోసంచి క్రిందపెట్టి కుర్చీలో కూర్చుండిపోయాడు నవ్వుతూ.

"సరే—ఎల్లుండే వెళతాలే మామయ్యా!" అన్నాడు శేషాద్రి.

బాబాయి తృప్తిగా నవ్వాడు. సుభద్ర కూడా నవ్వింది. ఆ ముగ్ధమోహన దరహాసంతో పులకరించాడు శేషాద్రి.

—"చాలు—కనీసం ఆ మందహాసం కోసమైనా తను రెండురోజులు వుండొచ్చు. ఏవో ఏవో గతచరిత్రలు స్మరించుకుంటూ, మధురస్మృతుల్ని తలుచుకుంటూ, తియ్యని బాధను అనుభవించడంలో ఆనందం లేదూ?" అనుకున్నాడు శేషాద్రి.

మధ్యాహ్నం రెండుగంటలకు బాబాయితో బస్ వరకూ వెళ్ళి సాగనంపివచ్చాడు. బాబాయి వెళ్ళేటప్పుడుకూడా వెళ్ళిపోవద్దని మరీచెప్పివెళ్లాడు, రేపు సాయంత్రానికి వస్తామంటూ.

శేషాద్రి యింటికొచ్చేసరికి టీ, టిఫిను తయారుగాపెట్టి వుంచింది సుభద్ర - పైగా తనకిష్టమైన వేడివేడి పకోడీలు."

"తీస్కో శేషాద్రీ...!" అంది సుభద్ర నవ్వుతూ.

శేషాద్రి టిఫిన్ చేసిన తరువాత టీ తాగుతోంటే సుభద్ర ప్రశ్నించింది:

"నువిప్పుడేం చేస్తూన్నావు శేషాద్రీ...! నిన్ను చూసి చాలా రోజులైంది కదూ...?" మల్లె పువ్వులాంటి కళ్ళల్లో ఏదో చిలిపితనం కనిపించింది!

శేషాద్రి గుటకలేశాడు.

"ఏం చేస్తూన్నాడు...? నిరుద్యోగం!' అనుకుని పైకి, ప్రయత్నిస్తూన్నా...! మొన్ననే వైజాగ్ నుంచి యింటర్వ్యూవచ్చింది అన్నాడు తలవంచుకునే.

"అత్తయ్య కులాసాగా వుందా...?" మరో గుటక వెయ్యబోయాడు. అయితే గుటకపడక పొరపోయి, ఉక్కిరిబిక్కిరి అయ్యాడు శేషాద్రి...!

"ఆఁ...!" అన్నాడు నసుగుతూ.

తనకెందుకో యిప్పుడు సుభద్ర, తనంతట తను చనువుగా మాట్లాడిస్తోంటే సిగ్గుగావుంది మాట్లాడడానికి...మరి ట్రెయిన్‌లో యింత యిదిగా మాట్లాడలేదే...? అప్పుడు రామారావు మీద అలిగివస్తూంది కదూ. బహుశః ఆ 'మూడ్'లో వుండి వుంటుంది అనుకున్నాడు శేషాద్రి.

సాయంత్రం ఏమీ తోచక బాబాయి పాలేర్లతోకలిసి పొలంలోకెళ్ళాడు చూట్టానికి. పొలంలో పల్లెపడుచులు, పాటలు పాడుతూ వరికోస్తోంటే కాసేపు చూచాడు.

సాయంత్రం మునిమాపువేళకు యింటికి తిరిగొచ్చాడు శేషాద్రి. పనిమనిషి నీళ్ళుతోడితే స్నానంచేసి, అరుగుమీద కుర్చీలో కూర్చున్నాడు. కూర్చున్న పదినిమిషాలకే యింట్లో నుంచి వంటమనిషి వచ్చింది.

"అన్నం పెట్టానండి...!" అంది వంట మనిషి.

శేషాద్రి సంశయించాడు - సుభద్ర ఏమ యింది? "తను పిలువకూడదూ?" అను కున్నాడు శేషాద్రి సంశయాన్ని కనిపెట్టి, "సుభద్రమ్మగారు గదిలో పడుకున్నా రండి...! జ్వరం తగిలిందంట!" అంది.

శేషాద్రి ఉలిక్కి పడ్డాడు. "జ్వరమా...! ఇంతలో ఎలా వచ్చింది...?" అనుకుంటూ లేచి, సుభద్ర పడుకున్న గదిలోకి వెళ్ళాడు.

గదిలో సుభద్ర పడుకునివుంది. ఒంటి నిండా దుప్పటి కప్పుకుంది. చలితో వణు కుతూ బాధపడుతోంది తలపట్టుకుని. చంటి వాడు వేరే మంచంమీద పడుకునివున్నాడు.

సుభద్రస్థితి చూడగానే నీరయిపోయాడు శేషాద్రి!

"సుభద్రా-!" అంటూ పిలిచాడు.

సుభద్ర లేచింది.

"కూర్చో శేషాద్రీ-!" "ఏవిటో...అనుకో కుండా జ్వరంతగిలింది...! రాత్రి తడిశాను కదూ-?" అంది సుభద్ర...!

క్షణంసేపు! శేషాద్రికి ఏం మాట్లాడాలో తెలియలేదు.

"అరె! మామయ్య కూడా యింటి దగ్గర లేడే... యిప్పుడెలా...?" అన్నాడు. సుభద్ర నవ్వింది.

—"లేకపోతే మాత్రం ఏం...? జ్వరమేగా! అదయినా రాత్రి తడవబట్టి తగి లింది... రేపు ప్రొద్దున్నకు అదే జారు తుంది...!"

కొంతసేపు యోచించినమీదట, "ఇక్కడ డాక్టరెవరూ లేరనుకుంటా...!" అన్నాడు శేషాద్రి.

"ఈమాత్రానికి డాక్టరెందుకు...? నువ్వెళ్ళి భోజనంచెయ్యి! ఏం ఫరవాలేదు" అని పడుకుండిపోయింది సుభద్ర.

కొన్ని క్షణాలు అలానే నిలబడి, బయట కొచ్చాడు శేషాద్రి. భోజనంకూడా సరిగా సహించలేదు.

"ఇదేమిటే...! మధ్యాహ్నంకూడా బాగ నేమాట్లాడింది...! యింతలోనే యిది ముంచుకొచ్చిందే...?" పైగా మామయ్య కూడా యింటిదగ్గర లేడే...!" అని కంగారు పడ్డాడు శేషాద్రి.

బాబాయి జీతగాడు, అరుగుమీద మంచం వరుపువేస్తే పడుకుని సుదీర్ఘమైన యోచ నలో పడ్డాడు...

అవతల గదిలోనుంచి సుభద్ర సన్నగా మూలుగుతూన్న శబ్దం వినిపిస్తోంది. శేషా ద్రికి ఎంత ప్రయత్నించినా నిద్రరావడం లేదు... "సుభద్ర అలా బాధపడుతోంటే తనకు నిద్ర ఎలా పడుతుంది? యిటువంటి సమయంలో తను చెయ్యగల సహాయం ఏమిటి...?"

మంచంమీదనుంచి లేచి, గది దగ్గరకు వెళ్ళాడు శేషాద్రి. గది తలుపులు దగ్గరవేసి వున్నాయి—సందుల్లోనుంచి లోపలకు చూచాడు. లోపల దోమతెర కట్టుకొని తోడుగా పడుకుంది.

శేషాద్రి ఆమెను బయటకు పిలిచాడు.

"ఎలావుంది సుభద్రకు ?"

"జ్వరం ఎక్కువైందండి...!కళ్ళు మసిలి పోతుంది. పైగా ఏవో కలవరింతలు...!"

శేషాద్రి మంచందగ్గరకు వెళ్ళి చూచాడు. సుభద్ర మూలుగుతూ, ఏవో కలవరిస్తోంది. "రామారావుమీద అలిగివచ్చిందికదూ. అవే కలవరింతలు !" అనుకున్నాడు. ఒంటిమీద చెయ్యివేసి చూద్దామా అనుకున్నాడుగాని, ఎందుకో ధైర్యం చాలిందికాదు. నిలబడి పిలిస్తే, ఎక్కడో నూతిలోనుంచి సమాధానం వచ్చినట్టు వచ్చింది, సుభద్ర దగ్గరనుంచి.

శేషాద్రి తేజారిపోయాడు. "ఇక ఆలస్యం చెయ్యకూడదు !" అనుకున్నాడు. వెంటనే అక్కడనుంచి బయటకొచ్చేశాడు—

అప్పటికి రాత్రి 8-30 అవుతుంది.

ప్రక్కనే వున్న పాకలో పడుకున్న పాలేర్లని నిద్దర్లేపాడు.

"పదండి...! ఏలూరు వెళ్లాలి...!" అన్నాడు.

వాళ్ళకు దేనికో అర్థంకాలేదు మొదట.

"సుభద్రకు జ్వరం ఎక్కువైంది బండి కట్టండి, డాక్టర్ని తీసుకురావాలి...!" అంటూ తొందర పెట్టాడు శేషాద్రి.

వాళ్ళు కంగారుగా బండికట్టి తీసు కొచ్చారు.

"తొందరగా పోనివ్వండి తొందరగా!" అంటూ ఎక్కి కూర్చున్నాడు శేషాద్రి. అక్కడికి ఏలూరు రెండు మైళ్ళు వుంటుంది. తారోడే కాబట్టి బండి తొందరగానే చేరుకుంది.

బండి ఏలూరు చేరుకోగానే ఏ డాక్టరుదగ్గ రకు వెళ్ళి పిలవాలో సందిగ్ధంలో పడ్డాడు. ఎవరి దగ్గరకువెళ్ళి యిప్పుడు రమ్మన్నా, ముందు జేబులో రూపాయలు పడ్డందే అంతదూరం రారు. అయితే రూపాయల కోసం తనిప్పుడు వెతుక్కో వలసిన పనంటూ లేదు. తను పీకమీద కూర్చుని వసూలుచేసు కొస్తున్న అద్దె డబ్బు వుందిగా...! అది ఈ విధంగా వినియోగపడుతుందని ఏనాడైనా ఊహించాడాతను...? అసలు అక్కడికి వస్తా డని, ఈ విధంగా పరిణమిస్తుందని అను కున్నాడా...?

బండిని రోడ్డు కార్నర్‌లో ఆపుచేసి, వాళ్ళను అక్కడుండమని, తను రెండు మూడు సందులు దాటి ఒక మేడ ముందు ఆగాడు.

"డా॥ శ్రీనివాసరావు...! తనకు బాగా తెలుసు...! తన తండ్రికి మంచి స్నేహితుడు కూడా...! అడిగిన వెంటనే వస్తాడు..." అనుకుంటూ మెట్లెక్కి, అరుగు మీద కొచ్చాడు శేషాద్రి—

ప్రక్కన ఉన్న ఆఫీసు రూము యింకా తీసివుంది—10 గం॥ అయితే గాని కట్టెయ్యర్ డాయన. గదిలో ఎవరో యిద్దరి ముగ్గురితో కలసి మాట్లాడుతున్నాడు డాక్టరు.

అంతలో ఒక కంఠస్వరం వినగానే ఉలిక్కిపడ్డాడు శేషాద్రి. రెండడుగులు వేసి, ప్రక్క కిటికీలోనుంచి లోపలకు చూచాడు. కాళ్ళు తడబడ్డాయి...! చెమటలుపోశాయి. "ఎవరది...? తన తండ్రి...! యిక్కడి కెందుకొచ్చాడు...?"

అంతే, వెంటనే గిరుక్కున వెనక్కి తిరిగి, ఊపిరి బిగపట్టుకుని, చర చరా నడచి, సందు దాటి, బండివున్న కార్నర్ దగ్గరకొచ్చి పడ్డాడు ఒగర్చుకుంటూ...

# ★ పరోపకారి ★

"పదండి...! రామచంద్రరావుపేటకు పోనియ్. ఇక్కడ డాక్టరు లేడు...!" అని బండిలో చతికిలబడిపోయాడు.

"యింకా నయం...! తనుకనిపిస్తే యింకేమన్నా వుందా...? తను వచ్చిన పని తెలిస్తే...? తను చాలా అదృష్టవంతుడు ఈ రోజు...!"అనుకున్నాడు.

అసలు తన తండ్రి యిక్కడకు ఎందుకొచ్చినట్టు...? డాక్టరుతో అంత అవసరంగా యింత రాత్రిలో, అంత దూరం నుంచి వచ్చి మాట్లాడాల్సిన అవసరం ఏముంటుంది...? ఒకవేళ తన తల్లికి మరీ ప్రమాదంగా వుందా...?

ఇది తలుచుకున్న తరువాత గుండె ఝల్లుమంది శేషాద్రికి.

"అసంభవం...! యింతలోనే ఏం ప్రమాదం ముంచుకొస్తుంది...?" అంటూ సమాధానపడ్డాడు...అయితే తన తండ్రికి, అంత దూరంనుంచివచ్చి డాక్టర్‌తో మాట్లాడాల్సిన అవసరం ఏవిటో అర్థం కాలేదు—

"ఏవిటో! అంతా అయోమయంగావుంది ...అసలు యిలా జరుగుతుందని తను అనుకున్నాడా...? రేపు రాత్రికల్లా యింటదగ్గరుంటాడతను—యింతలోనే కంగారుపడటం దేనికి...?" అనుకున్నాడు.

బండి రామచంద్రరావుపేటలో ఒక డాక్టరింటి దగ్గర ఆగింది. గబగబా బండిదిగి లోపలికెళ్ళాడు. డాక్టరప్పుడే భోజనంచేసి బయటకొచ్చాడు.

విషయం అంతా చెప్పి, తమరు ఒకసారి దయచెయ్యాలి...!' అన్నాడు వినయంగా.

డాక్టరు కదలనట్టే కనిపించాడు—యిక ఆలోచించగూడదనుకుని జేబులోనుంచి పాతికరూపాయలు తీసి డాక్టరు చేతిలో పెట్టాడు. అప్పుడు శేషాద్రి చేతులు గబగబా వణికాయి.

డాక్టరు ముఖం వికసించింది. నవ్వాడు.

"అయ్యయ్యో......ఎందుకలా వణుకుతున్నారు—? ఏం ప్రమాదం లేదు. నే వస్తూన్నాగా...!" అంటూ ధైర్యం చెప్పి లోపలకెళ్ళాడు.



శేషాద్రి సిగ్గుపడ్డాడు. "ఛీ! తను వణుకుతున్నాడా? తనింత పిరికివాడా? యింటి దగ్గర ఈరూపాయలకు ఆమాత్రం సమాధానం చెప్పలేడూ—?" అని తనలో తనే తన పిరికితనానికి నవ్వుకున్నాడు శేషాద్రి.

డాక్టరు రాగానే, బండెక్కాడు.

బాబాయి యింటిదగ్గర బండి ఆగేసరికి 10 గం॥ అయింది. బండి దిగి గబగబా లోపలకు వెళ్ళారు. తలుపుతట్టాడు శేషాద్రి. పనిమనిషివచ్చి గదితలుపు తీసింది.

"సుభద్ర కెలా వుంది......డాక్టరొచ్చారు...!" అంటూ గదిలోకెళ్ళారు. సుభద్ర నిద్రపోతుంటే పిలిచి లేపాడు.

"ఎలా వుంది సుభద్రా? డాక్టరుగారొచ్చారు...!"

సుభద్ర నిద్రమత్తుతో లేస్తూనే తెల్లపోయింది.

"అరె! ఈమాత్రందానికి డాక్టరుగార్నెందుకు తీసుకొచ్చావు? జ్వరం జారిపోయిందిగ!"

డాక్టరు సుభద్ర చెయ్యిచూచి, ఒక యింజక్షన్ యిచ్చాడు సుభద్ర వద్దంటున్నా వినిపించుకోకుండా.

"మరేం ఫరవాలేదమ్మా......! రేపటికి పూర్తిగా జారిపోతుంది...! మామూలు జ్వరమే...! మరేం కంగారుపడకండి...!" అని బయటకొచ్చేశాడు.

మళ్ళా అతన్ని బండెక్కించి, యింటి దగ్గర దింపిరమ్మని పంపించాడు పాలేర్ని— పంపి సుభద్ర వున్న గదిలోకి వచ్చాడు.

"యిందాక నీ పరిస్థితిచూస్తే నాకు కంగారు ఎత్తింది...! మామయ్యకూడా యింట్లో లేకపోయె. నాకు భయమేసింది. అందుకనే డాక్టర్ని తీసుకొచ్చాను—" అంటూ ముందుగానే విన్నవించుకున్నాడు సుభద్రేమన్నా అంటుందేమోనని.

ఏమయినా శేషాద్రిచేసినపని అనవసరమే ననిపించింది సుభద్రకు...! "ఎందుకు శేషాద్రీ...! యింతమాత్రం దానికే అంత కంగారెందుకు? రెండు మైళ్ళు వెళ్ళి డాక్టర్ని తీసుకురావాల్సిన అవసరం ఏముందని...! విజిటింగ్ ఫీజు అదీ దండగ...అందులో రాత్రులు...యింత దూరంరావాలంటే...ఎంతయిందేమిటి...? కనీసం డాక్టరుకోసం ఏలూరు వెళుతూన్నాననికూడా చెప్పలేదే నాతో...!" అంది సుభద్ర.

"ఫీజెందుకూ...? ఆయన నామిత్రుడే! మనబండే తీసుకెళ్ళాంగా! యింట్లో యిప్పుడు నష్టపోయిందిమాత్రం ఏముంది...!" అంటూ బొంకాడు శేషాద్రి.

సుభద్రను యిక మాట్లాడకుండా పడుకోమనిచెప్పి, తను అరుగుమీద కొచ్చాడు. ప్రక్కమీద పడుకుని ఏదో ఏదో ఆలోచిస్తూ చాలా సేపటికిగాని నిద్రపోలేదు శేషాద్రి.

* * *

తెల్లవారిం తరువాత సుభద్రకు జ్వరం పూర్తిగా జారిపోయి తేలిగ్గావుంది - శేషాద్రికికూడా హృదయం చాలా తేలిక అనిపించింది...!

"తన కర్తవ్యం తను నెరవేర్చుకున్నాడు...! అది సుభద్రకు యిష్టంలేకపోయినా తనకు తృప్తిగావుంది...అంతే చాలు...! మామయ్యకూడా యింటిదగ్గర లేనందుకు మాట దక్కించుకున్నాడతను.!" అనుకున్నాడు శేషాద్రి- అయితే యింటి దగ్గర పరిస్థితి ఎలావుందో అనికూడా అనుకున్నాడు.

సుభద్ర, కాఫీ, నేతి పెసరట్లు తీసుకొస్తే తీసుకున్నాడు—అదయినా పరధ్యాన్నంగా, ఏదో ఆలోచిస్తూ, నెమ్మదిగా ఎక్కించాడు.

"తనిప్పుడు మామయ్య వచ్చిందాకా వుండాలా...? యింటికెళ్ళాలా...?' అనుకున్నాడు. ఎలాగయినా రాత్రి తన తండ్రి డాక్టర్‌తో మాట్లాడ్డం చూచింతరువాత ఎందుకో అనుమానంగానే వుంది శేషాద్రికి.

"బాబాయి యివ్వాళే వస్తాడని నమ్మకం మాత్రం ఏముందీ...? మరో రెండురోజులు పట్టగూడదా? అసలు తను రామారావును చూడాల్సిన అవసరం ఏమిటి...? తనకు వాడితో పనేముందని...? అసలు తను యిక్కడ ఈ విధంగా చిక్కుపడాల్సి వస్తుందనుకున్నాడా...?

పెంకుర్చీలో పడుకుని కాళ్ళుచాపి దీర్ఘంగా ఆలోచిస్తూండగా, మెఱుపులా మరో కొత్త అనుమానం ఒకటి శేషాద్రి మస్తిష్కంలో ప్రవేశించింది.

ఉలిక్కిపడి లేచాడు.

"అవును"! తన తండ్రి యిక్కడకొస్తే...? తప్పకుండా వస్తాడు? యింత దూరంవచ్చి, మామయ్యను కలుసుకుండా మనేఉద్దేశంతో రాకుండా మానడు...! యింకా నయం! తనకు యింతవరకూ అది తట్టనేలేదు...!"

వెంటనే కుర్చీలోనుంచిలేచి, గోడకు తగిలించివున్న సంచి అది తీసుకున్నాడు— ఏమయినాసరే యిక ఆగకూడదనుకున్నాడు శేషాద్రి.

సుభద్ర యింట్లోవుంటే పిలిచాడు.

బయటకొచ్చింది సుభద్ర.

"నే వెళతాను సుభద్రా...! బస్‌కి టైం అయిందిగా...!" అన్నాడు. సుభద్ర తెల్ల బోయింది...

"అదేమిటి శేషాద్రీ...? బాబాయి వచ్చిందాకా వుంటానన్నావుగా...! యింకెంత యివ్వాళ సాయంత్రానికి వస్తారు...!" అంది సుభద్ర శేషాద్రికి యింత తొందరలో వెళ్ళాల్సిన అవసరం ఏమిటో అర్థంగాక.

"కాదు సుభద్రా—! నాన్న తొందరగా రమ్మంటూ కబురు చేశాడట...! రాత్రి ఏలూరులో ఓమిత్రుడు కలిసి చెప్పాడు...! బాబాయిని ఏమీ అనుకోవద్దని చెప్పు...! మళ్ళీ రెండురోజుల్లో వస్తానుగా, రామారావును చూట్టానికి...!" అంటూ, మెట్లు దిగి, సుభద్ర వుండమని బలవంతంచేస్తూన్నా వినిపించుకోకుండా బయటకొచ్చేశాడు శేషాద్రి...!

శేషాద్రి ప్రవర్తనకు ఆశ్చర్యపోయింది సుభద్ర.

"ఏమిటో...! వింతమనిషి...! తనేం చేస్తూంటాడో తనకే తెలియదు—తిక్క రాముడు...!" అనుకుంది సుభద్ర.

శేషాద్రి సేరుగా బస్ స్టాండ్ దగ్గర కొచ్చి, అప్పుడే కదలబోతూన్న బస్సును ఆపి, ఎక్కి కూర్చుండి పోయాడు...

బస్, తారోడ్డుమీద శరవేగంగా పరుగెత్తుతోంది. శేషాద్రి ఏదో తలపోస్తూ, బయటకు చూస్తూ కూర్చున్నాడు.

ఆరాత్రి, ట్రెయిన్‌లో సుభద్ర కలిసింది మొదలు, యిప్పటివరకు జరిగిన సంఘటనలు శేషాద్రి మస్తిష్కంలో తిరుగుతూన్నాయి.

అదే అదే పదే పదే తలచుకుంటూన్నాడు శేషాద్రి...

"నిజంగా యిలా జరుగుతుందని ఏనాడయినా ఊహించాడా...! అసలు ఈ సంఘటనలు తన జీవితంలో మళ్ళా మర్చిపోగలడా...? ఎలా మర్చిపోగలడు...ఒకనాటి మధుర స్మృతుల్ని, ఎప్పుడో ఒకప్పుడు, తీరికసమయాల్లో, ఏకాంతంగా కూర్చుని, తలచుకుంటూ, తియ్యని బాధను అనుభవిస్తోంటే అందులో ఎంత ఆనందం వుంది...?" అనుకున్నాడు.

మధ్యాహ్నం 12.30 గం॥ గాని బస్ శేషాద్రి ఊరు చేరుకోలేదు— హడావుడిగా బస్ దిగి యింటిముఖం పట్టాడు శేషాద్రి.

తను యింట్లో అడుగు పెట్టగానే అడిగే ప్రశ్న, "యిన్నాళ్ళూ ఎక్కడున్నావురా...?" అంటూ, రెండోది, "చౌదరి అద్దయిచ్చాడా...?" అంటూ రెండో ప్రశ్న.

వీటికి సమాధానం ముందుగానే ఊహించుకుని సిద్ధంగా వుంచుకున్నాడు శేషాద్రి—

యింటికి చేరుకుంటూన్న కొద్దీ, వాతావరణం ఎలా వుంటూందో, అని, గుండెలు కొట్టుకొంటూన్నాయి...అయితే యింట్లో అడుగు పెట్టగానే, శేషాద్రి ఊహించిన వాతావరణం ఏమీ లేకుండా ప్రశాంతంగా వుండటం చూచినమీదట కొత్త హృదయం తేలికనిపించింది శేషాద్రికి.

నెమ్మదిగా తల్లి పడుకున్న గదిలోకి వెళ్ళాడు. తండ్రిజాడ ఎక్కడా కనిపించలేదు. తల్లి మంచంమీద కూర్చునివుంది. ప్రక్కన తన చెల్లెలు కూర్చుని కాఫీ కాబోలు చల్లారబోస్తోంది.

శేషాద్రిని చూడగానే వెంటనే లేచింది చెల్లెలు.

"అమ్మా...! అన్నయ్య వచ్చాడే...!" అంది...

కొడుకును చూడగానే పెన్నిధిని చూచినట్లైంది అవిడకు—నెత్తిమీదనుంచి ఏదో పెద్దబరువు దించినట్లైంది.

"యిన్నాళ్లూ ఎక్కడున్నావురా నాయనా...! నీకోసమే చూస్తూన్నాం! యింతకీ అద్దయిచ్చాడా చౌదరి...?" అంది తల్లి.

శేషాద్రి తొణక్కుండా, కుర్చీలో కూర్చుంటూ అన్నాడు:

"లేదు—మరో పదిరోజులు పోయిన తరువాత రమ్మన్నాడు...! అసలు నే వెళ్ళగానే యింటిదగ్గర లేండే—! వాడొచ్చే వరకూ కూర్చునేసరికి యింత ఆలస్యం అయింది...!"

తల్లి నిరుత్సాహ పడిపోయింది.

"నువ్వంతే రాబాబూ! నోట్లో నాలుక లేదు—వాడు లేదని వట్టిచేతులు చూపితే తెల్లమొఖం వేసుకు తిరిగొచ్చావు...! యిలా జరుగుతుందనే నిన్ననే మీ నాన్న వెళ్లారు చౌదరిదగ్గరకు...! ఆయనవెళితే వూరుకోరులే! పీలకపట్టుకులాగి, మరీ వసూలు చేసుకొస్తారు...! నాన్న నీకు కలవలేదూ.?"

శేషాద్రి ఉలిక్కిపడ్డాడా! గుండె గొంతుకులోకి వచ్చింది!

"నాన్న, చౌదరిదగ్గరకు వెళ్ళాడు...? ఎందుకూ దండగ...!" అంటూ ఉక్రోషంతో, కోపంతో లేచాడుకుర్చీలోనుంచి

"దండగేముందిరా...! నువ్వెళ్ళి వట్టినే తిరిగొచ్చావుగా...రెండునెల్ల అద్దె...! మనయింట్లో పరిస్థితులు యిలా పెట్టుకుని ఎన్నాళ్లని వదిలేసుకు కూర్చుంటాం...! వచ్చేటప్పుడు పేటలో మీ మామయ్యను కలుసుకొని ఏమన్నా అడగమని కూడా చెప్పాను...! నీకసలు సంసారమంటే నే పట్టించుకోవు...! ఎట్లారా...?" అంటూ కొసేపు తల్లి విసుక్కుంది...

శేషాద్రికి యిక ఏమిచెయ్యాలో పాలు పోలేదు... 'కొంప మునిగింది!' అని అనుకున్నాడు—"యిలా జరుగుతుందని ఎప్పుడన్నా వూహించాడా...?"

ఇక శేషాద్రిలోవున్న, కోపం, ఉక్రోషం కట్టుతెంచుకుని బయటకు చిమ్మింది. యిక అక్కడుండలేక గబగబా బయటకు వెళ్లిపోబోయాడు...

"అదేమిట్రా...! మళ్లా ఎక్కడకు...! అన్నంతిని వెళ్లకూడదూ...?" అంది తల్లి.

"ఏట్లోకి...! చావడానికి..." అన్నాడు శేషాద్రి కోపం ఆపుకోలేక...

శేషాద్రికి అంతకోపం ఎందుకో అర్థం కాలేదు.

చరచరా నడిచివెళ్ళే శేషాద్రిని చూచి! "ఏడింత తిక్కరాముడేం...? "అనుకుంది తెల్లబోతూ!



# సంపూర్ణంకాని సంబరం

నీలం రామారావు

త్రాలువుచాటునుంచి తొంగిచూచే పెళ్లి కూతురులా, తెల్లని ఖమీసు తొంగి చూస్తూంది, పతాకంలా రెపరెపలాడే చిలకాకు పచ్చ పల్చని చొక్కా నుండి. గలికి అరవేసిన కోకల్లా ఉయ్యాల లూగుతూన్నాయి-పసుపుపచ్చని పైజమాలు. రెండో ఆటకుపోయే పట్నం పడుచుల తల ముసుగుల్లా, భోగంసాని నమిలి ఊసిన కిళ్లీ రంగు టోపీలు, తలకు తగిలించుకున్నారు.

ఈ 'త్రివర్ణ' దుసులు ఉత్సవానికని హరిదాసు ప్రేరణ చే 'బ్యాండు'వాళ్లు కొత్తగా కుట్టించుకున్నారు. వానిని ధరించడంతో-వాయించవలసిన బ్యాండు విషయంలో శ్రద్ధకు, స్వస్తి చెప్పారు.

మిన్నంటిన కొండలు అమాంతంగా సగానికిపైగా విరిగిపడ్డట్లు, ప్రేలుడు శబ్దాలు వినిపించాయి, సంబరమిక బయలుదేరవలసిందని హెచ్చరికగా. బ్యాండు వాయిస్తున్న వారు-చలికాలంలో చన్నీళ్ళలో మునిగినట్లదిరి పడ్డారు. బ్యాండువనుక, నియమిత క్రమములో బారులుతీర్చిఉన్న సైంధవములు, సూత్రాలు తెగిన గాలిపటాల్లా చెల్లాచెదరయ్యాయి ఆ శబ్దం విని. ప్రజలు మేకల గుంపులా చెదరి చెదరిపోయారు.

వసంతకాలంలో వనములో పుష్పించిన వివిధవర్ణ పుష్పాలవలె, రంగురంగు దుస్తులు ధరించి, అశ్వాల నధిరోహించిన కౌరవ సోదరులు, త్రోవపడని సైకిలు నాపేట్లు-గుర్రాలను అదుపులోకి తీసుకొస్తున్నారు-ప్రయాసతో. యథార్థానికి ఆ కౌరవ వేషధారులందరూ-ఆ యా అశ్వముల యజమానులు కాబట్టే సులువుగా అదుపులో పెట్టగల్గారు.

ఆ గుజ్జుపు గిట్టల త్రొక్కిడికి వంకీలు జుట్టులా వున్న బాటపై, అరడుగు మందంగల ధూళి-ఇల్లంటుకున్న మంటలో వచ్చే పొగ వలె వీరవిహారం చేస్తుంది.

"పదండి ముందుకు; పదండి త్రోసుకు..." శ్రీశ్రీలా-హరిదాసు హెచ్చరించాడు, తమాయించుకు నిల్చున్న బ్యాండు వాళ్ళను జూచి.

కౌబోయే రారాజులా బ్యాండువాళ్లు కదిలారు. బ్యాండు వెనుకఉన్న కౌరవాశ్వములు-సంవత్సరాంతమున లంఘనాలకు వీడ్కోలిచ్చి నడిచే రోగిలా నడక ప్రారంభించాయి. తుదకు సంబరం ముందుకు సాగింది.

ఆ పల్లెలో పెద్ద బుర్రల పట్టికలో కొస్తో-కూస్తో జ్ఞానంగల్గి-అగ్రసరుడనిపించుకున్న హరిదాసు సాయంతో, ఊరి మధ్య చెరువుచెంత ఓ 'కోవెల' నిర్మించుకున్నారు గ్రామస్తులు. ఆ కోవెల ప్రారంభోత్సవ సమయములో పేరుపడ్డ మోతుబర్లవద్ద 'చందా' వసూలుచేసి హరిదాసు పెత్తనంతో తొలిసారిగా ఉత్సవము చేసుకుంటున్నారు.

"కలికాలం గదండీ. అంగుకని రథం ఎలా వుంటేఏమని......" పంచాయితీ అధ్యక్షుడై 'అ-ఆలు' నేర్చుకున్న పులికన్నకన్నయ్యకు-కౌరవసైన్యం వెనుక అలంకరించిన రెండెడ్ల బండ్లను చూపిస్తు అన్నాడు హరిదాసు, వధూవరులకు 'చుక్క' చూపించే ధోరణిలో.

"బాగా గెలిపిచ్చావోయ్ దాసూ" వర్షాకాలం కప్పల బెకబెకల్లా-అభినవ మెయిలు కూత మోతతో అధ్యక్షుడు ఉవాచ.

"ఆ వచ్చే రథం చూడండి. చూస్తున్నారా!! అడుగో అర్జునుడు. ధర్మయ్య లేడండీ! వాడి తమ్ముడు" హరిదాసు తొలి రథాన్ని పరిచయం చేశాడు.

అది అర్జున రథము: హాలమును పట్టేందుకు అలవడిన హస్తాలతో ధనుర్బాణాలను (కర్రవి) అప్పుడే 'డ్రైవ్' చేయడం నేర్చుకొనేవాడు 'స్టీరింగ్' పట్టుకున్నట్లు పట్టుకున్నాడు. సరదాకొద్దీ సంబరపడి మేకప్ మేన్‌తో మరీ దెబ్బలాడి అర్జునునకు తూకం గల దుస్తులు ధరించాడేమో-పాపం- వయసుమళ్ళిన ముసలాడివలె నిల్చున్నాడు.

"నల్లనయ్య ఎలా వుంటాడోయ్ దాసు"! అని ప్రశ్నించే వారికి "అడుగో చూడండి రథ సారథిగా కూర్చున్నాడు" అని దాసు సమాధానం.

ముదర ముద్దమందారంచాయలో ఉన్న సారథి కృష్ణుడు-కృష్ణ సులోచనాలను కండ్లకు ధరించి, ఎడ్ల పగ్గాలు చేపట్టి, ప్రక్కన గుమిగూడిన గుంపులో, తన యింటావిడను జూచి-పండిన దానిమ్మపండులా నోరువిప్పి నవ్వాడు.

"ఏందిరాది! నీ పిల్లాన్ని చూస్తట్రాకి" ఎదుటి రథంలోని కర్ణుడు కృష్ణున్ని పృచ్ఛించాడు.

"పోరయినీ, నా గొడవ నీ కెందుకు" విదిలింపుగా అన్నాడు కిష్టయ్య.

"ఎదవనాయాల...ఈ విసంవిసి- ఆవిసాకేట్రా;" కర్ణకఠోరంగా కర్ణుడన్నాడు.

"దాసూ! వాళ్ళు భారతం కథ మొదలెడుతున్నారు. ఇక పొమ్మను" అధ్యక్షుని ఆర్డరు.

మరో రథం ట్రాక్టరులా దూసుకొచ్చింది. కౌరవజ్యేష్ఠుడు, పాండవద్వితీయుడు గదాయుద్ధంలో మదమెక్కిన గున్నయేనుగుల్లా 'ఢీ' కొంటున్నారు. వాళ్ళరువురు 'పట్టు' బాగా పట్టినట్టున్నారు. 'పెండ్యులము'లా వారి గదాలు ఉయ్యాలలూగుతున్నాయ్. డేంజర్ లైట్లలా కళ్ళు ప్రజ్వలిస్తున్నాయ్.

నెలగో జిల్లానుంచి గొడ్లపాకలో తర్ఫీదు

(42-వ పేజీ చూడండి)



# ఇది మన సాంప్రదాయం

మన గ్రామీణ ఆర్థికవ్యవస్థ సాంప్రదాయ సిద్ధంగా పటిష్ఠమైనది. గ్రామాల్లో వుంటున్న ఆ శిల్పుల దిగ్దగంతాలకు వ్యాపించే శిల్పకళా వైభవాన్ని చూడండి తరతరాలుగా వారికి అందిన వారసత్వమా శిల్పకళా నిపుణత. అయితే మిత వ్యయము, పొదుపుఅనేవి కూడ సగర్వంతో అలవర్చుకొన్న సాంప్రదాయాలే. పొదుపుచేసే పద్ధతి, దాని ఆవశ్యకత వారు ఆచరణలో మనకు చూపుతారు.

భవిష్యదవసరాలకు తగిన ఆర్థికరక్షణను చేకూర్చి భావికాల పురోభివృద్ధికి ఉపయోగపడే యీ మితవ్యయము, పొదుపు జీవితబీమాలో ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తాయి.

*క్రమపద్ధతిలో పొదుపు చేయునదియే జీవితభీమా. జీవితాన్ని దుర్భర సంశయాత్మక సంఘటనలకు తావీయక వార్ధక్యంలో అవసరమైన రాబడి నిప్పుటయేగాక, ఆకస్మిక మరణం సంభవించిన పక్షంలో కుటుంబాన్ని ఆర్థిక బాధలనుండి రక్షించి, వారికి నిశ్చితమైన రాబడినిస్తుంది. జీవిత భీమా మాత్రమే ప్రసాదించే యీ సౌకర్యములను మీరుకూడా పొందండి. మీకు సరైన భీమా పథకమును చూపుటకు జీవితభీమా ఏజెంటు సహాయపడును.*



## జీవిత భీమా

—మీరు బీమా చేసిననాడే మీకు రక్షణ కలుగుతుంది.

EP/LIC/52

# భూమి లోపలి విశేషాలు

డా॥ ఎస్. భగవంతం

## భూమాత ఎలా అవతరించింది? ఎలా పుట్టింది?

ఈ ప్రశ్నకి సమాధానం కోసం మనం వేద వాదాలనుండి విజ్ఞాన వీధులదాకా అనేకవిధాల అన్వేషణ సాగించవచ్చు; అపైన ఊహాగానాలు మొదలుపెట్టి వాటిపైన వాద వీధులలో దుమారాలు లేపి, అందులోంచి భూమి పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకో ప్రయత్నించవచ్చు.

క్రైస్తవమతాచార్య డొకాయన, భూమి పుట్టిన రోజుఫలానా అని చాలా ఖచ్చితంగా చెప్పాడు. సరిగ్గా క్రీస్తుకు పూర్వం 4004 వ సంవత్సరంలో అక్టోబరు 26 వ తారీకు ఉదయం తొమ్మిదిగంటలకు భూమి పుట్టిందని ఆయన నిర్ధారణ చేశాడు. హైందవ ఖగోళశాస్త్రం అంచనాల ప్రకారం భూమి వయస్సు 197,29,49,060 సంవత్సరాలని ఒకవాదం. అదే ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని అడిగితే ఇంకో నూరుకోట్ల సంవత్సరాలు కలపమంటుంది. శాస్త్రరీత్యా 800 కోట్ల సంవత్సరాలనాటివి అని నిర్ణయించిన ఖనిజాలు కొన్ని ఉన్నాయి. దీని ప్రకారం హీనపక్షం ఇంతవయస్సూ వుంటుందనుకోవాలి కాబట్టి, అంతకు పూర్వం ఇంకో నూరుకోట్లఏళ్ళ క్రితంఅయినా భూమి అవతరించి ఉండాలని అంగీకరించవచ్చును.

## ఋణానుబంధం ఎంత?

భూమిమీద మానవుడు ఎన్నాళ్లుంటాడు ఇది మనకి ఎంతకాలం వాసయోగ్యంగా ఉంటుంది? అంటే ఊహాగానం ఎంతసేపైనా చెయ్యవచ్చు. కాని నేలమీద నిలబడి నేటి తీరుతెన్నులూ, మానవుడి విజ్ఞానిక పురోగమన వేగం చూడగా, పది కాలాలపాటు భూమి, మనంకూడా కదిలించగా ఉండేందుకు మనిషి మాతకోసం ఉండనిస్తాడని తోచదు.

'రేపు' వేపు దృష్టిసారించిచూస్తే, మానవుడు భూగోళవాసుడుగా ఆట్టేకాలం వాసకలడని అనిపించదు.

భూగోళం అంతరాంతరాంతరాలలో ఏమి ఉంది, ఎలా ఉంటుంది—అన్నదికూడా ఊహించే తెలుసుకోవలసి ఉంటుంది. కారణం: భూగోళం 'కేంద్రం' మనంఉన్న చోటుకి 6400 కిలోమీటర్లు దూరంగా ఉంది. అందులో మనం అంగుళంలో అర్థభాగంకూడా వెళ్ళలేదు. ఈ పైపొరమీదినించి గనులు తవ్వినపుడు మనం వెళ్ళినది—ఆమాటకొస్తే మాపెగనులకోసం అవి

# ‘నేల’ విడచి సాము చెయ్యడం మనకి బాగా చేతనైంది

## సూరూడిక్కీ, చంద్రుడికీ గోళాలు పంపి ఎక్కడేముందో కనుక్కుంటున్నాం.

## కాని మనం తిరిగే భూమిలోపలకి పట్టుమని పదిమైళ్లుకూడా వెళ్లి చూడలేకపోయాం.

## అసలు భూమికథ ఏమిటి?

యంత్రాలతో సన్నటిదారి చేసుకుంటూ పోయినదికూడా ఎక్కడా నాలుగు కిలోమీటర్లకు మించలేదు! అంటే మనం భూమి పైపొరకూడా సరిగ్గా చీల్చలేదన్న మాట. బలబూగ్గా కొస్త మట్టితప్పించి కావలసినని తవ్వి తీసుకుంటున్నాం. అంతే. అందువల్ల మనకి భూమిగురించి తెలిసింది కూడా అంతంతమాత్రంగానే ఉండిపోయింది. చాలా తెలుసుకోవాలంటే, లోతుగా తరచిచూడాలి. అందుకు ఇంకా చాలా కాలం కృషిసాగుతునే ఉండాలి.

ఇంతవరకూ తెలిసిన సంగతులు—భూమి దాదాపు గుండ్రంగా ఉందనీ, దాని వ్యాసం 12,800 కిలోమీటర్లు అనీ, విశ్రాంత రాశిలో తేలుతూ తిరుగుతోందనీ చెప్పుకోవచ్చు. భూమికి అన్నిటికన్న దగ్గర చుట్టం చంద్రగోళం, దాదాపు 3,84,000 కిలో మీటర్ల దూరంలో ఉందనికూడా మనకి తెలుసు. నిజానికిభూమికిపైనా చుట్టూరా, ఉన్న స్థితిగతులు చాలా తెలుసు. చంద్రుడి మీదకీ, దాటి ఆపైకికూడామనం చిన్న చిన్న గోళాలూఅలీపంపగలిగాం. లక్షలకొద్ది మైళ్ళ దూరాన ఏదేం చేస్తోందో ఏ దిలాఉందో ఆరా తీస్తున్నాం. ఇలా నేలవిడిచి సాము చెయ్యడంలో నేర్పరులం అవుతున్నా, కాలికింది మట్టి కొస్తకన్న తప్పించి చూడలేక పోతున్నాం. భూమిని తవ్వి లోపలికి చొచ్చుకుపోవడంకన్న దాన్ని వదిలి దూరానికి పోవడమే మనకి సులువైంది.

భూమి ఉపరితలం మూడింట ఒకవంతే మనకి కనిపిస్తుంది. మిగతా రెండువంతులూ సముద్రం. సముద్రంలోంచి భూమిలోపలికి పోదామన్నా వీలులేదు. సముద్రంలోయకూడా ఎక్కడా 4 కిలోమీటర్లకు మించిలేదు. పోతే పర్వతాలలో అన్నిటికన్న ఎక్కువ ఎత్తయినది ఎవరెస్టుశిఖరం. అదికి కిలోమీటర్ల లోపు. ఇలా ఎత్తైన కొండలు, లోతైన లోయలు ఉన్నాయికాబట్టి భూగోళం అంతా ఎగుడు దిగుడుగా గతుకులుగా ఉందనుకోవడం పొరపాటు. ఆరడుగుల పొడుగున్న మనకు, ఈ ఎత్తుపల్లాలు గొప్పవిగాకనబడవచ్చుగా, భూమి పరిమాణాన్ని గుర్తు చేసుకుంటే, ఇవి అసలు లెక్కలోకిరావు. బత్తాయి పండుమీద గతుకులు ఏపాటికనిపిస్తాయి!

### మనం ఎక్కడ ఉన్నాం?

ఇక మనసంగతి. మనం రెండు ఆవరణాలలో ఉన్నాం. ఒకటి భూమి. రెండు వాతావరణం. భూమిచుట్టూ ఉంది కాబట్టి వాతావరణం కూడా ఒకగోళమే. అందుచేత మనం భూగోళం పైపొరమీదా, వాతావరణ గోళం లోపలిపొరకిందా ఉన్నామన్న మాట. నిజానికి లోపల గుల్లగా ఉన్నదన్న ఈ వాతావరణ గోళంకూడా, భూగోళంతో పాటే. అదీ ఇదీ కలిస్తేనే భూమి అనిపించుకుంటాయి. అంచేత రెండుమీటర్ల జీవులం మనం ఈ రెండిటిమధ్య నలిగిపోతూఉన్నామన్నమాట. ఎడాపెడా వేలకొద్దీ మైళ్ళ దళసరి పొరలూ, మధ్య మనమూను. అందువల్ల మనం భూమ్మీద ఉన్నామనుకోవడం కన్న ‘భూమిలో’ ఉన్నాం అనుకోవడం న్యాయం.

భూమిపైనుండి దాదాపు 30 కిలోమీటర్ల లోపలివరకూ పైపొర అంటారు. దానితరువాతిది మధ్యపొర. ఇది సుమారు 2870కిలోమీటర్లుంటుంది. దీనిని ‘మాంటిల్’ అంటారు. ఈ మాంటిల్, సాగే పదార్థాల లాగే ప్రవర్తిస్తూందని చెప్పుకోవచ్చు. ఈపొర తరవాత—అక్కడనుంచి కేంద్రం వరకూ 3000 కిలోమీటర్ల వెడల్పునఉన్నది, దుర్భేద్యమైనభాగం. విజ్ఞానశాస్త్రజ్ఞులకి, ఇదే చాలా అద్భుతమైనభాగం. ఇక్కడ తెలుసుకోతగినది ఎంతోఉందని నమ్ముతున్నారు. దీన్నే ‘కోర్’ అంటారు. ఈ అట్టడుగుపొర అయిన ఈ భాగంలో—మనం ఇంతవరకు ఎరగనిపదార్థం ఏదో ఉంటుందనీ, పై పొరల వత్తిడివల్ల ఘనపదార్థంగా తోచినా, నిజానికి దానికి ద్రవపదార్థాల లక్షణాలు ఉన్నాయనీ నమ్మడానికి ఆధారాలు దొరికాయి. ఇపుడు కోర్, మాంటిల్, క్రస్ట్ అనే ఈ మూడుభాగాల గురించి చర్చించుదాం.

కేంద్రంనుండి, భూమి వ్యాసంలో దాదాపు సగంవరకూ ఉన్న ‘కోర్’ భాగం ప్రధానంగా లోహసంబంధమైన పదార్థం

# ★ భూమిలోపలి రహస్యాలు ★

అంటున్నారు. బహుశా అది ద్రవరూపంలో ఉన్న ఇనుము కావచ్చు. అందులో మరి కొన్ని తేలికలోహాలు కలిసి ఉండవచ్చు. ఇది ద్రవం అంటే, అక్షరాలా—మనం మామూలుగా చెప్పుకునే అర్థంలో – ద్రవం కాదు. ఇందులో ఘనీభవించిన ప్రాంతాలు కూడా బాగా ఉన్నాయి. అందువల్ల దీన్ని కేవలం ద్రవం అనకున్నా ఈ 'కోర్' భాగం 'ప్లాస్టిక్' తరహాలో ఉంటుందని చెప్పుకోవచ్చు. ఇదంతా ఘనపదార్థం కాదనడానికి ముఖ్యాధారం, ప్రాతిపదిక ఒకటే. భూమి కంపించినపుడు ఈ పొర ఆ కంపనాలను ప్రసారం చేయడంలేదు. ఘనం అయితే అది కంపించాలిగదా.

కాగా, ఈ భాగానికి ఆకర్షణశక్తిలేదు. లేకపోయినా, భూమికి ఆకర్షణశక్తిని కలిగించేవాటికి ఒకవిధంగా ఎక్కువ దోహదం చేసేది ఇదే. కోర్ భాగం లోపలిది కాబట్టి దీనిపై వత్తిడి చాలా ఎక్కువ. (దాదాపు 80 లక్షల ఎట్మాస్ఫియర్ల వత్తిడి ఉంటుందని అంచనా.) ఇది చాలా వేడిగా ఉంటుందని తెలుసు కాని, అది ఎంతో నిర్ధారణగా తెలీదు. సుమారుగా 5 నుండి పదివేల డిగ్రీల వేడి ఉండవచ్చునని అంచనావేసి అనుకోవచ్చు.

ఈ యినుపపొర తరువాత ఉన్నది మాంటిల్. పరిశోధనాలయంలో, ఈ కోవకు చెందినవనిపించే శిలలలో కంపనం ఉధృతాన్ని పరిశీలించినమీదట, ఈ మాంటిల్ పొరలో ఉండే ద్రవ్యం లక్షణాలూ, అందులో ఉండే పదార్థాల పైనాలూ, ఆయాచోట్లఉన్న వత్తిడుల బలం తెలుసుకోడానికి కావలసిన ఆధారాలు, అమూల్య విషయాలూ లభించాయి.

భూమి ఉపరితలంనుండి 700 కిలోమీటర్ల దిగువన ఉన్న ద్రవ్యం చాలా చిత్రమైనదనీ, పైపొరకీ, లోపలిభాగానికీ పోలనిదనీ తెలిసింది. మొత్తంమీద భూమిలో ఈభాగం చాలా అస్థిమితమైనదనీ, ఇక్కడనించే ఉధృతమైన భూకంపాలు పుట్టుకొస్తాయనీ ఇంతవరకూ తెలిసిన విషయాలవల్ల విశదం అవుతూంది.

ఇక పై పొర. దీన్నే క్రస్ట్ అంటారు. మానవుడి మనుగడకు ముఖ్యమైన అన్న వస్త్రాలూ, నీరూ ఈ పొరలోంచే లభిస్తున్నాయి. మనకి సుఖాలు సమకూర్చి, అభ్యుదయానికి తోడ్పడే ఖనిజ సంపదకూడా ఈ పొర పెట్టే భిక్షే.

ఈ పై పొరలో పైన పది కిలోమీటర్ల చిన్న పొరని తీసుకుంటే-(భూమి, వాతావరణం, సముద్రం అన్నీ కలుపుకుని), ఈ భాగంలో అత్యధికంగా కనిపించేవి అరు మూలద్రవ్యాలు. వాటి పరిమాణాన్ని బట్టి వరుసగా ఆక్సిజన్, సిలికన్, అల్యూమినియం, ఐరన్ కాల్షియం, సోడియం. ఈ పైపొర (పదికిలోమీటర్లది) బరువులో ఇవి నూరింట 94 వంతులున్నాయి. విజ్ఞాన శాస్త్రానికి తెలిసిన మిగతా ధాతువులు అన్నీ కలిపితే మిగతా కాస్త అన్నమాట. ఈనాడు ప్రపంచం మొత్తంమీద తీసే ఖనిజాలన్నీ కలిపి ఈ పైపొరలో చాలా చిన్న ప్రాంతం లోంచి తవ్వితీస్తున్నవే. మాటవరసకి కోలారు బంగారుగనులు తీసుకోండి. ఏడు కిలోమీటర్ల పొడుగు 1½ కిలోమీటర్ల వెడల్పూను. లోతు, మహా అయితే మూడు కిలోమీటర్లు ఉండవచ్చు. ఇది చాలా ఘనకార్యం. చాలా లోతుకి తవ్విన గనుల కోవలోకి వస్తుందిఇది! ఇంతాచేసి, భూమి పరిమాణంతో, పై పొర మందం పోల్చి చూస్తే ఈ వైశాల్యం ఈలోతు ఏ పాటిది అవుతుంది. సముద్ర తీరాన చిన్న పిల్లడు పిడికిటితో మట్టి తీసినంతకూడా అవదు. మూడుకిలోమీటర్ల లోతు అంటే, సముద్రాల అట్టడుగు నేలని కూడా ముట్టుకున్నట్టు కాదన్నమాట.

అయినా ఇప్పటికే మనం చాలా పరిశోధన సాగించాం అనుకోవాలి. ఇంకా చాలా సంగతులు-మనం అనుకోనివి ఎన్నో బయట పడతాయనడానికి సందేహం లేదు.

భూమిగురించి మాటాడినపుడు, దాని కన్న సముద్రమే ఎక్కువ కనబడేది కాబట్టి దాని గురించి కూడా ఒక మాట చెప్పవలసి వుంది. భూమిమీద మూడింట రెండుపాళ్ళను నీరు కప్పేసింది. ఈ విశాల సముద్రాల , ఈ అఖాతాలలో అపారమైన ఖనిజ సంపద దాగిఉంది. సముద్రుడి సంపదలో నూటికి 85 పాళ్ళు ఉప్పేఅయినా, మనకి తెలిసిన ఖనిజాలు అన్నీ సముద్రంలో దొరుకుతాయనిరుజువైంది. కొన్ని, భారీఎత్తున తీసి లాభసాటిగా వ్యాపారం చేయడానికి సరిపడేంతగా కూడా దొరుకుతాయి. బంగారంలాటి సంపదలు కొన్ని మటుకు ఇంకా కాగితాల మీదనే ఉన్నాయి. చేతులోకి కూడా వస్తాయిగాని, అవి రావడానికి అయే ఖర్చులు అమ్మి సంపాయించబోయే డబ్బు కన్న ఎక్కువ అని అంచనా. కాబట్టి నేటికి అవి ఉండీలేని వాటిలోనే జమ. అయితే రేపు ఎలాటి కొత్తపద్ధతులు యాంత్రిక సదుపాయలు వస్తాయో చెప్పలేము. వాటివల్ల యీ ఖనిజాలను తీయడం చౌక కావచ్చు.

మరోకవిశేషం ఉంది. భూమి పైపొర భూమిమీద 80 కిలోమీటర్ల మందం ఉన్నా, సముద్రంఉన్న చోట్లలో సముద్రం క్రింద పదికిలోమీటర్ల కుదించి ఉండేదని అంచనా. ఇలా 80 కి. మీ. ల నుండి 10 కి మీ. లకి తగ్గిపోయే ఈ పొరతీరుపో, అటువంటి స్థలాలలో మార్పులూ విజ్ఞానశాస్త్ర దృష్ట్యా చాలా ముఖ్యమైనవి. పెద్దఎత్తున కట్టుదిట్టంగా పరిశోధనజరిపి చూడతగినవి.

ఈనాడు పెద్ద భూఖండాలూ, భారి భూధరాలూ ఉన్నచోట్ల, కోట్లసంవత్సరాల క్రితం మహాసముద్రాలు ఉండేవనీ, నేడు సముద్రాలున్నచోట పూర్వం కొండలూ, మైదానాలూ ఉండేవనీ భూగర్భశాస్త్ర ప్రవీణులు చెబుతున్నారు. అందువల్ల, ఇపుడు మనం భూమిలోపలిభాగం అన్నపుడు, ఈనాడు పై పొరమీద ఫలానాచోట సముద్రం ఉందా కొండఉందాఅన్న విషయంతో నిమిత్తంలేదు. ఈపొరనివదిలి బాగా లోతుకుపోయి లోతువిషయాలను చర్చిస్తున్నామన్నమాట. ప్రకృతి, భూమిలో ఖనిజాలుదాచి అమర్చిపెట్టడం అనేది 400 కోట్ల సంవత్సరాలుగా సాగుతున్న మహా కార్యం. ఈనాటికి మానవుడు ఈ గనితవ్వి సంపద తీసుకోవాలని పని మొదలుపెట్టాడు. ఇలా ఎన్నాళ్ళయినా, ఎంతఅయినా నవ్వుకోవచ్చు. అయిపోతుందని భయపడ తక్కరలేదు. ఉన్నదాన్నంతా ఏంచేసుకోవాలీఅన్న సమస్యతో సతమతమవాల్సివస్తుందేమో.

ఎందుకంటే, ఇది తరగనిగని. ★

['ఆకాశవాణి' సౌజన్యంతో]

## తారుమారు

కలకత్తాలో ఒక కంపెనీలో ఒక గుమాస్తా కుర్రాడు పనిచేస్తున్నాడు. ఒకసారి అతనికి ఇంటిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది, 'సంబంధం కుదిరింది. వెంటనే రమ్మని. పెళ్ళి అనేసరికి కుర్రాడు సరదా పడ్డాడు. యజమానిని రెండునెలల సెలవు అడిగాడు. పెళ్ళికి గాను కొంత 'లోన్' కూడా తీసుకున్నాడు. హుషారుగా బయల్దేరాడు. నేపాల్ లో మారు మూలపుగ్రామం వాళ్ళ ఊరు. చాలాదూరం. కొంతదూరం రైలుప్రయాణం. తరవాత బస్సు, పడవ, బండి, నడక-ఇన్నివిధాలుగా ప్రయాణంచేసి వెళ్ళాలి. పెళ్ళి ఉషారులో ఇన్ని వ్యయ ప్రయాసలకీ ఓర్చి అతను వెళ్ళాడు.

మళ్ళీ పదిహేనురోజులకే కలకత్తా వచ్చేశాడు.

"ఏం అప్పుడే వచ్చేశావేం? పెళ్ళి కాలేదా?" అని యజమాని అడిగాడు.

"లేదండి. పెళ్ళికూతుర్ని ముందు చూడకుండా మా నాన్న సంబంధం స్థిరపరిచాడు. తీరా చూసింతరవాత మనసు మార్చుకున్నాడు."

"ఎందుకని?"

"అంత మంచిపిల్ల నాకనవసరమని, నేను రాకముందే తనే పెళ్లి చేసుకున్నాడు." ★

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గత వారం తరువాయి)

'ఏం జరిగిందే! ముసలిది అడిగింది.

'కసితీరేలా కరిచాను!... నేను యిక్కడ ఉండను. పోతాను!' కమల వెక్కి వెక్కి ఏడ్చింది.

గళ్ళులుంగి సాహేబు, గదిలోని విద్యుద్దీపాల కాంతిలో కోమటి చేతిమీద పళ్ళ కొంటు పరీక్షించాడు.

"లడ్కీ! హేమీ లడ్కీ?" గడ్డం దువ్వుకున్నాడు, ఆశ్చర్యంగా సాహేబు!

"పోవోయ్!" కోమటి కోపంతో అరిచాడు.

సిగరెట్లు దమ్ముపీల్చుకుంటూ మల్లులాల్చీ నల్లయువకుడు, బహిరంగంగా బాలమ్మను ముద్దు పెట్టుకుంటూ కోమటి గదిముందుకు వచ్చాడు.

"అయిందా!" నల్లయువకుడు ప్రశ్నించాడు.

"ఆ! అయింది ఏదీ!" రుసరుసలాడుతూ కోమటి నాల్గు అంగల్లో వీథిలో నిలబడ్డాడు.

మల్లులాల్చీ నల్లయువకుడు జరిగినసంగతి విని, నవ్వుకుని ఖులాసాగా బయటికి నడిచాడు.

ముసలిది నివ్వెరపోయి నిలుచుంది కోపంగా. ఒక్కక్షణం నిశ్శబ్దం తాండవించింది ఆ యింట్లో.

ముసలిది ఏదో ఆలోచనతో ఒకనిశ్చయానికి రాబోయింది. ఇంతలో రాముడు ప్రత్యక్షమయ్యాడు. అతని వెనకనే ముగ్గురు యువకులు లోపల అడుగుపెట్టారు. సిల్కు బుష్‌కోటులోంచి బనీను కన్పించేలా ఎత్తైన వక్షంతో ఠీవిగా ముందు రాజారావు కనిపించాడు. పొడుగాటి చక్రవర్తి శివరాంభుజం అదిమి పట్టుకుని "భయపడకు మిత్రమా!" అంటూ పకపక నవ్వాడు. శివరాం విచిత్రంగా సరదాగా ఆ యింటినంతా పరిశోధించడం మొదలు పెట్టాడు అడుగు పెడుతూనే.

వరండాలో నిలుచున్న స్త్రీల వైపు చూసి అరిచాడు రాముడు "తప్పుకోండి!"

రాజారావు, చక్రవర్తి, శివరాం ఒక గదిలోకి ప్రవేశించారు రాముడితో.

"మిత్రమా! నవగ్రహాలు అనే మాట విన్నావు కదూ!... మిగిలిన గొప్ప గ్రహాలన్నీ యీయిళ్ళలో ఉంటాయి. ఒక్కొక్క గ్రహంవద్ద అనంతమైన ప్రభావం!.. నీ జీవితమే మార్చేస్తుంది. తన ప్రభావంతో తన జీవితమే మార్చేసుకున్న ప్రబలమైన గ్రహాలు!....ఒకటి... రెండు!" చక్రవర్తి మాటలతో ఒక్కొక్క స్త్రీ లోపల అడుగు పెట్టింది. ముసలిది కమలనుకూడ గదిలోనికి నెట్టింది క్రూరంగా. ఆ స్త్రీల వరుసలో భయంగావెళ్ళి నిలుచుంది కమల.

రాముడు రాజారావు వైపు కనుసైగ చేశాడు. రాజారావు కమల వైపు వేలు చూపాడు.

"మన నాయకుడికి రాణి దొరికింది!... మిత్రమా! ...నువ్వు కోరుకో!...ఏరుకో! ...వరమిస్తున్నా!" చక్రవర్తి శివరాం బుజంమీద తట్టాడు.

తెల్ల పంట్లాం; ఎర్ర బుష్‌కోటు; ఆకు చెప్పులు తొడుక్కున్న శివరాంను చూసి కమల బిత్తరబోయింది. గుండె దడదడలాడింది. నీరసంతో బాలమ్మ బుజంమీద ఒరిగింది.

"ఏం?" బాలమ్మ కమలచెవిలో ప్రశ్నించింది.

"ఏం లేదు!" కమల నసిగింది.

ఎదురుగా ఉన్న కమలను చూడగనే శివరాం ఆపాదమస్తకం కంపించాడు.

కొయ్యబొమ్మలా గ్రుడ్లునిలిపివేసి ఆమె వైపు దీర్ఘంగా ఒక నిమిషం తేరిపారి చూశాడు.

"ఏం మిత్రమా!.. తన్మయత్వమా!"

చక్రవర్తి పకపక నవ్వేశాడు. అంత నవ్వు నవ్వినా ఎదురుగా నిలుచున్న స్త్రీల ముఖాలు భంగిమలు మారక నిశ్చలంగా ఉన్నాయి. ఆ మౌనముద్రకు చక్రవర్తికి కోపం వచ్చింది.

'ఏ అమ్మాయిలు!...ఒక్కసారి నవ్వకూడదూ! నవ్వితే, మీ పెదాల వెనకాల పళ్ళు ముత్యాల్లా రాలిపోతే, నేను ఏరుకుంటానని భయమా!"

స్తంభాల్లా నిలుచున్న ఆ అమ్మాయిలలో కదలిక కలిగి, మెల్లిగా నవ్వారు.

"మా పళ్లు ముత్యాల్లా ఉండవు... కెంపుల్లా ఉంటాయి!..." హాయిగా మందస్మితం చేసింది బాలమ్మ!

తాంబూలము నమిలిన తన పళ్ళగురించి ఛలోక్తి విసిరిన బాలమ్మమీద మోజు కలిగింది చక్రవర్తికి!

'అయితే! చూడు అమ్మాయి!...నీ కెంపులు నాకు అమ్మేయి యీ వేళ!" చక్రవర్తి నిలబడ్డాడు తన పొడుగాటి చేతులు ముందుకుచాచి. బాలమ్మ అతని చేతుల్లోకి దూసుకు నడిచింది.

'మిత్రమా! నువ్వు దిష్టిబొమ్మలా వరండాలో కూర్చోవడమేనా?" చక్రవర్తి శివరాంతో పరియాచకమాడాడు.

చక్రవర్తి మాటలకు శివరాం బాధపడినా, స్నేహంలోని హేళనలకు అంతకన్న మరో ఎదురుమాట చెప్ప సాహసించలేదు.

బాలమ్మ చక్రవర్తిని మరో గదిలోకి నడిపించింది.

రాముడి చేతిలో రెండు పదిరూపాయల నోట్లు రాలాయి.

కమల మౌనంగా నిలుచుంది. రాజారావు తలుపులు బంధించాడు.

వరండాలో ఒంటరిగా భయంగా నిలుచున్న శివరాంనుచూసి, ఒక స్త్రీ అతని భుజంమీద చెయ్యి వేసింది.

చికాగ్గా విదిలించుకున్నాడు శివరాం.

'పోనీ కుర్చీమీద కూర్చో!...అలా రాతి విగ్రహంలా నుంచుంటావెందుకు.'

శివరాం మెల్లిగావెళ్ళి కుర్చీలో కూర్చు

# ★ అన్వేషణ ★

న్నాడు. రాముడు వరండాలో ఒక మూలగా కూర్చుని చార్మినార్ సిగరెట్టు వెలిగించాడు.

ఇద్దరు స్త్రీలు శివరాం ఇరుప్రక్కలవెళ్ళి నిలుచున్నారు.

'పెళ్ళయిందా!...దొరా!' అడిగింది ఒకతె!

'ఏకపత్నీవ్రతుడేమో నే! ... పరస్త్రీని కన్నెత్తి చూడడు!" మరొకతె శివరాం జుట్టు చేతివేళ్ళతో నిమిరింది. శివరాం కోపంగా ఆమె చెయ్యిపట్టుకుని దూరంగా తోసేశాడు.

"దొరా!...ఒక టీ తెప్పించు!" ఒకతె శివరాంగడ్డం పట్టుకుని బ్రతిమాలింది.

"అబ్బ ఎంతనున్నగా వుంది దొర శరీరం, మరొకతె శివరాం ఒళ్ళు తడిమింది.

"ఉద్యోగమా!..." శివరాం జేబులోంచి జేబురుమాలు పైకిలాగి తలకు అర్థచంద్రాకారంగా చుట్టుకుంది ఒక స్త్రీ. మరొకతె జేబుతడిమి ఒక బేడ పైకి లాగింది.

శివరాం కోపంగా, మౌనంగా చీదరించుకున్నాడు ఆ స్త్రీలను చూసి. అంతకన్న పరిహాసం చేస్తే పరిస్థితి విషమించగలదని భయపడి ఆ స్త్రీలు శివరాంను ఒంటరిగా వదిలి ముసలిదానిదగ్గిరకు నడిచిపోయారు. ముసలిది ఆ స్త్రీలతో గవ్వలాట మొదలెట్టింది.

మరో అయిదు నిమిషాల తర్వాత రాజారావు తలుపు తెరిచాడు. రాముడు ముసలిదాన్ని పిలిచాడు. ముసలిదాని వెనకాలే గళ్ళలుంగిసాహెబు కుందేలులా చెవులు రిక్కించుకు వచ్చి నిలబడ్డాడు.

'బయటికి తీసుకువెడతా యీ అమ్మాయిని' రాజారావు కమలవైపు చూశాడు నవ్వుతూ!.

'సాతిక!' రాముడు సవినయంగా రేటు చెప్పాడు. గళ్ళలుంగీ సాహేబు ముసలిదాని చెవిలో ఏదో ఊదేడు.

'ఈ వేళ బయటికి పంపడానికి వీల్లేదు!' ముసలిది తీవ్రంగా చెప్పింది...'కావాలంటే యిక్కడే'...యీ రాత్రి' నవ్వింది ముసలిది.

"మరో పది తీసుకో!" రాముడువైపు చూశాడు రాజారావు.

రాముడు ముసలిదాన్ని ప్రక్కకుపిల్చి ఏదో చెప్పాడు. ముసలిది అతనిమాటలు లెక్క చెయ్యలేదు.

శివరాం మనస్సు పరిపరివిధాలపోయింది. రాజారావుతో ఉన్న అమ్మాయి ముఖం తనకు పరిచయమున్న శారద వదనంలా వుంది. శారద భోగంకొంపల్లో ఉంటుందా! అది అసంభవమనుకున్నాడు శివరాం!...కొద్దిగా శరీరములోని మార్పుతప్ప, చూపు, నడక పూర్తిగా శారదను జ్ఞప్తికితెచ్చింది శివరాంకు.తర్వాత మెల్లిగా రాజారావును ప్రశ్నిద్దామనుకున్నాడు. ఒకసారి కమలవైపు నిశితంగా చూసి దగ్గరగా వెళ్ళాడు. శివరాం దగ్గరగా రావడం గమనించక కమల రాజారావు చాటుకుపోయి నిలుచుంది.

"నేనుఒప్పుకోను!..."ఖచ్చితంగా చెప్పింది ముసలిది.

చక్రవర్తి పొడుగాటికాళ్ళు అంగలు వేసుకుంటూ బాలమ్మతో బయటికివచ్చాడు.

మిత్రమా! ఏమిటీగొడవ!...స్వర్గంలోంచి నరకంలోకి వచ్చినట్లుందే?, పకపకనవ్వాడు చక్రవర్తి. ఆసన్నివేశం కాస్సేపటిలోఅర్థం చేసుకుని "రానంటూంటే బలవంతమెందుకు గురూ! ఆసాతిక చెడితే మరోచోట అప్సరస దొరకదూ!"

చక్రవర్తి మాటతో రాజారావు ప్రవర్తనకు బలంపోయింది. రాజారావు రాముడివైపు చూశాడు. తర్వాత కర్తవ్యం ఆలోచిస్తూ "నేను బయటికి వెడతాను!" కమల అరిచింది.

"అదిఅంతా నీ నన్నాగం!...నాకు తెలుసుగా."ముసలిదికోపంతో అరిచింది.గళ్ళలుంగీ సాహేబు చెవిలో గుసగుసలాడింది. మరుక్షణంలో గళ్ళలుంగీ సాహేబు వస్తాదుతో ప్రత్యక్షమయ్యాడు. పరిస్థితిప్రమాదకరంగా వుందని రాజారావు తలవంచుకుని బయటికి నడిచాడు.

"గమ్యంలేని మన జీవితంలో ఇది ఒక అయోమయమైనయాత్ర మిత్రమా!...ఎలా ఉంది..యీ యిల్లు...పేట..వాతావరణం? చక్రవర్తి శివరాం భుజంపై చెయ్యివేశాడు దారగాన మిత్రమా!...నువ్వు యింకా మారాలి...చాలా మారాలి...జీవితం లోతు పాతులు..." యింకా చక్రవర్తి ఏదో అనబోతూంటే రాజారావు కసిరాడు ధోరణి ఆపమని.

'నాయకుడి ఆజ్ఞ! నోరుమూసుకో మిత్రమా!' చక్రవర్తి శివరాం నోరుమూసి తననోరుకూడా మూసుకున్నాడు.

ముగ్గురు శృంగాటకంలోని ఇరానీ హోటల్లోకి ప్రవేశించారు. మూడుకప్పులు టీ తెమ్మని రాజారావు చెప్పాడు.

వేడిటీ ఒకగుక్క మ్రింగి చక్రవర్తి మళ్ళీ సంభాషణ ప్రారంభించాడు.

'గురూ! ఎలా వుంది నీ ప్రేయసి!'

'అనుభవించలేదుగా!' నీరసంగా నవ్వాడు.

రాజారావు రాముడిద్వారా ఆ అమ్మాయిని ఆభోగం కొంపనించి తప్పించడానికి తానుచేసిన ప్రయత్నం విఫలమైందని రాజారావు తన పన్నుగడ వివరించి చెప్పాడు.

'రాముడిని నేను మునుపు ఎరుగుదును... వచ్చి బ్రతిమాలి చెబితే కాదనలేకపోయాను...ఈ వేళ ఖర్చుపెట్టింది రాముడి సొమ్ము...పాపం! ఆ అమ్మాయిగతి ఏమౌతుందో!, రాజారావు జాలిగా నిట్టూర్చాడు.

ఇంతవరకు రాజారావు మాటలు చాలా ఆసక్తితో విన్న శివరాం 'ఆ అమ్మాయి పేరు?' ప్రశ్నించాడు.

'కమల!'

శివరాం ఏదో నిరాశగా తల ఒంచుకున్నాడు. మనిషినిపోలిన మనుష్యులు ఎందరో ఉంటారని సమాధానం చెప్పుకున్నాడు శివరాం.

టీ త్రాగేక, రిక్షాలుపిలిచి, రాజారావు, చక్రవర్తి, ఆ శృంగాటకంనుంచి నిష్క్రమించారు చీకటి వెలుగు నీడల్లో.

కమల ఏదో విధంగా పారిపోవాలనే ప్రయత్నంలో ఉందనే దృఢనమ్మకం ముసలిదానికి కలిగింది. ఆ రాత్రికికూడా వస్తాదును గుమ్మంలో కాపుంచడానికి నియమించింది.

'ఈ వేళ బేరాలన్నీ చెడగొట్టింది!' ముసలిది విసురుగా వెళ్ళి కమల చెంపమీద కొట్టింది. కమల ఏడ్చింది, బాధగా ఒకమూల ఒరిగి కూర్చుని. ఆమె కళ్ళముందే ఇంకా ఎందరో విటులు అక్కడికి వచ్చారు. ఆ స్త్రీల మందలోంచి ఎవరినో ఒకరిని ఏరుకుని అనుభవించి, ధనం వ్యయంచేసి, సంతృప్తితో వెళ్ళిపోయారు. తన చుట్టూఉన్న వాతావరణం పరమ అసహ్యంగా కనిపించింది ఆమెకు.

బాలమ్మవచ్చి కమల ప్రక్కనే కూర్చుంది. 'ఎందుకు యిక్కడికి పోయి పడుకో!' ముస

లిది వినేలా గట్టిగా అరిచింది బాలమ్మ! కమల వైపు చాటుగా కనుసైగ చేసింది.

పిల్లిలా అడుగులు వేసుకుంటూ కమల తిడికెల గదులుదాటి వరండాలో ఒకమూలవున్న చాపమీద ఒరిగింది.

రాత్రి పన్నెండు గంటలు దాటింది. వీధిలో జనం తగ్గారు. ఆకాశం మబ్బులతో నిండి చీకటి ఉధృతమయింది. మరుక్షణంలో గాలి, వాన ప్రారంభమైనాయి. రాముడు వచ్చి ముసలిదానిదగ్గర ఏదో డబ్బు తీసుకొని కమల పడుకున్నట్లు గమనించి, ఏం చెయ్యాలో తోచక వెళ్ళిపోయాడు.

యువతులు తడికెలగుల్లో సర్దుకున్నారు నిద్రకోసం.

'కమల ప్రక్కనే పడుకో ఈ రాత్రికి!' ముసలిదాని చెవిలో మెల్లిగా ఊదింది బాలమ్మ. ముసలిది కమల ప్రక్కనే చాప పరుచుకొని పడుకుంది.

రాత్రి మూడుగంటలయింది. వస్తాదు వీధి గుమ్మం సందుదగ్గరి అరుగుమీద చాప వేసుకొని తూగుతున్నాడు. వరండాలో పడుతున్న చిన్న చిన్న చినుకుతుంపరలు అతనిశరీరాన్ని కప్పుకున్నదుప్పటీని సగం తడుపుతున్నాయి.

బాలమ్మ మెల్లిగా కమల చాపవద్దకు వెళ్ళింది. ముసలిది నిద్రలో మునిగిపోయింది. బాలమ్మ రాకచూసి కమల లేచి కూర్చుంది. రాత్రి సంపాదనలోని నాల్గు రూపాయలు కమల చేతిలో పెట్టింది బాలమ్మ. ఆమె చెవిలో గుసగుసలాడింది. కమల నిద్ర పోతున్నట్లు మళ్ళీ చాపమీద ఒరిగింది.

బాలమ్మ వస్తాదు దగ్గరికి నడిచింది. వస్తాదు ఉలిక్కిపడ్డాడు. వస్తాదు నోటిమీద చెయ్యి వేసిమాట్లాడవద్దంది. అతని చెయ్యి పట్టుకులాగి, వస్తాదును ఆలింగనం చేసుకుంది. వస్తాదు పరవశమైపోయాడు. వాన రాత్రి... కొద్దిగా చలి...వనితయిచ్చిన కౌగిలి...... ఆహ్వానం వగలుతో బుద్ధిపుట్టలేదు.

తనగదివైపు రమ్మని బాలమ్మ సైగ చేసింది. పిల్లిలా వస్తాదు ఆమె వెంట నిశ్శబ్దంగా నడిచాడు.

గదిలో చొరబడిన వస్తాదు వెనుకగా తలుపులు బంధించింది బాలమ్మ.

కమల మెల్లిగా లేచింది. నిశ్శబ్దంగా సందుదాటి వీధిగుమ్మం తెరిచి వీధిలో అడుగుపెట్టింది. వాన చినుకులతో తపతపలాడుతున్న నల్లరాతివీధి విద్యుద్దీపాల కాంతిలో మెరుస్తోంది. ఇళ్ళకిటికీల్లోంచి తొంగిచూసే ప్రమిద దీపాలకాంతులు మినుకు మినుకుమని కనిపిస్తూనాన్నాయి అక్కడక్కడ. గబగబ అడుగులు వేసుకుంటూ శృంగాటకందాటి నడిచింది కమల. పెద్ద వీధిలో చెట్లు చీకటిలో భయంకరంగా ఊగుతున్నాయి. వంతెనవచ్చింది... తెల్లటి బుడ్లు లాంటి విద్యుద్దీపాలు స్వచ్ఛమైన కాంతిని తెనినిండా వ్యాపింపచేశాయి. నిర్జనమైన

ఆ వంతెనమీదనడక వేగంచేసింది ఆమె. నదికిరువైపుల చెట్లగుంపులు, దూరంగా గోపురాలు, ప్రాకారాలు మాత్రము ఆమెను పరిశీలిస్తున్నటు కనిపించాయి ఆ రాత్రి.

ఆకాశంలో నల్లటి మబ్బులు చెదిరి, వేగుజుక్క ప్రకాశవంతమయింది. వీధిలో కుక్కల అరుపులు ప్రతిధ్వనిస్తున్నాయి. రిక్షాల్లో ఒరిగి నిద్రిస్తున్న రిక్షావాళ్ళు మెల్లిగా లేచి రిక్షా తొక్కుతున్నారు బేరాలు వెదుక్కుంటూ. సిటీ బస్సులు, ప్రయాణీకులు లేకుండానే పరుగిడుతున్నాయి. చీకటిని ఛేదిస్తూ తొలివెలుగులు మసక మసకగా వ్యాపిస్తున్నాయి. ఎదురుగా కనిపించినదారి పట్టుకుని, ముసుగుకప్పుకుని గబగబ నడిచిపోతున్న కమలకు ఎంతదూరం నడిచిందీ తెలియలేదు. తొలివెలుగులలో గుర్తించిన శృంగాటకంలో నిలబడి వీధివైపు తేరిపారిచూసింది. ఎదురుగా హోటల్లో పని

వాడు తుడిచి శుభ్రంచేస్తున్నాడు పేవ్మెంటు బల్లల్ని. ఆ ప్రక్కనే తెల్లవెలుగుల్లో, పిల్లగాలుల్లో శిరీషపుష్పం విచ్చుకున్న కుంకుమ రంగు పుష్పాలతో స్వాగతం చెప్పినట్లయింది. గడియారం ఆరుగంటలు కొట్టింది. గడియారగోపురం భవనాన్ని తేరిపారిచూసింది కమల...రైల్వేస్టేషను ... ఎక్కడ దిగిందో మళ్ళీ ఆ ప్రదేశానికి వచ్చింది ... మెల్లిగా ముందుగతి ఆలోచిస్తూ అడుగులు వేసింది కమల స్టేషనువైపు. (ఇంకావుంది.) ★



# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

సీ. వైహాయసం బైన వరమత్స్యయంత్రంబు, నివ్విల్లు మోపెట్టి యెవ్వఁ డేను
శరముల నేయు నక్రమమున నతఁడ నా, తనయకుఁ బరుఁ డగు ధర్మయుక్తి
నని చాటఁ బంచిన నాఘోషణము విని, యుర్వీశు లెల్ల నొం డొరులఁ గడవ
గడువేడ్కఁ దొడిపూసి కట్టివిభూతితోఁ, దమతమచిహ్నముల్ దనరియెలుక

ఆ. పడఁగ వేఱు వేఱ పన్ని భూతలము గ్రక్కదల సైన్యపాదఘట్టనమునఁ
బాలుచు ద్రుపదరాజపుత్త్రిస్వయంవర, రంగమునకుఁ జనిరి రమణతోడ.

వ. అదియును బురంబు పూర్వోత్తరదిగ్భాగంబునం జందనోదకసంసిక్త సమీకృతస్థలంబయి యగాధోన్నతపరిఖాప్రాకారంబులను విశాలద్వారతోరణంబులను గైలాసశైలవిలాసావహాసి భాసురగగనతలోల్లేఖి శిఖరరమ్యహర్మ్యతలంబులను బహుప్రకారంబు లైనసారువులనుం జేసి యొప్పుచున్న నందు యథాస్థానంబుల నానాదేశాధిపతుల నుండం బంచి ద్రుపదుండు వారల నెల్లం బూజించెఁ బరమబ్రహ్మణ్యులైన పాండవులును బ్రాహ్మణసమూహంబులోనుండి పాంచాలరాజ సమృద్ధివిం జూచి సంతసిల్లి రంత.

సీ. ధవళవిభూషణ దామానులేపనా, మలినాంగి సితపుష్పమాల సేతఁ
గొని పుష్పసాయకు కుసుమేతరం బైన, యాయుగసాయకం బనఁగ జనులు
ధవళాక్షి రంగమధ్యంబునఁ దనుమధ్య, దా నొప్పి పాంచాలతనయ యున్న
భూసురప్రవరుల పుణ్యాహఘోషంబు, విలసిల్లె నాశీర్వివృద్ధితోడ

ఆ. ద్రుపదపతిపురోహితుండును గృతపరి, స్తరణుఁ డై ప్రయోగదక్షుఁ డగ్ని
ముఖము సేసి వేల్చె మొనసి వివాహోప, కరణవస్తుచయము గాచి యుండె.

వ. అట్టియవసరంబున కోరసమ్రోయు జనులయులివును వాదిత్రనాదంబును వారించి ధృష్టద్యుమ్నుండు మూఁగిన రాజలోకంబు నెల్లం జూచి యగ్నిసమీపంబున గంధపుష్పధూపదీపార్చితం బైన విల్లును నమ్ములును వైహాయసం బైన లక్ష్యంబును వారలకుం జూపి యిట్లనియె.

తరువోజ. ఈవిల్లు మోపెట్టి యేను బాణముల నీయంత్రమత్స్యంబు సేసిన వాఁడ
భావజప్రతిముఁ డీ బాలకుఁ దగిన పతి యిది మునిశక్తిఁ బడసినవిద్య
గావున మీ రిప్డు గావింపుఁ డిదియ ఘనతరకార్ముక కౌశలోన్నతియు
లావునుగలవారలకు నవసరము లలితయశంబుఁ గల్యాణంబుఁ బడయ.

వ. అనిధృష్టద్యుమ్నుండు మూఁగినరాజపుత్త్రులకు పెల్లనెఱుంగం జెప్పి ద్రుపదరాజపుత్త్రిం జూచి యఖిలజలధివేలావలయవలయితమహీతలంబునం గల రాజనందనులెల్ల నీస్వయంవరంబునకు వచ్చినవారు వీరలం జూడుమని. దుర్యోధన దుశ్శాసన దుర్ముఖప్రముఖు లయినధృతరాష్ట్రనందనుల నూర్వురం దత్సమీపంబుననున్న కర్ణాశ్వత్థామసోమదత్త భూరిశ్రవ కృపకృతసేనాదులను, బుత్త్రభ్రాతృసమేతులయి యున్న శల్యవిరాట జరాసంధ గాంధారపతులను. నక్రూరసారణసాత్యకియదువృష్ణిభోజాంధకవరులను, సుమిత్ర సుకుమార సుశర్మసుదక్షిణసుషేణ సేనాబిందు చంద్రసేన సముద్రసే నౌశీనర చేకితాన శిశుపాల శ్రేణిమజ్జనమేజయ జయద్రథ బృహద్రథ సత్యవ్రత చిత్రాంగద శుభాంగద భగీరథ భగదత్త పౌండ్రకవాసుదేవ వత్సరాజప్రభృతులయిన నానాదేశాధీశులను వేదధ్వని సనాథంబై యొప్పుచున్న బ్రాహ్మణసమూహంబునుం జూపి.

ఆ. ఇందు లక్ష్య మెవ్వఁ డేసె నాతని వరియింపు నెమ్మితోడ నిందువదన
యనిన రాజపుత్త్రు లవ్విల్లు మోపెట్టి, యేయఁ గడఁగి కదలి రెల్లవారు.

సీ. అమ్మహోత్సవము నెయ్యమ్మునఁ జూడంగఁ, దివిరి యేతెంచిన దివిజఖచర
గరుడగంధర్వకిన్నరులవిమానముల్, విలసిల్లె నంబర తలమునందుఁ
బణవవీణావేణు రణితానుసార మై, రసగీతరవ మొల్ల దెసల నెసఁగె
బోరన వివిధతూర్యారవంబులు మహా,వననిధిధ్వానంబు ననుకరించె

ఆ. దివ్యమాల్యములయు దివ్యానులేపన,ములయు సౌరభంబు వెలయఁ దాల్చి
రంగమధ్యజనులకుం గడుముదముగాఁ, జేరి వీచె దివ్య మారుతంబు.

చ. అవిరళభస్మమధ్యమున నగ్నికణంబులపోలె బ్రాహ్మణ
ప్రవరులలోన నేర్పడక పాండవు లేవురు నున్నఁ జూచి యా
దవవృషభుండు కృష్ణుఁడు ముదంబున వారి నెఱింగి పార్థుఁ డీ
యువతిఁ బరిగ్రహించు ననియుం దలఁచెన్ హృదయంబులోపలన్.

వ. అంత నారాజనందనులు ద్రుపదరాజనందనం జూచి కందర్పబాణబాధితులయి తమ్మును దమసామర్థ్యమ్ము నెఱుం
గక యర్థిత్వంబున నవ్విల్లు మోపెట్టఁబోయి

క. వడి నొడు గఱచి వలకేల్, నిడుచన గనయమునఁ బెనఁచి నీల్గి బలం బే
ర్పడ విల్లు వంప నోపక, యుడిగిరి నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్.

క. బలవంతులబల మఱఁగా, మలువక మన్మ్రానిపాట మాయాధను వి
మ్ములఁ జేసిన మోపెట్టఁగఁ, గొలఁదియె యని డాయరైరి కొందఱు దానిన్.

మ. ఇది యెట్లున్ సమకూర దెవ్వరికి ము న్నీవిల్లు మోపెట్టఁ బో
లదు మోపెట్టియు నంతరిక్షమున నా లక్ష్యంబు భేదింపఁగా
నది బ్రహ్మాదుల కైన నిం దలవి గా దంచున్ విచారించి ని
ర్మదు లై కొందఱు రాజు లేఁగిరి నిజ ధామమార్గముల్ సూచుచున్.

## అర్జునుఁడు మత్స్యయంత్రంబుఁ దెగ నేయుట

వ. ఇట్లు రాజపుత్త్రు లవ్విల్లు మోపెట్టనోపక నివృత్తులయిరి మఱి యదువృష్ణిభోజాంధకులు గృష్ణానుమతంబున నక్కర్మంబునం దనారబ్ధులయి యున్నకుండి రంత శిశుపాలజరాసంధ శల్యకర్ణులు దర్పితులై తమతమబలావలు మెఱసి క్రమంబున నలువురు మాషయవముద్గరోమ మాత్రంబులు దక్కఁగొనయం బెక్కించియు మోపెట్టనశక్యం బయిన నుక్కుసెడి వెక్కసవారలం జూచి యగ్రజానను మతంబున విప్రసభ వెలువడి విజయుండు ధనుస్సమీపంబున కరిగిన నాతని యుత్సాహంబున కచ్చెరువడి కొందఱుబ్రాహ్మణులు దమలో నిట్లనిరి.

ఉ. ఇమ్మనుజేంద్ర నందను లహీనబలుల్ దృఢదీర్ఘబాహువీ
ర్యమ్ములవార లోపర శరాసనకర్మమునం దయుక్తద
ర్పమ్మున నిష్ఠు నవ్వ పఱుపన్ సమకట్టె నితండు విప్రవం
శమ్మునవారి కెల్లఁ దన శక్తి యెఱుంగక దుర్విదగ్ధుఁ డై.

క. అనువారు నందుఁ గొందఱు, ఘనుఁ డీతఁడు వీరికంటెఁ గార్ముకవిద్యం
దనరినవాఁ డయి దీనికి, మొనసెం గా కన్యుఁ డిట్లు మొనయంగలఁడే.

మ. అమితోత్సాహుఁడు దీర్ఘబాహుపరిఘుం డత్యంత తేజస్వి స
ద్విమలాచారుఁడు విప్రభక్తిపరుఁ డీ విప్రుండు విప్రప్రసా
దమునన్ విప్రుల కెల్ల సంతసముగాఁ దత్కర్మసంసిద్ధి సు
త్తముఁ డై పొందెడు మంచు నుండిరి దయన్ ధాత్రీసురుల్ ప్రీతు లై.

వ. అంత నయ్యర్జునుండు నవ్వింటిసమీపంబునకువచ్చి గురువులకు నమస్కారంబుసేసి ధనువునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి మ్రొక్కి దాని నెత్తికొని పూర్వపరిచితంబైన విల్లు మోపెట్టిన ట్లక్రమంబున మోపెట్టి జనులాశ్చర్యంబునం బొందుచుండ నేనమ్ముల నమ్మత్స్యయంత్రంబు నాక్షణంబ యురుల నేసినం జూచి బ్రాహ్మణక్షత్త్రియప్రముఖులయిన జనులెల్ల విస్మితు లయి.

[redacted] [redacted] [redacted] [redacted]

కాంచే!" అనుకొని ముఖం తిప్పుకొన్నాడు.

బట్టలు వేసుకొని విశ్వేశ్వరాలయానికి వెళ్ళాడు. అభిషేక కాండ పూర్తిఅయింది. తానువెళ్ళితే వెళ్ళవచ్చు కానిఅక్కడే, ద్వారానికి దగ్గరగా నుంచున్నాడు. మెదడు లోనిరికార్డులన్నిటినీతిరగ వేస్తున్నది ఆయన మనస్సు,'ఆఁ తెలిసింది'అనిపిస్తున్నది. ఇంతలో తెలియకుండా పోతున్నది: మరొక్కసారిఆమె చిత్రం మెదడులో పడితే తప్పకుండా ఆమె ఎవరో తెలిసిపోతుంది అనిపిస్తున్నది. ఎదురుగా కానవచ్చేవస్తువుల కేవలచూస్తూ, జ్ఞప్తిని గప్పిన నివురును ఊదుతూ, కదలకుండా నిలుచున్నాడాయన.

కాసేపటికి రాసాగేవచ్చారు వాళ్ళు. కానిఆలయంలో వెలుగు తక్కువగా ఉన్నది. రద్దీగా కూడా ఉన్నది. మాటిమాటికీ మనుష్యులు అడ్డం వస్తున్నారు. నిలకడగా చూస్తేగా, ఆమెనుపోల్చుకోనేది! ప్రయత్నం విఫలమయింది. కాని పట్టుదలకూడాఎక్కువయింది. ఆమెను వెంబడించాడు. ఒకవైపు మనసు సిగ్గుపడుతూనే ఉన్నది. తనకు అరవయ్యవపడు. ఆమెకు ఎంతలేదన్నా ఏభై ఉండకపోవు. ఈ వెంబడించడం ఏమిటి! అసి, 'ఎవరమ్మా మీారు, ఏఊరు?' అని అడిగితే ఎవరు కాదంటారు? తానుఅలా యిదివరకు ఎందరితో కల్పించుకొని మాట్లాడలేదు!

కాని ఆమె తనను చూసినపుడు, ఆమెముఖంలో సహజంగా విల్లివిరిసే చిరునవ్వుల నడుమ సిగ్గురేకలంతోచినవి. ఆమె పరిచితమాత్రమే కాదు. సన్నిహితురాలు అనిపించింది. ఆ సన్నిహితత్వం బహిరంగంగా బయల్పడడానికి కలిగిన సంకోచంవల్లనేనేమో, ఆమెను పలకరించలేక పోతున్నాడు.

వెనువెంటనే వెళ్ళివెళ్ళి, ఒకసత్రానికి చేరుకొన్నాడు. ఆ సత్రంలో ఒక చిన్నగదిలో ఉన్నారానలుగురు స్త్రీలు. ఆయన గుమ్మంలోనే ఆగి ఆలోచనలో పడ్డాడు.

ఆయన ఇలా మథనపడుతున్న సమయంలో ఆమె బట్టలు మార్చుకొని బయటకు వచ్చింది. ఖరీదయిన కంచిపట్టుచీర ధరించింది. పేటంచు రవిక తొడిగింది. తెల్లెరపు కొప్పున పొగడ పూవును ముడిచింది. నుదుట కుంకుమబొట్టు దిద్దింది. వయసు వలన వడిలిన ఆమెమోము నిశాంతచంద్రునివలె వెలికాంతులను విరజిమ్ముతున్నది. కాలమునాటి ఆమెరూపము కాలపు మేలిముసుగులోనుండి తొంగి చూస్తున్నది. ఆమె అందము చూసి మోహించరేమో కాని ముగ్ధులు కాకుండా ఉండలేరు. ఆమె దేవాలయానికి బయలుదేరింది.

ఆమె ఆగి కంటికొనమునుండి వెనుకకు చూసింది. మళ్ళీ ముందుకుసాగింది. దారి పొడుగునా ఆయన గమనముగమనిస్తూనే గమనం సాగించింది. కొంతసేపటికి అన్నపూర్ణ మందిర ప్రాంగణంలోకి చేరారు వారిరువురూ. ఆమె నిలిచింది. ఆయన దగ్గరకు వచ్చాడు. ఆమె వెనుకకు తిరిగి ఆయనను చూసింది. ఆయన అదివరకే ఆమెను చూస్తున్నాడు. ఆమె ముఖం తిప్పుకొన్నది. ఆయనా చూపు మళ్ళించాడు. కాని మరుక్షణంలో మళ్ళీ ముఖాలుతిప్పి యిరువురూ, ఒకరినొకరు ఎదురెదురుగా చూసుకొన్నారు.

"మీారు......" అన్నాడాయన.

"మీారు......" అన్నదామె.

ఒక్కక్షణం ఇరువురూ భ్రూకుటి ఘటించారు. వెంటనే



# ★ చిరస్మృతి ★

భ్రూవిక్షేపం కావించారు.

"మీ పేరు రాధకదూ" అన్నాడాయన స్ఫురణకు తెచ్చుకొని.

"మీది జొన్నవలస కాదూ!" అన్నదామె ఓరగా ఆయన్ని చూస్తూ.

తిరిగి ఒకరినొకరు చూసుకొన్నారు. చిరునవ్వులు నవ్వారు. "ఎన్నాళ్ళకెన్నాళ్ళకు!" అంటూ నిలిచిపోయిన చిరునవ్వుతో ఆమె ముఖాన్ని చూస్తూ నిలుచుండిపోయాడాయన. ఆమె ఒక్క నిముషం ఆయన్ని చూసి, నవ్వి, తలవంచుకొని, "అలా చూడకండి, అదోలావుంది. రండి. ఆ అరుగుమీద కూర్చుని మాట్లాడుకొందాం" అని అరుగువైపునకు వెళ్ళింది. ఆయనకూడా వెనుకనే వెళ్ళి అరుగుమీద కూలబడ్డాడు.

"రాధా, ఇలా కూర్చో. ఎంతకాలమయింది నిన్ను చూసి! చాలా మారిఉంటావనుకొన్నానుగాని, పోల్చుకోలేనట్టు లేదు సుమా!" అన్నాడు.

ఆమె పైటను కుడిభుజం మీదనుంచి లాగి కప్పుకొంటూ, "నేనుమాత్రం పోల్చుకోగలిగానూ? అంత వెంట వెంట వస్తున్నావేమా, అనిపించిందిగాని, నామతి మండిపోనూ, తెలిసినవాడై ఉంటాడని ఊహపోనేలా మొదట. తరువాత గడికి పెళ్లాక అనిపించింది" అని ముసి ముసి నవ్వులు నవ్వుతూ స్తంభానికి చేరబడి నిలుచున్నది.

"అయితే ఎవరో తెలుసుకొందామనే బయలుదేరావన్నమాట! లేక తెలిసే బయలుదేరేవా?" అన్నాడాయన కాళ్ళు ముడుచుకొని, మోకాళ్ళచుట్టూ ఉత్తరీయాన్ని బంధిస్తూ.

ఆమె కొంటెగా ఆయనవంక చూస్తూ, "నిశ్చయంగా కాదుగాని, ఒక అనుమానం లేకపోలేదు. చిరునవ్వు నవ్వేటప్పుడు వెలి కనుకొలకుల్లో తోచే చిలిపితనం ఇంత వయస్సు వచ్చినా పోలేదు. దాన్ని చూసిగానే నాకు సందేహం తోచింది." అన్నది.

కృష్ణయ్యగారి ముఖం నవ్వులతో విల్లి విరిసిపోతున్నది. "నీళ్ళలో దిగేటప్పుడు కళ్ళు గట్టిగామూసుకొని సీత్కారం చేశావే, అప్పుడే నాహృదయవీణలో ఏవో తంత్రులు మోగినయిగాని, అవి ఆలపించే రాగాన్ని పోల్చుకోలేకపోయాను" అన్నారాయన.

"ఆగు, కవిత్వంలో పడిపోతున్నావు. పోల్చుకోనేందుకేముంది? హృదయవీణలన్నీ ఒకేరాగాన్నేగా ఆలపించేవి! వయస్సుమళ్ళినా, మనస్సు మళ్ళినట్టు లేదు! అదిసరేగాని, ఎందరు మనుమలు?" అన్నది రాధమ్మగారు.

"మనుమల మాటకేంగాని, మీ ఆయనేం చేస్తున్నాడు? పోలీసు డిపార్టుమెంటులో ఉన్నట్టు జ్ఞాపకం; అంతేనా?"

"ఆఁ. అదే వెలగబెట్టారు. పింఛను పుచ్చుకొని అయిదేళ్ళయింది. చేసినన్నాళ్ళూ న్యాయం, ధర్మం అని కూర్చున్నారు. ఇప్పుడు కడసారిదాని కళ్యాణం వెనుకబడింది. రిటైరు డి. యస్. పి. కూతురంటే, పదివేలైనా లేనిదీ ఎవరూపలుకుతారు చెప్పు. చివరి చివరికి ఈచింతతో కుంగిపోతున్నారు. పోనీ యాత్రలకు పోయివద్దాం రమ్మన్నారు. ఆయనకుయాత్రలంటే పడదు. 'దేవుడెక్కడ లేడు? అంతదూరంపోవాలా' అంటారు. ఆయనదో వితండవాదం. ఇప్పుడైనా కాస్త కృష్ణా, రామా అనుకోకపోతే ఎలాగ చెప్పూ. అయితే, కన్నా, మీ ఆవిడ కూడా......"

సగంలోనే అందుకొని కృష్ణయ్యగారు, "నా పేరు ఇంకా జ్ఞాపకం ఉన్నదే! కన్నా అనిపిలిచి మన చిన్ననాటి సంగతులన్నీ జ్ఞప్తికి తెచ్చావు. చిన్నతనపు తీయనిచేతలన్నీ సినీమాలాగ ఒక్కసారి కంటిముందర ఆడుతున్నవి. జ్ఞాపకం ఉన్నదా? ఒక చల్లని సాయంత్రం, గోధూళివేళ నేను మామేడమెట్లు ఎక్కుతున్నాను. సరిగ్గా అప్పుడే నీవు దిగివస్తున్నావు..." అని పైకిచూస్తూ, మధురస్మృతుల నాస్వాదిస్తూ చెప్పుతున్నారు. సిగ్గుదొంతరల భారానికి తలఒగ్గగా ఆమె "అప్పుడు నీకోసమే ఎక్కాను. మేడమీద లేకపోతే తిరిగివస్తున్నాను. నువ్వే ఎదురయ్యావు. అప్పుడు నీవింకా కొంటెవాడివి" అన్నది. ఈమాట అని ఆయనను ఓరజూపు చూచింది.

ఆయన స్తంభానికి చేరబడి, అరమోడ్పు కన్నులతో, కలలోని కలవరింతవలె అన్నారు. "నేనుమాత్రం ఆ రోజును మరచిపోలేను. 'కన్నా, నేను రాధను. నీవు కృష్ణుడవు. మనం సార్థక నాములం.' అని అన్నావు నువ్వు. నేను... నేనేమన్నానో జ్ఞాపకంలేదు."

"'నీవైతే ఫరవాలేదు. కాని నేను సార్థకనామున్నైతే కావ్యం విప్రలంభ శృంగారం అవుతుంది సుమా' అన్నావు." అని అందించిందామె.

ఆయన ఆనందం తొణికిసలాడే కన్నులతో "అలా ఎంతసేపు నిల్చున్నామో! మన 'యమున' ఒడ్డున రాతిమీద కూర్చొని, పాదాలు నీళ్ళలో తడుపుతూ, ......" అంటూ ఉండగానే ఆమె అర్ధోక్తిలో అందుకొని, "ఏమిటో, చిన్నతనం, చేసే పనుల పర్యవసానం తెలియని దుడుకుతనపు రోజులు" అన్నది.

కృష్ణయ్యగారు ఉద్విగ్నుడై చటుక్కున ముందుకు వాలి, "అయితే చెప్పు రాధా, నేనెన్నడైనా జ్ఞాపకం వచ్చానా? చిన్ననాడు ఒకరినొకరు తలచుకొంటే కలిగే తహతహ మళ్ళీ ఎన్నడైనా కలిగిందా?" అని ఒకింత ఆవేగంతో పలికారు.

ఆమె ఆయనను చూసి, నిట్టూర్చి "వాటిని తలచుకొని ఇప్పుడు ఆవేశపడడం ఎందుకు? ఏదో రోజులు గడచిపోయినయి. మనుమలకు కూడా పెళ్ళీడు వస్తున్నది. అన్నట్టు, పిల్లలెందరు?" అని మాట తప్పించబోయింది.

కృష్ణయ్యగారు నిట్టూర్పు విడిచి, "ఆడవాళ్లు ఎలాగైనా కఠినులు. ఇట్టే మరచిపోయి, మారిపోగలరు. నేను మరువలేకపోయాను, రాధా! మొన్న మొన్నటివరకూ కూడా నిన్ను 'యమునాతటిపై' కలలు కంటూనే ఉండేవాణ్ణి, కలలో. ఒకొక్క రోజున ఒంటరిగా ఏటికిపోయి, గంటలద్దీ 'యమునా విహారమును' తలచుకొంటూ కొండేవాణ్ణి. ఏటిఒడ్డున మనం ఆడుకొన్నది రెండుసార్లే! నలభై ఏళ్ల క్రిందట! కాని ఎంత శాశ్వతమయిన ముద్ర మనసుపైన పడింది! తలచుకొంటే నిన్నటిలాగ ఉన్నది." అన్నాడు.

ఆమె కొంతసేపు శూన్యంలోకి చూస్తూ నిలబడిపోయింది. కనుకొలకులు చెమర్చినవి. కళ్ళు గట్టిగా మూసుకొని, మళ్ళీ తెరచి, "నేనూ మరచిపోలేదు. బహుశః మేలుకొన్నప్పటికంటె మైమరచినప్పుడే ఎక్కువ సుఖపడ్డానేమో!" అని కనుకొలకులలోంచి ఒక బిందువును గోటితో తీసి వేసింది.

ఇరువురూ కొంతసేపు మౌనం వహించారు. తలపుల భారంతో హృదయాలు బరువెక్కినవి. లక్ష్యరహితంగా నున్న ఏకాగ్ర దృష్టులను ఆమె వైపునకు తిప్పి, "పాపం ఆ యమధర్మరాజుతో ఇన్నేళ్లు ఎలా గడిపావో!" అన్నారు కృష్ణయ్యగారు.

ఆమె నవ్వి, "మొదట ఆయన నాకూ యమధర్మరాజులాగ కనిపించినా, నిజంగా ఆయన ధర్మరాజే. ఆయనదంతా ఒట్టిగాంభీర్యమేగాని, పాపం మనసు వెన్నలాంటిది. నా పరధ్యానం పోగొట్టడానికి ఆయన చాలా తాపత్రయం పడేవారు. ఏవేవో ఊళ్లు తిప్పారు. సినీమాలకు, నాటకాలకూ తీసుకుపోయేవారు. కాని డ్యూటీ వచ్చేటప్పటికి హఠాత్తుగా వదిలేసి వెళ్ళిపోయేవారు. నాకంటె డ్యూటీ ఎక్కువా అని వ్యథపడేదాన్ని. ఒకమాటు నా పుట్టినరోజుకి తిరిగి వస్తానని, వచ్చేటప్పుడు చీర తెస్తాననీ చెప్పి క్యాంపు వెళ్ళిపోయారు. వారం రోజుల వరకూ జాబూ, జాడా లేదు. తిరిగొచ్చాక, మళ్ళీ నేనడిగితే, 'అరె, మరచిపోయాను. పోనీ నువ్వు తెప్పించుకోకపోయినావా, కోటయ్య కొట్లో!' అనేశారు. అంతే. నేను

కొచ్చుకొన్నాను. కన్నా అయితే యిలా చేసేవాడు కాడనుకొన్నాను," అన్నది.

"అయితే, ఇన్నాళ్ళూ నీవు పిల్లమరగానే కాలం వెళ్ళబుచ్చావన్న మాట!" ఏమాత్రమో హేళనగానే అన్నారు కృష్ణయ్యగారు.

ఆమె చటుక్కున ఆయనను చూసి, తిరిగి దృష్టిని మరల్చి, తనలో తనకువలె చెప్ప సాగింది. "మొదట్లో బాధపడ్డా, తరువాత సద్దుకోగలిగాను. ఒకసారి ఆయన క్యాంపు నుంచి వచ్చి, 'కృష్ణయ్య అనే వకీలు నీకు తెలుసునా' అని అడిగారు. నేను ఏదో కొంపమీదికి వచ్చిందనుకొని, 'ఆ, తెలుసు. మా ఊరివాడే—ఏం?' అన్నాను. 'ఆయన ఏదో పనిమీద ఈ ఊరు వచ్చాడు. మనింటికి భోజనానికి పిలవనా? చిన్ననాటి స్నేహితుణ్ణి కలుసుకొందువుగాని' అన్నారు. నేను సంకోచిస్తూనే, 'వద్దులెండి, ఎందుకూ?' అన్నాను. ఆయన చటుక్కున నవ్వుతూ, 'రాధే (ఆయన పిలుపు అదేలే), నీ పరధ్యానానికి కారణం నాకు తెలుసు. నీ వాతనిని చూసినంతమాత్రాన నా సొమ్మేమీ పోదు. నీ ముఖం వికసిస్తే చాలు' అన్నారు. నా కళ్లవెంబడి నీళ్లు జల జల రాలినవి. గద్గదంగా 'మీరు దేవుళ్లండీ' అనిమాత్రం అనగలిగాను. ఆయనమంచితనాన్ని గురించీ, కర్తవ్య రక్తినిగురించీ అనేకం విన్నాను. ఆయనకు భార్యనని గర్వపడుతున్నాను కూడా" ఆమె ముఖంమీద ధన్యతాభావం ప్రస్ఫుటంగా తోచింది.

"నీవు అదృష్టవంతురాలవులే, రాధా! అయితే మరి నన్ను మరిచిపోయి ఉండవలెనే!" అన్నాడాయన, గోడకు చేరబడుతూ.

"ఆయనమీద మమకారం నాకు పెరిగిన మాట వాస్తవమే, గాని ఏమిటో, మా పెద్దబ్బాయిని చూస్తే ఎట్లాగో, ఆయన్ని చూస్తేకూడా అంతేననుకో. ఏదో కేసును మనసులో పెట్టుకొని వచ్చి, ఇంట్లో అన్నీ ఇటూ అటూ విసురుకొంటూ ప్రవేశించే వారు. ఆయన కుర్చీలో కూర్చోగానే నేను వెనుకనుంచి వెళ్లి, ఒక నిమిషం మాట్లాడకుండా తల నిమురుతూ నిల్చునేదాన్ని. ఆయన ఆ కేసులో వాళ్లెవరినో గురించి కోపంతో ధడామడా చెప్పేసేవారు. నాకేమీ అర్థం కాకపోయినా, ఆయన ధోరణిని బట్టి, ఆయన కష్టాలయినవారిని గురించి 'పాపం' అనీ, అయిష్టులయినవారిని గురించి 'వెధవలు!' అనీ అంటూ, మెల్లిగా యీయాని శాంతీసి, అన్నానికి తీసుకుపోయేదాన్ని. భోజనం చేసేవరకూ పిల్లలను ఆయనకంట బడనిచ్చేదాన్ని కాదు. ఆయన మళ్లీ వెళ్తూ 'హోటళ్లలో భోంచేసేద్దామనుకొన్నాను. ఇంటికిరావటం చాలా మంచిదైంది సుమా' అని నా గడ్డంపట్టుకుని ఆడించి వెళ్లి పోయేవారు. నిజంగా ఆయన పసి పాప. మానసికంగా ఆయనకు నేను తల్లినే. ఆయన బాల్యాన్ని అధిగమించి, యువకునివలె నన్నెన్నడూ ప్రేమించలేదేమో ననిపిస్తుంది. నేను విడమర్చి నీకు చెప్పగల్గుతున్నానో లేదోగాని, నా మనస్సు ఆయనమీది మమకారంతో నిండినప్పుడుకూడా, ఏదో వెలితి ఉండిపోయేది. అప్పుడు నీవు జ్ఞాపకం వచ్చేవాడివి," అన్నది. ఆమె మాటలలో తన్మయత నిండిఉన్నది. హృదయం నిండి కళ్లలోంచి పొర్లి ప్రవహిస్తున్నట్లుగా ఉన్నవి ఆమె దృష్టులు.

కృష్ణయ్యగారు లేచి, ఆమెను సమీపిస్తూ, "రాధా, నీవూ జీవితపు అంచులు చేరావు. నేనూ చేరాను. మనం యిక యింటికి వెళ్ళకపోతే నేమి?" అన్నారు. ఆవేశంతో ఆయన కనులు ఉబ్బి చెమ్మగిలినవి.

ఆమె ఒక్క అడుగు వెనుకకు వేసి, "ఛ, అదేం మాట! నీతిని మగవుని వదలుకొని, ఈ వయసులో ఏం బావుకుందామని!" అన్నది.

"మన ఇద్దరి సాన్నిధ్యమే సంతృప్తినిస్తుంది రాధా! అంతకు మించి నేనేమీ సూచించటం లేదు" అన్నారు కృష్ణయ్యగారు.

"మానసికమయిన సంతృప్తికి శారీరక సాన్నిధ్యం కావాలా? ఇన్నాళ్ళూ గడిపి; ఈ కాస్తలో మన జీవితాలను కుక్కముట్టుకు పోవటం ఎందుకు? పైగా ఆ అమాయికపు పసిపాపను విడిచి స్వర్గానికి కూడా పోలేను. నేను లేకపోతే ఆయన ఒక్క క్షణం కూడా ఉండలేరు" ఆమె ఒక్క క్షణం ఆగి, హఠాత్తుగా గొంతుమార్చి, "ఇక వస్తాను. చాలాసేపయింది. మేం రాత్రికి ప్రయాగవెళ్ళి నెలాఖరుకి మా ఊరు చేరుకుంటాం. నీవు తిరిగి రాగానే మా ఊరు తప్పకుండా రా. ఆయనకు ఉబుసుపోక మనమడికి పాఠాలు చెప్పుకొంటున్నారు. నువ్వో నెలరోజు లుండిపోదువు గాని" అని వెనుకకు తిరిగింది.

కృష్ణయ్యగారి మనస్సు అవ్యక్తమయిన ఆరాటంతో కొట్టుకొంది. రెండడుగులు ఆమెవైపు వేశాడు. ఆగాడు. అతని ముఖం మీద పడిన ముడుతలు నిగ్రహించుకోడానికి ఆయన చేస్తున్న ప్రయత్నాన్ని దాగనీయటం లేదు. ఆమెవెనుకకు తిరిగి, చూసి, చిరునవ్వు నవ్వింది. "నీలోని ఈ ఉద్వేగాన్నే, నేను మరచిపోకుండా మనసులో దాచుకున్నది. కాని మన పెళ్ళి అయితే నీలోని ఈ ఉద్వేగం నిలిచేదా! ఏమో! స్మృతిలో ఉన్న తీపి, అనుభవంలో లేదనిపిస్తున్నది... నా కన్నా మంచివాడు. పో. వాళ్ళు చూస్తే బాగుండదు," అని వెళ్ళబోయి "అన్నట్టు, మా కడసారిదాని కేదైనా సంబంధం చూద్దూ," అన్నది.

కృష్ణయ్యగారు చిటికె వేసి, "మంచి మాట చెప్పావు సుమా. ఎందుకూ, మా నాలుగో వాడున్నాడు. ఆ వెధవ కిచ్చి ముడి వేసేద్దాం. అప్పుడు నువ్వు కనబడాలంటే కాశీ రానక్కరలేదు" అన్నారు.

ఆమె కంట్లో మెరుపు మెరిసింది: "అల్లాగే, వెళ్ళగానే ఆయన్ను పంపిస్తాను. ఇది ఖాయం. కాని నేను నీకు చెల్లెల్ని అవుతాను, మరచిపోకుమీ," అన్నది కొంటెగా.

"ఈ వయస్సులోనా!" అంటూ ఆయన నవ్వేశాడు, వెలికనుకొలకుల్లో చిలిపితనం చికిలిస్తూ.





"తాజ్ మహల్‌ను మించిన కట్టడం?"

1957 జనవరివరకూ తయారైన రాధాస్వామి ఆలయ స్వరూపం. ఆగ్రాకు నాలుగు మైళ్ళదూరంలో, నిరంతరం ఏబదిఏండ్లనుండి పనిచేయగా యిప్పటికి తయారైన మొదటి అంతస్థు.

ఫొటో: "ఎన్నార్"—రాజమండ్రి.

# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది



**మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా ఉంచుకొనుటకు**

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణము లోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరు అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.




**చర్మమును శుభ్రపరచే క్రీమ్**

ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# నక్షత్ర ఫలితాలు

**| 1-7-59 మొదలు 7-7-59 వరకు |**

గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | | | ర |
| | మేష, వృషభ, మిథున కర్కాటక ములలో చంద్రుడు. | | బు కు |
| | | | కు |
| గు | శ | | రా |

*** అశ్విని [ చూ, చే, చో, లా ] ***

ఈవారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయమువల్ల కార్య సాధన చేదామనుకున్నారో వారివల్ల ఆటంకములు కలుగుతాయి. అయినా ఈశ్వరానుగ్రహంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లో వారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచి రోజులు కావు. వారమంతా ఆందోళనగా వున్నా సజ్జన సాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతా దర్శనము నష్టద్రవ్యలాభము కలుగును.

*** భరణి [ లీ, లూ, లే, లో ] ***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత యెక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తాయి. పరోపకారానికి ప్రయత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్యకు అనారోగ్యము కలుగుతుంది. ఇచ్చి పుచ్చుకునేపట్ల వివాదాలు, ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి వున్నప్పటికీ వారి సహకారము లభిస్తుంది. వారమంతా వర్తకులకు నిరాశ అయినా వారాంతమందు స్వల్ప అనుకూలత.

*** కృత్తిక [ అ, ఈ, ఊ, ఏ ]**

ఈ వారము ఎన్ని అవాంతరములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించిన డబ్బు అందక అప్పుచేస్తారు. సోదర సహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు. దెబ్బ తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, లోహపు సామానుల వ్యాపారస్థులకు నష్టముతో కూడిన లాభము. 6న ప్రమాద సూచన.

***రోహిణి [ ఓ, వా, వీ, వూ ] ***

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోనూ, అధికారుల సహాయములోను, ఆటంకములుగడిచి ఫలం పొందుతారు. ఆదాయము అభివృద్ధిఅవుతుంది. వైద్య జ్యోతిష శాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. గణితశాస్త్రజ్ఞులకు కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 2, 8 తేదీలలో ధనలాభము. కార్యసిద్ధి.

## బి. నరసింగరావు

*** మృగశిర [ వే, వో, కా, కి ] ***

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికివస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపి నూతన విషయాలు తెలుసుకుంటారు. వారమంతా సుభయోగములతో కూడి వుంటుంది. 2, 8 తేదీలలో ధన లాభము. కార్యసిద్ధి, పుత్రుల లాభాభివృద్ధి. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకూ మేలుగా వుంటుంది.

*** ఆరుద్ర [ కూ, ఖ, జ, ఛ ] ***

ఈ వారము వినోదములలో పాల్గొనుట, దధిక్షీర మధుర పదార్థయుక్త సుభోజనము రజితపాత్రములలో భుజించుట, నీటిమీద ప్రయాణము చేయుట, తలచిన కార్యములలో జయము, తెల్లటి వస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, నూనె, నూలు, బట్టలు, బియ్యము, వెండి ద్రవపదార్థ జనిత వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకులాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది. 5, 6 అధిక ఖర్చులు, ఆందోళన.

*** పునర్వసు [ కే, కో, హా, హి ] ***

ఈవారము ధనధాన్యవృద్ధి, యత్నకార్యలాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తు లాభము. పరోపకారంవల్ల కీర్తివంటి రాజయోగములు గలుగును. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఆప్తులతో విందువినోదము.

*** పుష్యమి [ హూ, హే, హో, డా ] ***

మీకు ఈవారము కార్యభారము ఎక్కువ రాబడి తక్కువ, గృహావసరములు తీరనందున కలతలు, ఆరోగ్యము చెడుచున్నట్లుసూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహశాంతైన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్థులకు క్రొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన. రాజకీయవాదులకు స్వల్పానుకూలత 5, 6న అనారోగ్యము. 3, 4 పితృవర్గ సహాయము. ధనలాభము, ప్రయాణము.

*** ఆశ్లేష [ డీ, డూ, డే, డో ] ***

ఈవారం మీకుమిశ్రమయోగం. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయంవల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపంవల్ల ఆందోళన. ఉద్యోగస్థులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువుసాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళనకలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్ర సహాయము, కార్యసిద్ధి, విశేషీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదనవంటి శుభయోగములు కూడా కలవు.

*** మఖ [ మా, మీ, మూ, మే. ]**

ఈవారము మీగు సహాయము పొందదలచుకున్న వ్యక్తిమూలముగా కార్యహాని అవుతుంది. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక చింతవల్ల దైవముపై భారమువేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి వ్యాపారస్తులకు నిరాశ విద్యార్థులకు మంచి కాలముకాదు. పుణ్యక్షేత్ర సంచారము. దేవతాదర్శనము విచిత్రములను చూచుట జరుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా వుంటుంది.

*** పూర్వఫల్గుణి (పుబ్బ) ***

**[ మో, టా, టీ, టూ, ]**

ఈవారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ యత్న కార్యములు ఎక్కువశ్రమతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. ఇతరులకు సహాయము చేయ—



# నక్షత్రఫలితాలు



బూని సఫలము గాక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకోవడములో వివాదములు వస్తాయి. ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ తోటి వారి సహకారము వర్తకులకు వారమంతా నిరాశ వారాంతమున మేలు. విద్యార్థులకు చదువు బాగాసాగదు. భార్యకు అనారోగ్యము.

*** ఉత్తరఫల్గుణి (ఉత్తర) ***
**(టే, టో, పా, పీ)**

ఈవారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యసాధన పొందుతారు. ఆశించినసొమ్ము సమయానికి అందక అప్పుచేస్తారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహ, ఖనిజ, వ్యాపారస్థులకు కష్టముతో కూడిన యోగము. గనుల యాజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలు కాలము.

*** హస్త [పూ, ష, ణ, ఠ] ***

మీకు ఈ వారము యోగ కాలము. బంధువులసహాయము, అధికారులసహాయము కలుగుటచేత వచ్చిన ఆటంకములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. శాస్త్ర ప్రసంగాలలో పాల్గొంటారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా ఉంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలు కాలం.

***చిత్త [పే, పో, రా, రి]***

ఈ వారము మీకు మంచి భాగ్యయోగం అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు, మేలు కాలము. ఉద్యోగస్థుల హోదా పెరుగుతుంది.

*** స్వాతి [రూ, రే, రో, తా]***

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీతసభలు, కవితాగోష్ఠివంటి వినోదములలో బంధుమిత్రులతో కలిసి పాల్గొని మృష్టాన్న భోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభకార్యములలో కూడా పాల్గొంటారు. నీటిమీద ప్రయాణము చేయవలసివస్తుంది. నూలు, బట్టలు, బియ్యము, వెండివర్తకులకు లాభము. విద్యార్థులకు వుత్సాహముగా చదువుసాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలం.

*** విశాఖ [తీ, తూ, తే, తో] ***

ఈవారముకూడా గతవారమువలెనే యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. శుభ పుణ్య కార్యములలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నాలుచేస్తారు. వాహనయోగము కలుగుతుంది. వుద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు నిలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడి వున్నా కుటుంబకలహముచే ఆందోళన కలుగుతుంది. కవులను గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగం.

*** అనూరాధ [నా, నీ, నూ, నే] ***

ఈవారము రాబడి తక్కువ, ఖర్చులు ఎక్కువ. కార్యభారముచె తీరుబడి వుండదు. గృహావసరములు తీరక స్పర్థలు వస్తాయి. ఆరోగ్యము చెడుచున్న చిహ్నాలు కనపడగానే ఔషధచికిత్సపొందడము రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్థులకు

**—ఈవారము ధరలు:—**

నూలు, వస్త్రములు:- మార్పు లేదు.
నూనెదినుసులు:- సమస్థాయిలో వుండును
ఆహారధాన్యములు:- మార్పు లేదు.
బెల్లము, పంచదార, చింతపండు:- మార్పు లేదు.
పప్పుదినుసులు:- మందముగా వుండును.
వెండి, బంగారము:- స్వల్ప తేడాలో వుండును.
సస్యానుకూలముగా వర్షించును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణ అను పేరునకు మృగశిరానక్షత్రమును, వ్యాఘ్రము అను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తమును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.

కొత్తసమస్యలు, వర్తకులకు ఆందోళన విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా సహాయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము కార్యలాభం ప్రయాణము కలుగును.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]***

ఈ వారము నిరాశగా వున్నా అజ్ఞాత మిత్ర సహాయమువల్ల కార్యలాభం అవుతుంది. ఇంట్లో వున్న వారి ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత వర్తకులకు వారాంతమందు లాభము వారమంతా ఉద్రేకంతో కూడి వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూప వస్తు సంపాదనవంటివి. ఆత్మీయుల అనారోగ్యముచే వ్యధ, అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

***జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,]***

ఈ వారము మీకు మిశ్రమయోగము ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక అశాంతి కలుగుతుంది. అయిననూ ఈశ్వరానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు చాలా కాలంనుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనో వికాసము కలుగుతుంది. వారమంతా అశాంతి వున్నా నష్టద్రవ్య లాభము పొందుతారు.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకునే పట్ల వివాదాలు వచ్చి మనోవ్యధ కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా ఆ సంతోషము అమిత ఖర్చులవల్ల వుండకుండా పోతుంది. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 5 వ భార్య ఆరోగ్యభంగము. అధిక ఖర్చులు.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయిననూ పట్టుదలతో కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిగుడుకులు సద్దుకుంటాయి. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ, వ్యాపారస్తులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 6 వ ప్రమాదభయం, అధిక ఖర్చులు.

*** శ్రవణము [జూ, జే, జో, ఘా]***

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్య దిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు, బంధుదర్శనము కలుగుతుంది. గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలు కాలము. 5, 6 వ అధిక ఖర్చులు, ఆపైన ధనలాభము.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాలకు ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, శాస్త్రచర్చలు, ప్రభుత్వ సన్మానమువంటి యోగములు జరుగుతవి. విద్యార్థులు నూతన అంశాలను నేర్చుకుంటారు. ఇంట్లో వున్నవారి ఆరోగ్యము బాగుపడుటచే ఆందోళన తొలగుతుంది. పిల్లల క్షేమలాభముల కొరకు కొన్ని యేర్పాట్లు చేస్తారు. న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగులకు పండితులకు ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

***శతభిషం [గో, సా, సి, సూ]***

ఈ వారము మీరు తలపెట్టిన పనులలో జయము పొందుతారు. బంధుమిత్రులతో మృష్టాన్న భోజనము చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జనితవస్తువుల వర్తకులకు లాభదాయకము. నీటిమీద ప్రయాణము చేయవలసి వస్తుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలము.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]***

ఈ వారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధివుంటుంది. వివాహాది శుభకార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇష్టవస్తులాభము. పరోపకారమువల్ల కీర్తి కలుగుతాయి. విద్యార్థులకు చదువు చురుకుగ సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగదాయకము.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింత మాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును. అకాలభోజనమువల్ల అనారోగ్యము కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు బాగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత 5 వ అనారోగ్యము, ఆపైన శుభయోగము, కార్యసిద్ధి.



శివుడు

చిత్రకారిణి: వజ్రాలశారద

*** రేవతి [దే, దో, చా, చీ]***

ఈ వారము యత్న కార్యములకు ఆలస్యము. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చెడుటచే చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతములకు బదిలీఅయే సూచనలున్నవి. రహస్యములు కనిపెట్టుటకు వినియోగించబడతారు. వారమంతా చికాకుగావున్నా వారాంతమందు అజ్ఞాత మిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి జరుగుతుంది. ★



# వనితా లోకం





# ఒకరికి ఒకరు

సంధ్యాప్రియ (విజయవాడ)

నా చిన్నతనంలో—అంటే హైస్కూల్లో హయ్యర్ ఫారమ్స్ చదువుతూన్న రోజుల్లో—మా అక్కయ్యకి దాని స్నేహితురాలు ఒకామె ఉత్తరాలు వ్రాస్తుండేది. వాటిలో—"భార్యా భర్తలు ఒకరికి ఒకరు ఆసరాగా ఉండి జీవితంలోని కష్టసుఖాలు పంచుకుంటూ ఉండాలి. అందుకనే ఆలుమగలు జీవితభాగస్వాములన్నారు. ఒకరిని ఒకరు అర్థం చేసుకుని, ఒకరిని ఒకరు ప్రేమగా, గౌరవంగా చూస్తుంటే సంసారం సాఫీగా ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా గడిచిపోతుంది కాని ఒకరిని ఒకరు విమర్శించుకోవటం—ఆ విమర్శ కావాలని కాక అమాయకంవల్ల, అనుభవశూన్యతవల్ల కావచ్చు—మొదలైతే ఇద్దరూ అటు భార్యా, ఇటు భర్తా లోకులకు లోకువయి పోతారు—'అని వ్రాస్తూ ఉండేది ఆ స్నేహితురాలు. అప్పట్లో ఈ విషయం నాకర్థమయింది కాదు. ఇటీవల గృహస్థాశ్రమంలో చేరిన తర్వాత ఈ సంగతి అర్థమవటమే కాక అనుభవంలోకి వచ్చింది. అంతే కాక అదొక జీవితసత్యంగా కూడా నాకు తోచింది.

మేము విశాఖపట్నంలో ఉంటూండగా మే ముంటూన్న ఇంట్లోనే ఒక భాగంలో శారద అనే అమ్మాయి ఉండేది. చాలా అమాయకురాలు. లోకం తీరు తెలియని అర్భకురాలు. ఆ అమ్మాయి భర్త ఏదో ఆఫీసులో అప్పర్ డివిజన్ క్లర్కు. నూటయాభై రూపాయలదాకా వచ్చేది జీతం. ఈ శారద వయసు చిన్న అవటంవల్ల జీవితానుభవం చాలా తక్కువ. పైగా చిన్నప్పటినుంచీ పెరిగింది పల్లెటూళ్ళో అవటంవల్ల బజారుకుపోయి కావాల్సిన కూరగాయలు తెచ్చుకోవటమంటే భయం; ఆ అలవాటూ లేదు. ఇహ శారద భర్త—మొన్నటిదాకా హోటల్లో తింటూ చదువుకున్నవాడు కాబట్టి కూరగాయల బేరాలు తెలియవు.

శారద ఒకనాడు వంకాయలు, బంగాళాదుంపలూ, తోటకూరా తెమ్మని మార్కెట్టుకి పంపించింది. బంగాళాదుంపలు ఆనాడు మార్కెట్టుకు రానేలేదుట. వంకాయలు దొరికినయ్. తోటకూరమాట మర్చిపోయాడు.

వంకాయలు మాత్రం తీసుకుని ఇంటికి వచ్చాడు.

"బంగాళాదుంపలు లేకపోతే మరొకటేమయినా తీసుకురాకూడదా?" రాత్రికి కూర ఎలా మరి? తోటకూర తెమ్మంటే మర్చిపోయారు" అని సాధించసాగింది.

అతను నోరు తెరిచాడు. రాత్రి కూరకు బంగాళాదుంపలు దొరక్కపోతే మరేదయినా తీసుకురావాలన్న ఆలోచన పాపం అతనికి తట్టలేదు.

"ఆ మాత్రం ఆలోచన లేకపోతే సంసారం ఎల్లా గడిచేది? మీ రెప్పుడూ ఇంతేను! మా అన్నయ్యను చూడండి. ఎంత చక్కగా బేరంచేసి మంచి మంచి కూరగాయలు తెస్తాడో! మీకేమీ తెలియదు..." అంటూ వంకాయలు సంచీలోంచి క్రింద కుమ్మరించింది.

అతను కాయకాయా పరీక్షగా చూడలేదు కాబోలు ఖర్మ! రెండు మూడు పుచ్చులున్నయ్.

"అయ్యో! అయ్యో! అన్నీ పుచ్చులేనండి..." అని బుగ్గలు నొక్కుకుంది.

ఇలాంటి చిన్న చిన్న కలహాలు వినటమంటే మా అత్తగారికి ఎక్కడలేని సర్దా. ఏదో పనున్నట్లు వాళ్ళ భాగంలోకి పోయి "ఏమిటమ్మాయ్ శారదా! పుచ్చులంటున్నావు?" అని తెలియనట్లు అడిగింది.

"ఏం చెప్పమంటారండి బామ్మగారూ! కూరగాయలు తెచ్చుకోవటం చేతకాదు మనిషికి?! తెమ్మన్నవి లేవని రాత్రికి రెండో కూర లేకుండా వచ్చారు. తోటకూర తెమ్మంటే మర్చిపోయారు. తెచ్చినవంకాయ లేమో పుచ్చులు. పోనీ మార్కెట్టుకు పోయి తెచ్చారుగదా, చౌకగా వచ్చాయా అంటే ఇంటికి వచ్చి ఇచ్చిపోయే ధరకన్నా వెల ఎక్కువ!..."

ఇలా చెప్పుకుపోతున్నది మొగుడిమీద.

అలా అతన్ని విమర్శించటం అతని మీద కోపమూ, ద్వేషమూ ఉండికాదు. తెలివితక్కువతనంవల్ల—అలా చెప్పటంవల్ల తనకు కష్టనష్టం తెలియనందువల్ల కడుపు చించుకుంటే కాళ్ళమీదే పడుతుంది!

ఆ మర్నాడు మా అత్తగారు పక్కింటి పిన్నిగారితో అంటూన్నది— ఆ "అబ్బాయికి

(88-వ పేజీ చూడండి)

పై వారం

★

'పొరపొచ్చాలు'

★

ప్రత్యేక వ్యాసం

# దిండుగలీబుల మీదకి

ప్రక్కటి బొమ్మలో చూపించిన విధంగా పువ్వులు వేసిన గలేబుకు కావలసినవి :- మంచి రకం లాంగ్ క్లాతూ, వికాసా ముదర రంగు డి. ఎం. సి. దారం. ముందర నుండి తలగడాకి సరిపోయేవిధంగా మీది భాగం, కింది భాగం వేరువేరుగా ముక్కలు కత్తిరించి చుట్టూరా అంచుకోసం 4 అంగుళాల వెడల్పు వ పొడుగులకి, వెడల్పులకి, వేరే ముక్కలు వాలుగుకత్తిరించాలి. గలేబు పొడుగుకన్న 8 అంగుళాలు ఎక్కువ పొడుగు ఉన్న ముక్కలు రెండూ, వెడల్పుకన్నా 8 అంగుళాలు ఎక్కువ ఉన్న ముక్కలు రెండు కత్తిరించాలి. 2 వ బొమ్మలో చూపించినవిధంగ అంచు ముక్కలికి మధ్యగా సాఫ్ట్ పెన్సిల్ తో గీతగీసి, గీతకి రెండువైపులా 1½ అంగుళాల చదరపుగళ్ళు మార్కు చేసికొని, 2వ బొమ్మలోనూ, 3 వ బొమ్మలోనూ చూపిన విధంగా పువ్వులు కుట్టాలి. (తలగడా చుట్టూ సరిగా చదరాలు వచ్చునట్టుగా మాత్రం ముందుకొలతలు చూసుకోవాలి)




గీతలమీదుగా ముందు రంగుదారంతో మూడు పోగులు వేసి, ఈ పోగులమీద పువ్వులన్నీ దగ్గరగా, కొజాకుట్టుతో కుడితే, కొంచెం ఎత్తుగా బాగా కనిపిస్తాయి. ఈ పువ్వులు, పొడుగుపక్క అంచులకి పూర్తిగానూ, వెడల్పు పక్క అంచులకి చివరిగళ్లు వదిలివేసీ, కుట్టాలి.

ఈ పువ్వులన్నీ కుట్టిన తర్వాత, 4 వ బొమ్మలో చూపించినవిధంగా అంచులన్నీ మధ్యగా మడతపెట్టి, (పువ్వులు రెండువైపులా వచ్చేటట్టు) తలగడ కొలతలో కొసలు కలిపి పూర్తిచేయాలి (రంగుదారంతో నే) వెడల్పులోని ఆఖరిగళ్ళు, పొడుగు అంచు మడతలో ఉండాలి. ఇలా కుట్టిన అంచుకి, లోపలిభాగం ½ అంగుళం వెడల్పు ఖాళీగా ఉంటుంది.

అంచులు పూర్తయిన తర్వాత గలేబుకి కిందా మీదా భాగాలమీద 1 వ బొమ్మలో చూపినవిధంగా నాల్గుచివర్లా అదే రకం పువ్వులు (పెద్దవి) కుట్టుకోవాలి. పువ్వులన్నీ పూర్తయినతర్వాత అంచూ, మీదా కిందా భాగాలూ, కలిపి గలీబు పూర్తిచేయాలి. ఈ కలిపేటప్పుడు, అంచులో ఖాళీగా ఉన్న భాగం లోపలవచ్చేటట్టు మూడుపక్కలా కుట్టి, (తిరగేసి కుట్టాలి) ఒక వెడల్పు పక్క మాత్రం అంచుమీది భాగానికి జాగ్రత్తగా మడతపెట్టి కుట్టాలి. అవైపు కిందిభాగం చివర మడతపెట్టికుట్టాలి. ఈ రెండువైపులూ కలపటానికి కుండీలో, కుట్టతోకుట్టినతాళ్ళో కుట్టుకోవాలి. చుట్టూరా చదరపు పూలంచుతో తలగడా, చూట్టానికి చాలాఅందంగా పడుకోటానికి ఆహ్వానిస్తూ ఉంటుంది. ★


ఎం. ప్రభావతి భువనేశ్వర్

(ఒరిస్సా)



# ఒకరికి ఒకరు



(36-వ పేజీ తరువాయి)

ఏమీ తెలియదు. కూరగాయలే తెచ్చుకో లేడు. ఆడది ఎన్నింటికని ఏడుస్తుంది? ఇంట్లోపనే చూసుకుంటుందా, బజారుపనే చేస్తుందా! ఇలాంటి మగవాళ్లతో ఆడది ఎలా సుఖపడుతుంది. ఇంతకీ శారద అదృష్టాన్ని చెప్పుకోవాలి "చేసుకున్నంత."

దాంతో మా వీధిలో ఉన్న ఆడవాళ్ళందరికీ శారద భర్తంటే అప్రయోజకుడనే! ఏదయినా మాటవస్తే కూరగాయలు తెచ్చుకోలేని మగవాడంటారు. శారద కనిపిస్తే ఎక్కడలేని సానుభూతి చూపిస్తారు. అలాంటి మొగుడితో ఎలా కాపురం చేస్తున్నదో నంటూ అంగలారుస్తారు.

కానీ అతనికి తెలియవే అనుకుందాం ఇలాంటి విషయాలు. అనుభవంమీద అవే తెలిసివస్తయ్—అని ఊరుకోవాలి గాని ఇలా అందరికీ చెప్పేస్తే తనకు వచ్చే లాభమేమీ ఉండదు. అటు అతను అలుసయిపోవటమే కాక తననీచులకనగా చూస్తారు.

ఆడవాళ్ళవలనవచ్చే తిప్పలివి. కొందరు మగవాళ్ళు కూడా భార్యల్లోరని లోపాలు బయటవాళ్ళకి చెప్పి తేలికయిపోతారు.

* * *

గుంటూరులో ఉంటూండగా మా వారి స్నేహితుడొకాయన ఉండేవారు ప్రకాశరావని. ఒక రోజున మావారు భోంచేసి—ఎండాకాల మనుకుంటాను—ఆరుబయట పడుకుని ఉన్నారు. రాత్రిపూట నేనింకా ఇల్లు సర్దటంలోనే ఉన్నాను. అంతలోకి ప్రకాశరావు కిళ్ళీ నములుతూ సిగరెట్టు కాలుస్తూ వచ్చారు.

మా వారు—"ఏమండీ! భోజనమయిందా? అని మాటవరసకి అడిగారు.

"బొట్టుపనీగాని భోజనం పసలేదన్నట్లు—భోజనం కన్న కిళ్ళీ, సిగరెట్టే నా కెక్కువ ఆనందమిచ్చేవి!" అన్నారు మంచంమీద కూర్చుంటూ.

మా వారికి ఆయన భావం అర్థం కాక అదేమిటని అడిగారు.

"ఏం చేస్తాను చెప్పండి! మా ఆవిడ చేతి వంట పగవాడికి కూడా వద్దు. అన్నం ఒక పూట ముద్ద అయిందంటే, రెండో పూట గట్టిగా మేకుల్లాగా ఉంటుంది. ఇక కూర విషయమంటారా—వేపుడయితే మాడ్చి పారేస్తుంది. వండే కూరయితే ఉడకనే ఉడకదనుకోండి. ఇలాంటి భోజనమూ భోజనమేనా? కంచం ముందు కూర్చున్నానంటే ఏడుపు వస్తుందనుకోండి."

ఇలా అమాయకంగా ఉన్నదున్నట్లు విశదపర్చి చెప్పారాయన.

మావారికి ప్రకాశరావుమీద ఎక్కడలేని సానుభూతి. ఆయన భార్యమీద ఎంతో తేలిక అభిప్రాయం. వంట చేతకాని ఆడది ఆడదే కాదంటారు.

ఆ తర్వాత ఒకసారి మమ్మల్ని ఎందుకో భోజనానికి పిల్చారు—కారణం సరిగా గుర్తులేదు. ఇద్దరూ వచ్చి మమ్మల్ని దర్శించి పిల్చిపోయారు. మొహంమాటంవల్ల మావారు రానని చెప్పలేకపోయారు. వాళ్ళెళ్ళిన తర్వాత—ఆమెచేతివంట నేను తినలేను. నువ్వు పోనీ నేనెదయినా హోటల్లో ఈ పూటకి భోంచేస్తాను—అనసాగారు మా వారు.

"ఛా! అదేం బాగుంటుంది. వస్తానని మాట ఇస్తిమి. వాళ్ళుచేసిన ప్రయత్నమంతా వృథా అయిపోతుంది" అని నేను ఎంతో నచ్చచెప్ప ప్రయత్నించాను. కాని వారు వినలేదు. హోటలుకని బయల్దేరారు. ఆయనరాకుండా నేనొక్కదాన్ని పోతే ఏం బాగుంటుంది—అని పొయ్యిమీద బియ్యం కడిగిపెట్టి ప్రకాశరావుగారింట్లోకి పోయి—మావారు అర్జంటు పని ఉండి బెజవాడ వెళ్ళారు బస్సులో. ఈ సారి ఎప్పుడయినా ఇద్దరమూ వస్తాము- అని చెప్తే వాళ్ళు నమ్మలేదు. మా తప్పేదయినా ఉంటే క్షమించండి. పొద్దున వస్తామన్న వాళ్ళు ఇప్పుడు వచ్చి రామని చెప్పటంవల్ల ఏదో తప్పు జరిగిందని తెలుస్తున్నది. ఆ తప్పేమిటో చెప్పండి దిద్దుకుంటాం — అని వాళ్ళిద్దరూ ఒకటేగోల.

అపార్థాలకీ, అనుమానాలకీ దారితీసేటట్టున్నదని- ఇంటికి తాళంవేసి వస్తానని చెప్పి- ఇంటోకి వచ్చేసరికి అన్నం ఉడికింది. వారికి అన్నం- కూరా, గిరాకీకుండా ఆవకాయ వేసిపెట్టా - నేను భోజనానికి పోయాను.

కాని ప్రకాశరావు చెప్పినంత ఘోరంగా ఏమీ లేదు వంట. పుట్టగానే నడవలేము గదా!

# మార్పు

ప్రవర్తనలో పూర్తిగామార్పురావాలి. మనల్ని చూచి యింకొకరు హేళనచేసే తీరు నశించేట్టు చేయాలి. నవభారతంలో స్త్రీల కెంతో గౌరవముంది. శ్రీమతి ఇందిరాగాంధి గారిని అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షురాలిగా ఎన్నుకున్నందుకు మన స్త్రీ జాతి కెంతో అలంకారం. శ్రీమతి ఇందిర దేశాన్ని చక్కగా తీర్చిదిద్దుతుందనే భావం పెద్దల్లో కలిగి ఆమెను ఆపదవికి అధిష్టింపజేసినందుకు మనమంతా గర్వించాలి. ప్రతి పౌరుడు, ప్రతిమహిళ ఆమెతో సహకరించి ముందంజ వేయాలి. అందరం నడుం బిగించి దరిద్రదేవతను ఎదుర్కొని పారద్రోలాలి. దరిద్రదేవతయొక్క కర్కశహస్తాలలో యిరుక్కోవడానికి ముఖ్యకారణం...నానాటికి పెరుగుచున్న అధికజనాభా. ఈజనాభా పెరుగుదల తగ్గాలంటే ప్రతిస్త్రీ పురుషుడూ కుటుంబనియంత్రణ అవలంబించాలి. పొదుపు వుద్యమాన్ని పాటించాలి. మనం యివన్నీ పాటిస్తే దేశం చక్కబడుతుంది. కుటుంబ నియంత్రణవల్ల యేవో ప్రమాదాలు సంభవిస్తాయనే పెద్దలమాటలను పెడచెవిని పెట్టాలి. దినదినాభివృద్ధి చెందుతూ దేశం ఎంతో మారిపోతున్నప్పటికి కొందరు సనాతనులలో మాత్రం మార్పు శూన్యంగావుంది.

మనం వారి మాటల్లోని మంచి నిమట్టుకు గ్రహించి చెడ్డనంతా వదలి' ముందంజ వేస్తే, వారి దురాచారాలు, ఆర్భాటాలు కొద్ది రోజులకైనా అడుగంటుతాయి.

ఆచారాలంటే ఓ చిన్న విషయం జ్ఞాపకం వచ్చింది. ఈఆచారాలు ఆడవారిలోనే ఎక్కువగ అమరివుంటాయంటాను. మాయింటి ప్రక్కన ఓయాభైఏళ్ళ వితంతువుండేది. ఆమె ఎప్పుడూ మడీ-మడీ అంటూ తడిగుడ్డ కట్టుకుని వంటయింట్లో మగ్గుతుండేది. కొడుక్కూ, కోడలికీ, చిన్న మనవడికి ఎత్తుకు కూడు వేస్తూండేది. ఓసారి ఆమె మనవడు మాయింటికి వచ్చాడు. అప్పుడు మేంభోంచేస్తున్నాము. భోంచేసేటప్పుడు పసిపిల్లవాడు వస్తే ఎవరైనా వూరుకుంటారా? "రా నాన్నా భోంచేద్దువు" అనేసరికి యేమీఎరుగని ఆపసివాడు దగ్గరకువచ్చి భోంచేశాడు. అందుకని వాళ్ళ అవ్వగారు అబ్బాయిని

**బి. ఇందిరారాజ్**
**(కర్నూలు)**

బయట నిలబెట్టి గుడ్డలువిప్పేసి, సూది కాల్చి నాలుకపై వాతబెట్టి, చన్నీళ్ళు ఓబిందెడు వాడినెత్తిపై కుమ్మరించి, యింట్లోకితీసికెళ్ళి నానాచీవాట్లు పెట్టింది. సూదితో వాత వేయగానే ఆ ఆరేళ్ళ పసిహృదయం అలమటిస్తుండగా—అత్తగారి ఆచారాల్ని ఎదిరించలేక కొడుకును హృదయానికి హత్తుకుని అల్లాడిపోయిందాపిల్లడి తల్లి. అంతటి ఆచారపరాయణురాలి పుత్రరత్నం మాలవాడలో మకాం పెట్టాడు. అతని హృదయాన్ని దోచుకున్న హరిజన రాణి తన భార్యకన్నా అందాలరాశియట. 'ఇదేమిటమ్మా" అని ఎవరైనా ఆ సనాతనురాలి ముఖం ఎదురుగా అడిగితే "ఆఁ వాడుమాత్రం యేంచేస్తాడు. ఆ పెళ్ళానికి ఎప్పుడూ యేదో ఒక జబ్బు. ఆ రోగిష్టిదానిముందు కూర్చుని యేడుస్తాడా!"అంటుంది. కొడుకుని వెనుకేసుకొచ్చి-నిక్షేపంలాంటి కోడల్ని రోగిష్టిదానిలా చేస్తుంది. ఇలాంటి దురాచారాలు ఎప్పుడు అంతమవుతాయో యేమో! ప్రభుత్వంవారు అంటరానితనాన్ని రూపుమాపాలని ఎన్నిశాసనాలుచేసినా, ఎంత పెదశిక్షలు విధిస్తామన్నా ఇలాంటి సనాతనులుమాత్రం భయపడటంలేదు. మనలో బాగా చదువుకున్న వాళ్ళలోకూడ కొందరికి యీ పట్టింపులు లేకపోలేదు.

విధవావివాహాల విషయంలో కూడా ఇంకా పెద్దలలో చెప్పుకోతగ్గ మార్పు రాలేదు. మొగవాడు భార్యవుండగా కూడా నాల్గు పెళ్ళిళ్ళు చేసుకున్నా సంఘం సమ్మతిస్తుందంటారు. కాని స్త్రీకిమాత్రం అది వర్తించదంటారు.

ఇప్పుడు మనదేశంలో విధవావివాహాలు బాగా జరుగుతున్నప్పటికీ - మనస్ఫూర్తిగా అంగీకరించిన పెద్దలు అరుదంటాను. విధవా వివాహం చేసుకున్నామె ముఖం చచ్చిందాకా చూడమని శపథంపట్టిన పెద్దలు కూడా లేకపోలేదు. తుప్పుపట్టిన పాత నియమాల్ని పాటించకుండా, అలాంటిఅమ్మాయి భావిజీవితాన్ని ఆలోచించి, పెద్దవారే వారి చేతులమీదుగ ఇలాంటి విధవా వివాహాల్ని జరిపించితే ఎంతోబాగుంటుందనుకుంటాను. ఈమార్పు పెద్దల్లో వస్తే ఎంతోబాగుంటుంది. ఇప్పటి కాలమాన పరిస్థితుల్ని బట్టి మూఢాచారాలు పాటించే పెద్దలు పూర్తిగా మారాలి. ఈ పెద్దల్లో మార్పు రాగలిగితే దేశం చాలామట్టుకు బాగుపడుతుంది.

* * *

"ఈర్ష్య, ఆడదీ తోబుట్టువు" లని అంటూ వుంటారు. ఈ అపఖ్యాతిని ఈనాటి మనం పోగొట్టాలి. తోటి స్త్రీ కష్టసుఖాల్ని చూచి మన కష్టసుఖాల్లుగా భావించాలి. పొరుగువారికి సాధ్యమైనంత సహాయపడుతుండాలి.

మనం ఈనాడు పురుషులతో సమానంగా బ్రతుకుతున్నాం. వారిలాగే వుద్యోగాలు చేస్తున్నాం, వారిలాగే కష్టసుఖాలనుభవిస్తున్నాం. మన రాజ్యాంగంలో స్త్రీ పురుష భేదాలే లేవు. దేశానికి సేవచేయటంలో గాని—యింట్లో సంసారవిషయంలో గాని స్త్రీ పురుషులకు సమాన బాధ్యతలున్నాయని గుర్తించాలి మనం.

ఈమధ్య రేడియోలో ఒక అమ్మాయి చెప్పింది. "మనంకూడ పురుషులతో సమానంగా ఉద్యోగం చేస్తున్నాం గదా! మనం ఉద్యోగంనుండి సాయంత్రం అలసిపోయి యిల్లు చేరేటప్పటికి భర్త వంటచేసి ఎందుకు పెట్టకూడదూ! ఉద్యోగం చేస్తున్న స్త్రీల భర్తలు ఒకపూట వంటవండాలి" అని. యిది ఏమైనా సబబుగావుందా! స్త్రీ వుద్యోగం చేసినంతమాత్రాన పురుషులు వంటచేయాలని ఎక్కడుంది. పిల్లల్ని కనటం మాచేతకాదు. ఆ పనికూడ పురుషులే చేయాలంటే మరీ బాగుంటుందేమో? వారిలోనే ఔదార్యముకలిగి వారంతట వారే ఓపూట వంటచేస్తామంటే సబబుగా వుంటుందేమో గాని మనం వేలెత్తిచూపుతూ వారిని ఆపని చేయాలని శాసిస్తే వారెన్నటికీ శిరసావహించరు. ఎదురు తిరగటమో-లేదా పేచీలో- తప్ప మనం సాధించేది యేమీవుండదు

ప్రారంభంలోనే పరిపూర్ణత సిద్ధించటం ఎక్కడా సాధ్యంకాదు. అది తెలియక ప్రకాశరావు మావారిముందు తొందరపడి అలాంటి అభిప్రాయం వెలిబుచ్చారు. ఇప్పటికీ మావారికి ఆ వంటమీద సదభిప్రాయం లేదు. వాళ్ళింట్లో కాఫీకూడా త్రాగరు, వాళ్ళు అంటూనే ఉంటారు—మీరు క్షమించారుగాని, మీవారు మాత్రం మమ్మల్ని క్షమించలేదు-అని.

ఇంతకీ నే చెప్పొచ్చేదేమిటంటే ఒకరిలోని చెడును, లేదా తెలివితక్కువతనాన్ని మరొకరు బయటపెట్టటం ఎంతమాత్రమూ మంచిదికాదు. ఒక్క భార్యాభర్తలేకాదు, తండ్రీ కొడుకులు, తల్లీ కూతుళ్ళు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు—ఆ మాటకు వస్తే ప్రతి ఒక్కడూ రెండో వానిని గురించి మూడో మనిషిదగ్గర చెప్పేటప్పుడు మంచిని చెప్పటం మంచిదికాని చెడును, చెప్పటం ఎంతమాత్రమూ మంచిది కాదు. చేతనయితే ఆ రెండో మనిషికే తనలోనితప్పు, లేదా తెలివితక్కువతనం చూపించి సరైనమార్గంలో నడిచేటట్లు ప్రయత్నించాలిగాని మూడో మనిషి దగ్గర చెప్తే ఎవరూ లాభం పొందరు. పైపెచ్చు అపార్థాలూ, మనస్పర్థలూ ప్రారంభమయి జీవితాలు నరకప్రాయంగా తయారవుతాయి. ఇది నాకు ఒక జీవితసత్యంగా తోస్తుంది. ★

# వనితా వాణి



టి. రామలక్ష్మిగారు వ్రాసిన 'మొహమాటం' వ్యాసం చాలా బాగా వుంది. చాలమంది అనవసరముగా మొహమాటమనే వ్యాధికి లోనై అనేక యిబ్బందులో పడుతుంటారు. ఈ విషయాన్ని విపులీకరించి ఆవిడ చాలా బాగా రాశారు. "జీతం రాగానే" అనే వ్యాసంలో విషయం ఏమీ లేదు. కాని ఆవిడగారు వ్రాసినవి జరిగిన అనుభవాలనీ అనిపిస్తూంది.

రాయసం మహాలక్ష్మి, (భీమవరం)

* * *

బోయిన సుశీలగారు వ్రాసిన "జీతం రాగానే" అనే వ్యాసం చాలాబాగున్నది. సుశీలగారు ప్రస్తుతము జరుగుచున్న వివిధ ఉద్యోగస్తుల కుటుంబ పరిస్థితులను అర్థం చేసుకొని చిన్న వ్యాసంగా అన్ని విషయాలను చక్కగ పొందుపరచి వనితాలోకం ద్వారా పఠితలకు అందజేశారు.

టి. రామలక్ష్మిగారు వ్రాసిన 'మొహమాటం' అనే వ్యాసంకూడా బాగున్నది. అందులకు వారికి మా అభివందనములు తెలియజేయుచున్నాము.

జి. సరళాదేవి, రామకృష్ణమ్మ, (నంద్యాల)

* * *

సి. రాధగారు వ్రాసిన "బట్టలెలా ఉతకాలి?" అనేవ్యాసం చాలాబాగా వ్రాశారు. నాకు నచ్చింది.

బేగం జాన్ (కాకినాడ).

* * *

'జీతం రాగానే' అన్న వ్యాసం నాకు బాగా నచ్చింది. వనితాలోకంలో యిటువంటివి మరి కొన్ని తప్పకుండా రాస్తారని నేను భావిస్తున్నాను.

సూర్యప్రకాశరావు (వరంగల్).

* * *

శ్రీమతి సీతామదన్ గారు లావయ్యేమార్గం తెలుపుతే బాగుంటుందని వ్రాశారు. నాకు తెలిసిన సులభమార్గం ఒకటి వ్రాస్తాను. నేనుకూడ వారివలె సన్నముగ వుండేదాన్ని. పేరంటములో ఒక సోదరి నా అవతారాన్ని చూచి సలహా ఇచ్చింది—పాలు, మజ్జిగ, దుంపకూరలు, పప్పు తినగలిగినంత తినమని. తినీ తినడముతోనే చేయికడుగుకొని మంచం మీద వాలి రెండు గంటలకు తక్కువ కాకుండా పరుండాలని—ఈ ప్రక్రియకు మధ్యాహ్నము పండ్లుతినుట, రాత్రి మినుము ఆరగించుట ముఖ్యము. దీనివలన లావయ్యే కోరిక త్వరలోనే నెరవేరగలదు. మూడు మాసములు తిరిగేసరికి ఫలితము కనిపిస్తుంది. నేను ఈసలహా కొంతకాలమునుంచి అమలు పరుస్తున్నాను సోదరి సీతామదన్ గారూ! మీరు మునుపటి వలెనే ఉందురూ. మీకు పుణ్యముంటుంది. కాదంటే ఈ ప్రక్రియ సాధనచేసి వనితావాణి ద్వారా ఫలితం తెలుపుతారు కాదూ! నాకుమట్టుకు మీరు సోదరి భార్గవిగారికిచ్చిన సలహానుఆచరణలో పెట్టాలనిపిస్తోంది.

పార్వతి (నర్సాపురం).

* * *

'అత్తగారూ జపానుయాత్ర' వ్యాసము. చదివినాము. ఆమె ఎప్పుడు అత్తగార్లమీదే వ్రాయుదురేమి. పూర్వకాలం వారికి ఏమి తెలియదని అందరికి తెలుసును!.

క. సీతాలక్ష్మి, (కర్నూలు)

* * *

సన్నబడాలంటే జిహ్వాచాపల్యం తగ్గించాలి. లావుగా వున్నవారు రాచవుసిరికాయలు, దుంపకూరలు, రొట్టెలు తినకూడదు. నెయ్యి, పెరుగు మొదలైనవి బాగా తగ్గించాలి. అన్నింటి కంటె ముఖ్యమైనది తీపి పదార్థములు. చాలమంది పాలు త్రాగుతారు. కాని ఆ పాలల్లో విరివిగా చక్కెర వుపయోగిస్తారు. చక్కెరవల్ల విటమినులు నశించిపోతాయి. చక్కెరవల్ల శరీరం పెరిగిపోతుంది. చక్కెర శరీర నిర్మాణానికి ఏమంత మంచిదికాదు. పాలల్లో చక్కెరలేకుండా త్రాగడం చాల మంచిది. లావుగా వున్నవారు చాకెలెట్లు, బిస్కట్లు, అయిస్‌క్రీమ్, జిలేబీ మొదలగు స్వీట్సు అధికముగా తినుటవల్ల శరీరం పెరుగుతుంది. వీటిని పూర్తిగా వదిలేయాలి. కాఫీ, టీలను యీ స్థూలకాయులు పూర్తిగా విరమించాలి.

ఎస్. వి. లక్ష్మి (తుని).

* * *

సన్నబడాలన్నా, లావెక్కాలన్నా ఒక డైట్ మీద వుండటం మంచిది. అదిలేకుండా ఒక్కసారిగా అన్నం తినటం మానేస్తే ఆరోగ్యం దెబ్బతింటుంది. నెమ్మదిగా తగ్గించుకుంటూ రావాలి.

"తొలిపలుకులు" అన్న రచనలో పని హృదయాన్ని చక్కగా చూపించారు ప్రేమలీలగారు. మంచి సూచనలు చేశారు.

—యం. నాగమణి (ఉరవకొండ)

* * *

"బోయిన సుశీల" గారు రాసిన "జీతం అందగానే" అన్న వ్యాసం చదివేను. బాగుంది.

'జీతం' రాగానే; దానిని సద్వినియోగం చేయడం 'పురుషులే' కాదు కొంతమంది స్త్రీలుకూడ ఆపని చేస్తున్నారు

"ఈరంకి సరస్వతి"—మదరాసు-16

* * *

సినీతార భానుమతిగారు వ్రాసిన "అత్తగారు జపానుయాత్ర" చాలా బాగుంది.

---

చదువుకున్న స్త్రీలు పరస్పరం ఒకర్నిఒకరు గౌరవించుకుంటూ, తమ సంసారాన్ని సుఖమయంచేసుకుంటూ, దేశభాగ్యానికీ లోకకల్యాణానికీ పాటుపడాలి. కాని నాకేమిటి. నా కాళ్ళపై నిలబడి నన్ను నేను పోషించుకుంటూ—యింకొకరిని పోషించగల తాహతు నాకుందికదా—నా భర్తకు నేను అణగి మణగి ఎందుకు పడివుండాలి అనుకోవడం—పొరపాటు. ఎక్కువ చదువులు చదివేది—వుద్యోగాలుచేసేది—సర్వహక్కులు కావాలని పోరాడేది—పురుషుల్ని వంటచేయమనటానికీ పిల్లల్ని పెంచమనటానికీ కాదు. వారికి చేదోడు వాదోడు గావుంటూ ఒక్కడి సంపాదన చాలక ఆర్థికబాధలు పడుచున్న సంసారానికి తోడ్పటానికని ప్రతి స్త్రీ గుర్తించాలి. సంసారజీవితం—స్త్రీ పురుషుల సమానబాధ్యతల్తో నిండివుంటుంది. ఇందులో యే ఒక్కరు లేకపోయినా అంతా శూన్యంగావుంటుంది. ఎన్ని చదువులు చదివినా, ఎన్ని వుద్యోగాలు చేసినా, యింటి సంసారాన్ని దిద్దుకోవటం స్త్రీలధర్మం. ఇంట గెలిచి రచ్చగెలవమన్న పెద్దలసామెత మరువరాదు. ఈనాడు తల్లిదండ్రులు ఆడపిల్లల్ని పెద్దచదువులు చదివించి వుద్యోగాలు చేయుటకు ప్రోత్సాహమిస్తున్నారు. ఇప్పుడిప్పుడే పెద్దల్లో కొంతమార్పువస్తున్నది. మనలోకూడ మార్పురావడం ఎంతయినా అవసరం. ★

[illegible] ప్రతిఒక్కరిని కడుపుబ్బనవ్వించి వేయుంటుంది.

కిషోర్ బేగం [illegible].

* * *

టి. రామలక్ష్మిగారు "మొహమాటం" మీద నిర్మొహమాటంగా చక్కని వ్యాసము వ్రాసినందుకు వారికి సహృదయ పూర్వకఅభినందనాలు తెలియ చేస్తున్నాను.

ఎల్. యజ్ఞనారాయణ (విజయవాడ)

* * *

కోయిన సుశీలగారు జీతంరాగానే అనే వ్యాసం చాలాబాగా ఉదాహరణలతో వ్రాశారు.

వి. కామేశ్వరి (శ్రీకాకుళం)

* * *

మొహమాట పడటము చేతకాని వారు తెలివైనవారు. మొహమాట పడటం మానేసినవారు, అదృష్టవంతులు. కొన్ని విషయములలో మాత్రము మొహమాట పడేవారు, అనాగరికులు. అన్ని విషయములలో మొహమాటపడేవారు, ఎప్పుడూ బాధపడే దీర్ఘరోగులు అన్న నాల్గు వాక్యములలోనే "మొహమాటం" ను చక్కగా నిర్వచించారు. యిందుకు టి. రామలక్ష్మిగారు అభినందనీయులు.

"రాధి" నాగార్జున సాగర్ డాం.

* * *

ఓ సైనికుడు అలెగ్జాండర్ కు ఓ రాజకీయ పత్రాన్ని అందజేయడానికి వస్తూ మధ్యలో తన గుర్రాన్ని పోగొట్టుకున్నాడు! ఎలాగో తంటాలుపడి అలెగ్జాండర్ ను చేరుకొని తాను తెచ్చిన పత్రాన్ని అందించాడు. మళ్ళీ తిరిగి వెళ్ళడానికి గుర్రం లేదు. అది గ్రహించిన అలెగ్జాండర్ "నా గుర్రం మీద ఎక్కి వెళ్ళాలనుకుంటే వెళ్ళు" అని అన్నాట్ట. కాని ఆ సైనికుడు మొహమాట పడి "నడిచే వెళ్తానండి. ఫరవాలేదు" అని అన్నాట్ట. అప్పుడు అలెగ్జాండర్ "నీలాంటి మొహమాట పరులుండడంవల్లే నేను ప్రపంచాన్ని జయించలేకపోయాను" అన్నాడట.

అందులో సందేహం లేదు. ఇలా మొహమాటంవల్ల చాలామంది ఎన్నో బాధలకు గురవుతున్నారు.

పెళ్ళి చేసుకోవడానికి మొహమాటపడే వారూ, పెళ్లాంతో మాట్లాడడానికి మొహమాట పడేవారూ; ఆహ్వానాలకూ, పార్టీలకూ వెళ్ళడానికీ, ఉపన్యాసాలివ్వడానికీ, నిజాలను ధైర్యంగా చెప్పడానికీ మొహమాట పడేవాళ్ళున్నారు. నిజానికి వాళ్ళలో శక్తి సామర్థ్యాలు లేక కాదు మొహమాటం వాళ్లని నిర్వీర్యులుగా, నిర్బలులుగా చేస్తుంది.

మొహమాటం గురించి టి. రామలక్ష్మి గారు వ్రాసిన వ్యాసం విపులంగా లేక పోయినా ఉన్నంతవరకూ సాఫీగానే [illegible] హాస్యంగా నడిచి వెళ్ళింది.

యం. ఆర్. శర్మ, ([illegible])

* * *

# వంటలు

## కంద ఊరగాయ

మనము అన్ని ఊరగాయలు పెట్టుకున్నట్లే ఇది పెట్టుకోవచ్చు. కావలసినవి: 2 వీశెల కంద. 1 శేరు ఉప్పు, చింతపండు 3 పావుశేర్లు. తగినంత పసుపు.

పెట్టేవిధానం: ముందర కంద అంతా కడిగి పెచ్చు తీసివేయాలి. కొందరు అట్టిప్పంతోను, చిప్పలతోను తీస్తారు. మేము కత్తిపీటతోనే తీస్తాము. కంద పెచ్చు తీసి ముక్కలుగా కోసి తొక్కుతూ చింతపండు, ఉప్పు, పసుపు వేయాలి. అంతా మనము చింతకాయపచ్చడి పెట్టుకున్నట్లే. ఇది అంతా పరిశుభ్రముగా పెట్టుకోవాలి. రోలు రోకలి, కందఅంతా శుభ్రముగా కడుక్కోవాలి. కంద పెచ్చు తీసిన తరువాత కోయాలి. వారంరోజులున్న తరువాత మరల తొక్కవలెను. మిరపకాయలు పోపు పామాను వేసి నూరుకుంటే చాలా బాగుంటుంది.

## కుంకుడుకాయల పొదుపు

పదిమందివున్నచోట్ల ఇది బాగా పని చేస్తుంది. గిద్దెడు కుంకుడుకాయలలో బాగా మందారఆకులు బాగా నూరి వేసి కుంకుడు కాయలుకూడా వేసి తొక్కితే, ఏడెనిమిది మంది పోసుకోవచ్చు తలకు.

ఎస్. పార్వతిప్రసాద్ (నెల్లూరు).

* * *

## రోజ్ మిల్క్

వేసవికాలంలో చల్లని పానీయాలంటే అందరికి ఇష్టమే. ఈ పానీయాల్లో "రోజ్ మిల్క్" ఒకటి. ఇది తయారుచేయువిధము.

కావలసినవి: ఒక గ్లాసు చిక్కనిపాలు, చక్కెర, ఏలకులు రెండు, రోజ్ ఎసెన్సు, రోజారంగు పొడి. చల్లని కూజానీరు ఒక గ్లాసు (లేక) ఐస్.

మొదట పాలలోకి, సరిపడినంత చక్కెర వేసి బాగా చల్లార్చాలి. "ఐస్" అన్ని వూళ్లలో దొరకదు. అందుచేత ఒక గ్లాసు చల్లని నీరు వేసి బాగా తిరగ బొయ్యాలి. రెండు ఏలకులు మెత్తగా నూరి పాలల్లో కలపాలి. ఒక చిటికెడు "రోజారంగుపొడి" కరోజ్ ఎసెన్సు" రెండు మూడు చుక్కలు వెయ్యాలి. మొత్తానికి చల్లని నీటికంటె ఐస్ వేస్తే బాగుంటుంది.

యం. రాగమణి, (ఉరవకొండ)



# ★ సంపూర్ణంకాని సంబరం ★

(18 వ పేజీ తరువాయి)

పొందిన అలవాటుచొప్పున రథంపైనిల్చుని (కర్ర) గదలతో కలియబడుతున్నారు తోలాటంపంథాలో ధృతరాష్ట్రి, పాండు తనయులు.

"చూశారా, మరిశా ప్రతాపం...ఎట్లా తయారు చేశానో వీళ్ళని" గర్వంగా అన్నాడు హరిదాసు, తిట్లులు తినడంలో భార్గవ ప్రతాపమెరిగిన అధ్యక్షునితో.

"కన్నయ్యగారూ! చూశారా! అఁ అఁ! గణికలు - అబ్బ ఏం అందం, ఏం చందం. అహా!" భూమికి ఆరంగుళాలు పైకి తేలి పోయాడు దాసు.

"కనిక లేమిటోయ్ దాసూ! ఏవి?"

"కనికలు కాదండీ! కన్నెపిల్లలు వేశ్యాంగనలు. అరుగోనండీ" "డెందమునకు వాక్కునకందరాని యధికతరమైన యానందమును భవించెద" అన్నట్లున్నాడు హరిదాసు.

"భోగంపిల్లలటోయ్! వీళ్లూ ఉన్నారు!!" గుటకలు మ్రింగాడు, అధ్యక్షుడు, తోలుబొమ్మల్లో జుత్తుపోలిగాడిలా - తైతక్కలాడుతూ వచ్చారు వారకాంతలు. ప్రెసిడెంటుగారి ఆజ్ఞాపత్రం పుచ్చుకొని - 'సరిగా నాట్యంచేయ'మని హెచ్చరించాడు దాసు.

వడివడిగా పరుగులెత్తి -చిందులుత్రొక్కి గంతులేసే లేడిపిల్లలా - తోకలేని గాలిపటాల్లా - నేలపడి పది గజాలపైకెగిరిన బంతుల్లాగ డాన్సు చేస్తున్నారు.

"మ్రోయింపకోయ్ మురళి - మ్రోయింపకోయ్ కృష్ణ" కృష్ణశాస్త్రిగారి గీతాన్ని అలాపిస్తున్నారు. పాటపాడే తీరును పరికిస్తే - సంగీతమురాని దద్దమ్మలని తేలిపోయింది. నాట్యపద్ధతిని పరిశీలిస్తే - భరతశాస్త్రభ్రష్టలని నిర్ధారణవుతుంది.

పట్నంవెళ్ళి చదువుకొని వచ్చిన ప్రెసిడెంటుగారి పదేళ్ళ పుత్రుడు - భోగం వాళ్ళను జూచి, ఏదో రికార్డులో అన్నట్లు "స్త్రీలింగమేనా నాన్నగారూ - వీళ్ళు" అన్నాడు తండ్రి చేతినిపట్టి లాగుతూ.

"నాకేం తెలుసురా-ఏ లింగమైతే ఏం? ఏదోలింగం లెద్దూ" తడబడుతు - పరాకుగా జవాబిచ్చాడు తండ్రి.

"ఏమే! భోగంపిల్లలూ! అలా వేళ్ళు పాతుకపోయినట్లు నిల్చుండి పోయారేమే! ఊఁ బదండిక" మూడోవీధిలో యిల్లున్న కరణంగారు గద్దించాడు. తన యింటిముందు తనివి తీరా సినిమా డాన్సులు చేయించుకుందామని...అధ్యక్షుడుగారి కళ్లు చింత నిప్పులయ్యాయి. ఇదిచూచిన కరణం ఒకడుగు వెనక్కేశాడు.

స్టార్టుకాని కారును నలుగురు కలిసితోసినట్టు - రుదకు వెళ్ళలు ముందుకెళ్లారు.

"పరశురామావతార మదిగోనండీ! చూశారా ఆ రాజఠీవి" హరిదాసు పరిచయవాక్యాలు-కన్నయ్యగారి చెవికి సోకలేదు.

సర్వక్షత్రియ నాశకుడైన - పరశురాముడు, ధ్వజస్తంభంలా నిల్చుని - వామహస్తాన్ని రైల్వేసిగ్నలులా చాచి-తన కాళ్ళచెంత చతికిలపడిన తల్లి కేశపాశములను పట్టుకున్నాడు. దక్షిణహస్తములోని గండ్రగొడ్డలి (అట్టది) ఎలక్షన్ టైములో ఊరేగే సన్నివేశంలో పట్టుకున్న పార్టీజెండాలా పట్టుకున్నాడు.

తల్లి తల త్రుంచేయమన్న తండ్రి ఆజ్ఞను తనయుడు భార్గవుడు నెరవేర్చుఘట్టమది. చూచే ప్రజలు 'ఏమిటో' అనుకొంటూ-అదోలా చూచారు, వయసులోఉన్న అమ్మాయిల్ని చూచే వయస్సుమళ్లిన ముసలమ్మల్లా.

"ఓఁ మ్మాయ్! చూడే! ఆ వేషంలో బాబు ఎంతబాగుండో" రెండు వారాల్నుంచి స్త్రీలా ఎలా వ్యవహరించాలో యింట్లో 'అమ్మ' చేత "ట్రైనప్" అయిన తండ్రిని జూచి-పిల్లాడు మురిసిపోతూ అన్నాడు.

"బాబోయ్" పిలిచాడు, పరశురామునికి తల్లిగావున్న తన తండ్రినిజూచి, తనయుని వేపు తల త్రిప్పాడు తండ్రి. "ఐస్ ప్రంట్" అన్న తక్షణం తల త్రిప్పిన సైనికునిలా.

"ఇదుగో-మిమ్మల్నే. ఆడంగివయినా బాగుండేది. ఎంత అందంగావున్నారు. నాకంటె ఎక్కువ సంతానం కందురేమో!" యింటావిడ ఛలోక్తి విసిరింది.

'హి హి హి...' కపిలా నోరువిప్పి నవ్వాడా ప్రభువుడు.

"ఒరిసింగన్నా! సిగవూడిపోతుంది రా. నిత్తెం చూచే వెళ్ళాంలే లేరా!-అఁ-అఁ-జాయిగా తిప్పెనితల. గంగిరెద్దులా తిప్పతావేంటి? తలూడిపోద్ది" పరశురాముడన్నాడు తల్లి రేణుకాదేవితో.

"అబ్బ, ఏ పైసికాకిగోల...! చేరెందు కొనిఏసం. నాయింటేది కూడాలనేనా' అని సినిమాపంతులా తల ఆడించాడు, ఇంకేముంది తగిలించినకొప్పు ఊడి క్రాపింగు బైటపడింది. చూచినవారందరు గొల్లుమన్నారు.

"దాసూ! రామాయణంలో రాచ్చసులు మళ్లే వున్నారే వీళ్లు" యింట్లోంచి భార్య రావడం చూచి-కన్నయ్య-మహా అగ్ని తెలిసినోడిలా అన్నాడు. దాసు లోలోనే నవ్వుకున్నాడు.

"పులేసాలు కూడా వేయించావటోయ్ దాసూ!" అధ్యక్షుని అర్ధాంగి అనుమానము బైటపెట్టింది.

"కాదండమ్మ. వాళ్ళు కోయోళ్లు. అడవుల్లో వుంటారులెండి. జంతువుల్ని వాటినీ తింటారు" అని ఊరుకున్నాడు హరిదాసు.

పెద్దపులుల్లా, చిరుతపులుల్లా అలంకరించుకున్న కోయవాండ్రు పరశురాముని రథం వెనుక గంతుతున్నారు. అంగుళం మందంగల పూసలదండలు-విమానాశ్రయంలో దిగిన మంత్రికి వేసే పూలమాలల్లా దొంతరగా ధరించారు. శరీరంనిండా జేగురురంగు పులుముకున్నారు. తలకు కట్టుకున్న ఈకలు చెలువుచెంత చేపలకై పొంచివున్న కొంగ మెడలవలె వ్రేలాడుతున్నాయి. టక్కుపెట్టెల్లా-కోడిపుంజుల్లా-గద్దల్లా-గుడ్లగూబల్లా-అంబోతురంకెల్లా, కేకలతో--రొప్పుతూ ఒకపద్ధతి అంటూ లేకుండా గంతుతున్నారు.

"అదుగోండి. మన ప్రాణాల్ని తీసే యమధర్మరాజుగారు. ఆఖరేసం యిది" హరిదాసు పరిచయవాక్యాలు పలికి ఊరుకున్నాడు. కన్నయ్య ఎందుకనో- భయపడ్డాడు. తన ప్రాణము తనది కాకుండ పోతుందనే భయం వేసిందేమో!

పంజావిప్పి ఎదుటి కురికే కేసరిలా-ప్రత్యాలీఢంలో ఉన్న యోధుడిలా ఉన్న దున్నపోతుమీద-ఎలక్షన్‌లో విజయంచేపట్టి కారెక్కి ఊరేగే అభ్యర్థిలా- యమధర్మరాజుగారు కూర్చునివున్నారు. తన ఉపన్యాసమువిన్న వలుగు లేమనుకుంటున్నారో అని నలువైపుల చూచే ఉపన్యాసకునిలా-తనచుట్టూ ఉన్న జనం వేపు-అరుగుల పైనుండి ఎగిరెగిరి చూచే ఆడంగుల వేపు- సగర్వంగా-గడియారం ముల్లులా తిరిగి చూస్తున్నాడు, యమధర్మ వేషధారి పోజ్మ్రలాయుడు.

ఆ సంబరంతోపాటు జనంకూడా పోతున్నారు. అధ్యక్షుడిలో సంతృప్తి తాండవించింది. "దాసూ! చక్కగ ఏసాలేయించావోయ్. చాల కష్టపడ్డట్టున్నావు' అధ్యక్షుడు ప్రశంసా పత్రమును బహూకరించినట్లయింది, ఆ మాటలు వినగానే దాసుకు.

బ్యాండు కరణంగారింటిముందు కొచ్చేసరికి సూర్యుడు గంట పన్నెండు చూపుతున్నా .

"ఏంవోయ్ దాసూ! నేనదనంగా యిచ్చిన సొమ్ముకు బాంబులు పేలుస్తానన్నావుగా" జ్ఞప్తిచేశాడు కరణంగారు.

"ఇక్కడైతే గుడ్డాలు చెగురుతాయి. కరణంగారి పొలంలో పేల్చండోయ్" హరిదాసు సవరణచేశాడు.

కరణంగారింటి వెనుక ఉన్న పంట పొలాల్లో పేల్చారు వరుసగా ఓపది. ఆ ప్రక్కనే తీరుబడిగా ఉన్న 'గేదెలు' ఆ భయంకర శబ్దం విని 'ఏదో కొంపమునిగింది-యింకేమున్న' దన్నట్లు ప్రక్క సందులోబడి, కరణంగారి వీధిలోకొచ్చి, సంబరానికి ఎదురుగా వచ్చేస్తున్నయ్.

ఇంకేముంది- గోదావరీ ఉద్ధృతానికి-ఆహ్వానించి త్రోవయిచ్చేసిన మట్టిగట్టుల్లా-ప్రారంభోత్సవ సమయంలో మంత్రిగారు 'కట్' చేసిన రిబ్బనులా- ఎదురుగుండా కొల్ల దూరంనుంచి రమ్మా వారి వాకిట్లు

స్పీడుతో వస్తున్న గేదెలనుజూచి ప్యాండు వాళ్ళు చెరొక ప్రక్కకు వత్తిగిల్లారు.

అంకమునందు తొలగించే 'కర్టెన్'లా ప్యాండువాళ్ళు తప్పుకోగా- రంగస్థలంపై ఉన్న నటుడొక్క ప్రేక్షకుల్ని మాచే నదవకాశము లభించినట్లు- రామబాణాల్లా దూసుకొచ్చేస్తున్న గేదెలను అశ్వారూఢులైన కౌరవులుజూచి- గాలి విసురుకు గడ్డిమేటుల్లా పడి- కళ్లు చెమ్మగిల్లి- స్పృహతప్పి పడిపోయారు.

తోడేలును జూచిన గొర్రెల గుంపులా- రమారమి వందగుర్రాలు చెల్లా చెదరయిపోయాయి. రెప్పపాటులో జరిగిపోయిందిదంతా.

మళ్ళీ కొన్ని ఓట్లు పేల్చారు. ఇక్కడ జరిగేది, ఆ పేల్చేవారికి కనిపించదుగా! ఎదుటి గందరగోళం చూచి—వెనుకనుంచి వస్తున్న మందుగుండు ప్రేలుడు శబ్దానికి— మరీ జడిసిపోయి, 'వెనుదిరిగి పోవటం వీరోచితలక్షణం కాదని' అనుకొన్నవి కాబోలు—సంబరం వేసే పరుగు లంఘించాయా గేదెలు—అరేబియా గుర్రాల్లా.

"ఏం గున్నయ్యా! ఎవరైనా గేదెల పందాలేశారట్రా!?" చావిట్లోకి గంతేసి అన్నాడు కరణం. "నిజమే నేమో బాబయ్యా!" శ్రుతి కలిపాడు పాలేరు. హరిదాసు—హాయముల హంగామా చూచి 'హర హర' అంటూ పరుగు తీశాడు, పంచెదీసి- యజ్ఞశాలలో ప్రవేశించిన ప్రమథ గణాల్ని చూచిన దక్షప్రజాపతిలా.

వెనుక ఉన్న రథాలు (బండ్లు) చుక్కాని లేనిపడవల్లా సుళ్ళు తిరిగాయి.

"చచ్చాము బాబోయ్" అంటూ వేసవిలో బీటలు వేసిన పంట పొలాల్లా నోళ్ళు తెఱచి—అరిచారు, వేషధారులు. శ్వాస గతిన్ని కుప్పలా కూలి పోయారు నటకులు.

కెవ్వుమన్నారు బాలయాండ్రు. నత్తగుల్లలా ముడిచుకు పోయారు. కొందరు తొలి బహుమానము పొందుదామని పరుగు పందెంలో పరుగిడే మగరాయుళ్ల మాదిరి తలోకవైపు దౌడు తీశారు. ఇది తరుణమన్నట్లు—రసికులు కొందరు సాగుతున్న ఉద్యమానికి మధ్య దాపురించిన అభివృద్ధి నిరోధక శక్తుల్లా వాళ్ళను ఢీ కొంటున్నారు. కోయవాండ్రు తరియ్ మయ్ మంటు కాకుల్లా ఎగిరిపోయారు.

సంబరాన్ని చీల్చి దూసుకొచ్చే తన సహచరులను, మహిషము శాంతంగా చూచింది. "తప్పుకండి! నేనూ వస్తున్నా" అన్నట్లు ఒక్క దూకు దూకింది. ఆ ఊపుతో—మన యనుడు—కుమార సంభవములోని, యముడువలె—ఆ దున్నపోతు మీద వ్రేలాడుతున్నాడు.

ఇక...సంబరాన్ని సంబరపడుతూ చూచే ప్రజలు భయంతో—తామరాకుపైనపడ్డ నీటి బొట్లలా వారి కండ్లు అల్లలాడి స్థానభ్రంశం పొంది—కంటి గ్రుడ్లు రాలిపడి పోతున్నాయేమో! అనిపించింది. వాళ్ళ ప్రాణాలు పై పైనే గాలిలో షికారుకు బయలుదేరుతున్నాయేమో! అన్నట్లు స్ఫురించింది. ప్రజలు యిళ్లకి దారితీశారు.

పల్లెప్రజల ఆర్తనాదములు మిన్నంటాయి. మిన్నంటిన శబ్దాల్లో—హరిదాసును దూషించిన వాక్యాలు. శపించిన శాపన శబ్దాలు—నిఘంటువుల్లో కనిపించని 'తిట్లు' పదాలు—ఆడిపోసుకున్న వికృతపు మాటలు—"హరిదాసు ఎంత పని చేశాడ"ని అపార్థం చేసుకున్న పదప్రయోగాలు, కొన్ని...హరిదాసును వెక్కిరిస్తున్నట్లు ప్రతిధ్వనించాయి.



# అత్తాకోడళ్ళ పోరు

(13-వ పేజీ తరువాయి)

దద్దమ్మలా వున్నాడు. పెళ్లాన్ని అంతలా కరివేపాకు వేపినట్టు వేపుకుతింటూంటే కన్నతల్లిని కొంతంతయినా గదమాయించడే!—అయినా యింతకూ ఆ చేతగాని చవట సన్నాసిమాకలేస్తే మాత్రం ఓపట్టాన ఆ భూతం వింటుంది గనకా!—వాడేవయినా తప్పి జారి చెప్పేందుకు వెళ్లాడే అనుకోండి. వాణ్ని కూడా రెండా—పెడా వాయిగంటించి ఓ మూలని కట్టి పడేస్తుంది.

కానీ మనసులో వున్నదేదో మర్మం లేకుండా చెప్పెయ్యాలిగా మరి!—పాపం ఆ యింటి కోడలిపైనీ—ఆమె తాలూకు చేతగాని మొగుడిపైనీ నాకెందుకో మహా జాలీ—దయా పుట్టుకొచ్చింది. ఆ కోడలి వంటి మహాలక్ష్మిదేవి యీ కాలంలో యే మాటికో—కోటికో యొక్కడో వుంటుంది. పొద్దుట లేచింది లగాయితు రాత్రి కన్నుమూసేవరకూ యెన్ని తిట్లూ—యెన్ని చీవాట్లూ!—ఆహా హా—అంతయినా ఆ అమ్మాయి పాపం కిక్కురుమనదుగదా! అంత ఓర్పూ- అంతశాంతం ఈ రోజుల్లో వయసులోవున్న యే అమ్మాయి కుంటుంది చెప్పండి. తనేమిటో - తన పనిపాట్లేమిటో, అంతే!- పైపెచ్చు అంత గయ్యాళి అత్తగారికి తనే ముద్దకూడు తినిపిస్తుందంటే నమ్మండి. ఆవిడకి అడ్డమైన చాకిరీ చేస్తుంది. ఆహా! అలాటి ఆడకూతురి మొహం చూస్తే చాలు. పుట్టెడు పుణ్యం మూటగట్టుకోవచ్చు. జన్మతరించిపోతుంది."

శరత్ బాబు యీ వెర్రిబాగుల కోడలికథ చెబుతూ చెబుతూ ఆ గుంపులో అత్తా-కోడళ్ళ తాలూకు అవతారాలెలా మారుతున్నాయో ఓ కంట కనిపెడ్తూనే వున్నాడు. అత్తలంతా ఆముదం తాగిన మొహాలు పెట్టుకుని ఆయన వేపు మింగేస్తామన్నట్టు మహా వుక్రోషంగా చూస్తున్నారు. కోడళ్ళంతా కొత్తెక్కి మొహాలు చేటలంతేసి చేసుకుని, అత్తల్ని పెఱుగు జాడినట్టు జాడిద్దామా అన్నంత గట్టాగా చూస్తున్నారు.

శరత్ బాబు మళ్ళా కథ మొదలెట్టాడు,— "ఆమట్లున ఓహానా యేమయిందీ మందువాలో నేనటూ యిటూ పచార్లు చేస్తున్నా. అదే సమయానికల్లా పొరుగింటి అత్తగారు తిట్లద స్వరాలు తిరగేసి చెవులు గొల్లుమనిపిస్తోంది. 'అయ్యో - నీ పెత్తనం బండలు కాను - నీ బడాయి తంపవెయ్య నీ మొహం యీడ్చా-నా కొడుకుని లోబర్చుకున్న వంగనాచీ" అంటూ ఏకబిగిని ఒకటే రావణాగోల! - ఆవేళ వాళ్ళం బాగాలేదు. పొద్దుట లేవగానే రాట్నం కాస్త వొడికాను.

పాపం ఆ అమాయకురాలిపైని మళ్ళా పిడుగులవర్షం పడటంతో ఆవేళ యేదలా వున్నా ఆ గందరగోళమేమిటో స్వయంగా కళ్లారా చూడాలనివుబలాటపడ్డాను. అందుకని పక్కనున్న ప్రహరీగోడవారకెళ్ళి కొన్ని యిటుకల్ని ఒకదానిపై నింకొకటి పేర్చి నింపాదిగా దానిపైకెక్కి నిలబడ్డాను. అలానుంచుని ఆ యింటివేపు మొహం పెట్టి చూద్దునుగదా!- ఒక్కసారే భూమీ-ఆకాశం గిర్రున తిరిగిపోతున్నట్టనిపించింది. కళ్లు చీకట్లు కమ్మాయి. కాళ్ళు పట్టు తప్పిపోయాయి. అంతవరకూ నేననుకుంటున్నవన్నీ గాలి బుడగల్లా పై కెగిరిపోయాయి. నా తలంపులన్నీ తలకిందులై పోయాయి.

ఇంతకూ ఆ యింట్లో యేం చూశానను కున్నారు!- అప్పటికింకా ఆ యింట్లో ఇంకెవ్వరూ లేవలేదు. వాకిట్లో అత్తా కోడళ్లు మాత్రం అవుపించారు. కోడలేమో పల్లెత్తు మాటకూడా అనడంలేదు. కాని మధ్యమధ్య ఆమె అత్తవేపు చీపురు ఝాడిస్తూ వోళ్ళు చీరేస్తా నన్నట్టు గ్రుడ్లురుముతూ చూస్తోంది. "జాగర్త, కబడార్" అంటున్నట్టు సైగలతో దాబులు కొడ్తోంది. ఆమె యెంత అణకువగలిగిన అమ్మాయను కున్నానో-అంత రాకాసిపిల్లను కునే చేష్టలన్నీ చేస్తోందంటే నమ్మండి. ఒక్కోసారి కిక్కురుమనకుండానే అత్తపైని అపాదమస్తకం చీపురుకట్టతో వడ్డిస్తోంది కూడాను.- ఇహ ఆమెగారి అదిరింపులూ-బెదిరింపులూ చెప్పడాని కలవిగాదంటే నమ్మండి. పాపం సిగ్గుపడి కుమిలిపోతున్న ఆ అత్తగారు వుండుండి వుండబట్టలేక ఒక్కసారి కోడల్ని గబగబా తిటేస్తోంది."—

శరత్ చంద్రుడి కథ కొసా పూర్తయింది. అంతవరకూ గోజాపువ్వుల్లా కిలకిల మని నవ్వుతూన్న కోడళ్ళ మొహాలన్నీ దీంతో వెలవెలమని కొయ్యబారి పోయాయి. రాచిప్ప మొహాలు పెట్టుకున్న అత్తలంతా ఆనందంతో పకపకలూ, వికవికలూ ప్రారంభించారు.



## బాల సాహితి

# గుఱ్ఱపు నాడా

సి. నాగభూషణరావు

పూర్వం ఒక ఊళ్లో చెంగయ్య అనే ధనవంతుడైన వర్తకు డుండేవాడు. అతడు చాలా లోభి. ఎవరికీ ఒక్కకానీ ఇవ్వడు. అంత ప్రాణాంతకమని తోస్తేనే తప్ప ఏ ఖర్చూ చేసేవాడు కాడు. సంపాదించిన ధనమంతా వడ్డీవ్యాపారాల లోనూ, నగల వ్యాపారంలోను తిప్పుతూ యుక్తిగా లాభాలు సంపాదిస్తూ ఉంటాడు.

చెంగయ్యగారి పెరట్లో పశువుల తోపాటు ఒక గుఱ్ఱంకూడా ఉండేది. ఏదేనా ఊరు వెళ్లవలసి వస్తే ఆ గుఱ్ఱం మీద వెళ్లేవాడు చెంగయ్య. అంచేత దాన్ని మాత్రం కొంత పుష్టిగానే పెంచుతూ వచ్చేడు.

ఒకనాడు చెంగయ్య ముప్ఫయి క్రోసుల దూరంలోఉన్న సిరిపుర మనే ఊరు వెళ్లవలసి వచ్చింది. డబ్బు బాకీఉన్నవాళ్లు ఆ నాటికి రమ్మని చెప్పేరు. చెంగయ్య ప్రొద్దున్నే లేచి కాలకృత్యాలు తీర్చుకొని గుఱ్ఱంమీద బయలుదేరేడు.

సిరిపురం వెళ్లి అక్కడ పన్లు చాలుగా చక్కబెట్టుకు బయలుదేర బోయేసరికి మధ్యాహ్నం రెండు గంటలు కావచ్చింది. చెంగయ్య ఒక సత్రందగ్గర ఆగి కాసిన్ని నీళ్లు త్రాగి, అక్కడున్న కుఱ్ఱాడితో తన గుఱ్ఱానికి నీళ్లు పట్టించమని చెప్పేడు. వాడు గుఱ్ఱాన్ని తనతో తీసుకు వెళ్లేడు.

చెంగయ్య వసూలైన డబ్బంతా మరోసారి లెక్కచూచుకొని, సంచీ జాగ్రత్తగా అంగీలో దాచుకున్నాడు. అంతలో ఆ కుఱ్ఱాడు గుఱ్ఱానికి నీళ్లుపట్టి తీసుకువచ్చేడు. చెంగయ్య వాడిచేతిలో ఒక అణా వడేసి, 'మరి వెళ్లు' అన్నాడు.

"బాబూ, ఈ గుఱ్ఱం కాలి నాడాకు ఒక మేకు ఊడిపోయింది." అన్నాడు ఆ కుఱ్ఱాడు, "వెయ్యమంటే ఒక చిటికెలో వేసేస్తాను."

'ఇప్పుడింకో బేడో పావలో తెమ్మంటాడు కాబోలును రా బాబూ' అనుకుని చెంగయ్య "పర్వా లేదులే; ఒక్కమేకు పోతే ఏమయింది." అంటూ గుఱ్ఱంమీదికెక్కి బయలుదేరేడు.

అలా కొంతదూరం వెళ్లి చెంగయ్య గుఱ్ఱందిగి ప్రక్కనున్న చెట్టునీడలో ఒక క్షణం విశ్రాంతి కోసం కూర్చున్నాడు. అంతలో గుఱ్ఱపునాడాలు కొట్టేవాడు ఒకడు ఆ త్రోవంట వచ్చేడు. వాడు చెంగయ్య గుఱ్ఱాన్ని చూసి "బాబూ నాళ్లు వేయిస్తారా?" అంటూ గుఱ్ఱం కాళ్లు పట్టి డెక్కలు తనిఖీ మొదలెట్టేడు.

"ఏ నాళ్లూ ఒద్దు, వెళ్లవయ్యా" అన్నాడు చెంగయ్య చిరాగ్గా.

(48-వ పేజీ చూడండి)

## పువ్వుల బాలలు

పువ్వుల బాలలు
నవ్వుతు వచ్చే
రెవ్వరి కోసమురా?
కిలకిల నవ్వే
బాలబుగ్గలా
పాపకోసమేరా!

నీలపు మబ్బుల
మాలలు నేలకు
ఏల వచ్చినవిరా?
కన్నుల, నీలపు
మిన్నులు మెరిసే
చిన్నపాప కయిరా!

రంగుల రంగుల
బంగరు అంచుల
పావడ ఎవరికిరా?
చెంగున ఎగురుతు
దొంగాటాడే
బంగరు పాపకురా!

కోకిల లాడే
చిలకలన్ని ఏ
బాల కోసమయిరా?
పలుకుల ముత్యా
లొలకబోయు మన
పాపకోసమయిరా!

ఏ. నారాయణరావు

# విమానాల కథ

పి. దక్షిణామూర్తి

(గతవారం తరువాయి)

ఒక సీసాని తూచి చూచి బరువెంతో రాసుకుని, తరవాత దాన్ని వేడిచేసి తూస్తే బరువు తగ్గినట్లు తెలుస్తుంది. వేడి చెయ్యగానే సీసాలో గాలి వేయించిన అటుకులలా ఉబ్బిపోయి, చోటుచాలక బయిటికి పోయిందన్నమాట. మిగిలిన కాస్త గాలీ, చుట్టూ ఉన్న దానికన్న తేలికగదా. అంచేత అది తేలిపోవాలని చూస్తుంది. సీసాలో ఉందికాబట్టి, దాన్నికూడా ఎత్తలేక ఊరుకుంటుందనుకో.

నీళ్ళలో రాయి పడేస్తే, బుడుంగున మునిగిపోతుంది. చెక్కముక్క వేస్తే పైకి తేలిపోతుంది. ఎంచేతఅంటే దానికి చాలా కథ ఉందనుకో. నీటికన్న బరువు కాబట్టి రాయి మునిగిందనీ, తేలిక కాబట్టి చెక్క తేలిందనీ చెప్పుకుంటే చాలు. మీ తమ్ముణ్ణి నాన్నగారు ఇట్టే ఎత్తుకుంటారు. ఎగరేసి ఆడిస్తారు. మరి మీ తమ్ముడు మీ నాన్నగారిని అలా ఎత్తుకు ఎగరెయ్యగలడా?

గాలికూడా అంతే. తనకన్న తేలికైనది ఉంటే పైకి ఎత్తేస్తుంది. అయితే ఇంకో గుణం ఉంది. బరువైనదీ బలమైనదీ అడ్డునిలబడితే మనకెందుకని తప్పుకుపోదు. దాన్ని గట్టిగా తోసేస్తుంది. ఈ గుట్టు కనిపెట్టే గోదావరిమీదా, ఇంకా కాలవలమీదా పడవలవాళ్ళు తెడ్లు వెయ్యడం మానేసి తెరచాపలు ఎత్తుతున్నారు చాలా రోజుల్నించి.

170 ఏళ్ళ క్రితం రెక్కలు తగిలించుకుని గబ్బిలంలా ఎగరబోయినవాళ్ళంతా దబుకూ దబుకూ కిందపడడం చూసి, ఇద్దరు ఫ్రెంచి వాళ్ళు ప్లేటు తిరగేసి కొత్త పద్ధతి ఆలోచించారు. మనం ఎగరడం సంగతి దేవుడెరుగును, ముందర మనం ఎగరేసేదేమైనా పైకి పోతుందా అని ఆలోచించారు. గాలికన్న తేలికైనది తేలిపోతుంది అని తెలుసుగా, అందుకని వాళ్ళు కాగితంతో ఒక పెద్ద బుట్ట తయారుచేశారు. ఈ బొమ్మ చూడు అదెంత పెద్దదో తెలుస్తుంది. ఆ బుట్టని తిరగేసి కాస్త ఎత్తున కట్టారు. కప్పలూ అవీకట్టి తిప్పలుపడి ఉంటారులే. దానికింద మంట పెట్టారు. పొగ బయలేరింది. అదంతా బుట్టమూతిలోంచి (తలక్రిందులుగా ఉందిగా) లోపలికి దూరింది. మంట వేడికి బుట్ట, అందులో గాలీ వేడెక్కిపోయాయి. గాలి విస్తరించి చోటు చాలక ఇవతలికి వచ్చేసింది. ఇంకలోపలేముంది? కొద్దిగా వేడిగాలీ, పొగాను. ఇవి మామూలు గాలికన్న తేలికేగా. తేలికవి తేలిపోతాయిగా. చుట్టూవున్న గాలి బుట్టని లోకువకట్టి పైకి ఎత్తేసింది. దాన్ని నేలకికట్టి పెట్టిన తాళ్లు కూడా ఆ బలానికి తెగిపోయాయి. అంత పెద్ద బుట్టా ఒక్కసారిగా బాణంలా రాకెట్‌లా రివ్వుమని ఆకాశంలోకి ఎగిరిపోయింది. ఇదంతా చేసిన ఫ్రెంచివాళ్ళిద్దరూ జై జై అని గంతువేసి చప్పట్లు కొట్టారు. ఇది భలేగా ఉందనుకున్నారు. ఈ బుట్ట ఎగురుతున్నపుడు దీన్ని పట్టుకుంటే మనం కూడా ఆకాశంలోకి ఎగిరిపోవచ్చు గదాఅనుకున్నారు ఆ యిద్దరు అన్నదమ్ములు. అన్న పేరు జోసెఫ్ మాంట్ గాఫియర్, తమ్ముడి పేరుఎటియెరీ. కొన్నాళ్ళ తరవాత ఈ అన్నదమ్ములిద్దరూ, గుడ్డతోటే ఒక బుట్ట తయారు చేశారు. గాలిపడగకి మనం బాణం కట్టం? అలాగే వెదురు పుల్లలతో చట్రంకట్టి దానికి బిగించారు. ఓరోజున ఊరందరినీ అద్భుతం చూడండహో అని దండోరా వేసి మరీ పిలిచారు. ఊరి చివర అంతా సిద్ధంచేశారు. గుడ్డతో చేసిన ఆబుట్టమీద చక్కని బొమ్మలు వేసి అందంగా తయారు చేశారు.

అది 1783 వ సంవత్సరం. నెల జూన్. తేదీ 5. ఊరివారంతా చుట్టూచేరి ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. అన్నదమ్ములిద్దరూ బుట్టకింద మంట వేశారు. పొగలేచింది. కొద్దినిముషాలలో బుట్ట, తాళ్ళు ఉండలాక్కుని పైకిలేచింది. అలా ఆకాశంలో ఎత్తుకిపోయింది.

విమానాలు కనిపెట్టడానికి పడిన తిప్పలలో ఇది చాలా గొప్పదని గుర్తుంచుకో.

సరే ఆ బుట్టపైకిపోయి ఏమైంది తెలుసా? గాలి ఎటు పదమంటే అటుపోయింది. పొరుగూరు పద అందిగాలి. సరే అంది బుట్ట. రెండుమైళ్ళ దూరంలోవున్న పక్కపల్లెటూరుకి వెళ్ళేసరికి బుటలోకి చల్లగాలి మెల్లిగా దూరింది. అంచేత అది బరువెక్కి ఆవూళ్ళో మెల్లిగా దిగింది. అక్కడి వాళ్ళకి ఇది బుట్ట అనీ, పొరుగూళ్ళో ఎవరో ఎగరేశారని తెలీదుగా. ఇదేమిటో ఆకాశంలోంచి దిగుతూంది అనుకున్నారు. భూతంఅని భయపడ్డారు. అంతా ఈటెలూ కర్రలూ పట్టుకొచ్చి అది దిగుతూవుండగానే దానిమీదకి ఈటెలు విసిరి, రాళ్ళు రువ్వి తూట్లుతూట్లు పొడిచేశారు. కిందపడగానే చీల్చి చెండాడి చింపిపోగులుపోసిఅమ్మయ్యా! భూతంచచ్చింది అనుకున్నారు. తరవాత మెల్లిగా తెలిసింది. ఇదీ మనుషులు చేసిందే అని. వాళ్ళకేకాదు దేశంలో అందరికీ తెలిసింది. ఎగరాలి అని ఆశపడుతూ అవస్థలుపడుతున్న వాళ్ళందరికీ ఇది వినగానే కొంత ధైర్యం వచ్చింది. ఇంకాస్త పెద్దబుట్టకడితే మనిషికూడా దాంతో కలిసి ఆకాశంలోకి పోవచ్చునని నమ్మకం కలిగింది.



# ★ విమానం కథ ★

ఇది ఇలా ఉంచు. ఇది జరగడానికి పదిహేనేళ్ళ క్రితమే ఇంకో మంచిసంగతి కనిపెట్టాడొకాయన. గాలికన్నా హైడ్రోజన్ చాలా తేలిక అని. గాలి బరువులో అది సుమారు పధ్నాలుగోవంతు ఉంటుంది. ఈ సంగతి బయటపడ్డ కొన్నాళ్ళకి డా॥ బ్లాక్ అనే ఇంగ్లీషాయన పెద్దగుమ్మటం ఒకటి కట్టి దాంట్లోకి హైడ్రోజన్ ఎక్కిస్తే అది తేలుతుందీ అన్నాడు. అలా అని ప్రయత్నం కూడా చేశాడు కాని ఆయన కట్టిన గుమ్మటాలు మరీ ఎక్కువ బరువైనందువల్ల, హైడ్రోజన్ ఎంత తేలిక అయినా అవి పైకి ఎగరలేకపోయాయి.

తరవాత కొన్నాళ్ళకి కావెలో అనే ఇంకో ఆయన ఒకరోజు ఇంట్లో కూర్చుని ఏం పనిలేక సబ్బునీటితో బుడగలు ఊదాడు. ఇపుడు మనకి ఆట అనుకో. ఆ బుడగలు అలా పైకి తేలి చూరుకి అంటిపెట్టుకు పోయే వరకి ఆయనకూడా అంత ఎత్తుకీ ఎగిరి గంతేశాడు. ఇలా గాలికన్నా తేలికైనదాన్ని బెలూన్‌లో నింపితే పైకెడుతుందని అనుకున్నాడు.

ఆనాటికే, ఫ్రాన్సులో చార్లెస్ అనే ఒకాయన అంతపనీ చేసి ఊరుకున్నాడు. ఆయన సిల్కుతో గుమ్మటం చేసి అందులోకి హైడ్రోజన్ ఎక్కించేసరికి అది నిజంగానే ఎగిరింది. ఇందాక చెప్పిన మాంట్ గాఫియర్ కాగితంబుట (వేడిగాలివల్ల) 1783 జూన్ 5 న ఎగిరితే, ఈ హైడ్రోజన్ బెలూన్ అదే సంవత్సరంలో ఆగస్టు 27 న పైకి వెళ్ళింది.

ఇపుడు మామూలు చిన్న బెలూన్ కానీకి ఒకటిస్తే, హైడ్రోజన్ బెలూను అర్ధణాకి ఇస్తారుగదా, అది చూశావుగా. దారంకట్టి పట్టుకుంటే నిటారుగా పైకి ఎగిరి నిలబడుతుంది. దారం వదిలేస్తే బడి వదలగానే నువ్వు ఆడుకోడానికి పోయినట్టు యిట్టే ఎగిరిపోతుంది ఆకాశంమీద.

సరే ఈ సంగతి తెలియగానే ఇంకా చాలామంది ఇలా పెద్ద పెద్ద హైడ్రోజన్ బెలూన్‌లుచేసి ఎగరవెయ్యడం మొదలుపెట్టారు. అయితే ఎవరెన్ని చేసినా, రెక్కలు తగిలించుకుని గోజుకుని పడుతూ లేస్తూ కాకుండా, హాయిగా స్తిమితంగా కూర్చుని ఆకాశంలో ప్రయాణంచేయడం మొట్టమొదట మాంట్ గాఫియర్ పొగ గుమ్మటాలలోనే జరిగింది. (వాళ్లు ఎగరలేదని చెప్పానుగా) అయితే అది తెలిసిన ఇంకో యిద్దరు ఫ్రెంచివాళ్లు చచ్చిపోతే చచ్చిపోతామని ధైర్యంచేసి ఎగిరారు. ఒకతని పేరు జీన్ ఫైలేటర్ డి రోజియర్; ఇంకో అతను మార్క్వస్ డి ఆర్లాండే.

1783 నవంబరు 21 న, మాంట్ గాఫియర్ పొగబుట్టకి ఇంకో తట్టకట్టి వాళ్లు పైకి ఎగిరారు. అక్కడనించి అది గాలిదేవుడి ఇష్టానుసారం ఐదుమైళ్ళు షికారుపోయి బుట్టలో గాలి చల్లబడ్డాక కిందకి దిగింది.

అక్కడితో ఫ్రాన్సులోనే కాక యూరప్‌లోని ఇతర దేశాలన్నిటా ఈ బెలూన్‌ల పిచ్చి బాగా పట్టింది. చాలామంది ఇది తయారుచేశారు. వారిలో చాలామంది ధైర్యంతో వాటిని పట్టుకుని ఆకాశంలోకి ఎగిరారు.

అక్కడితో ఆగలేదు. సరదాలు అటుంచి, ఎత్తునుంచి చూసి తెలుసుకోతగిన సంగతులు తెలుసుకున్నారు. వాళ్ళ ఊరు, అక్కడి కొండలూ గుట్టలూ, నదులూ కాలవలూ పైనించి చూస్తే ఎలా ఉంటాయో గుర్తించుకున్నారు. బొమ్మలు వేశారు. వంద సంవత్సరాలు గడిచేసరికి ఈ బెలూన్‌లనే యుద్ధాలలోకూడా వాడడం మొదలుపెట్టారు. యుద్ధాలంటే, ఇప్పటికి మల్లే విమానంమీంచి బాంబులు పడేయడం కాదు. అప్పుడు నేల మీదనే యుద్ధాలు జరిగేవి. అందులో శత్రువుల సైన్యం ఎక్కడ ఉంది. ఎలా ఉంది. ఎంత ఉంది. ఎటు వెళ్తోంది? ఇలాంటి సంగతులు తెలుసుకోవాలనుకో. శత్రురాజుకి ఉత్తరం రాసి, అడిగితే చెబుతాడా. చెప్పడు గదా. పోనీ మనమే వెళ్ళి ఓసారి చూసొద్దాం అన్నా వీల్లేదు కదా. అందుచేత ఇవతలివాళ్లు ఈ బెలూన్‌కట్టి, దాంతో ఎగిరి అలా శత్రుసైన్యాలున్న చోట మీదకివెళ్ళి వాళ్ళసంగతి అంతా తెలుసుకు చక్కా వచ్చేవారు. ఫ్రెంచి వాళ్ళు 1790 లో వీటికోసం బాగా డబ్బు ఖర్చుపెట్టి, యుద్ధంలో ఇలా వాడేవారు.

మీ పూరి శివాలయం అంత ఎత్తున పెద్ద గుమ్మటం—పట్టుబట్టతో తయారు చెయ్యడము అంటే మాటలా? పనాకి పూర్తిగా డబ్బుతో పని. సిల్కు చొక్కా కుట్టించుకుంటేనే పది రూపాయలు అవుతుంది గదా.

పోనీ చవగ్గా మల్లుతో చెయ్యకూడదా అంటారేమో. పట్టుకున్నంత బలం గట్టితనం మల్లుకి ఉండదు. అదీ సంగతి.

అంచేత ఇలాటివాటికి డబ్బున్నవాళ్లు కూడా ఖర్చుపెట్టరు. లాభం వస్తుందని ఆశ ఉన్నా, అంతాపోతే నష్టంగదా అని భయపడతారు. ఇలాటి పెద్దపనులకు ప్రభుత్వమే ఉండాలి.

ఈ బెలూన్‌లు యుద్ధాలలో శత్రువుల రహస్యాలు తెలుసుకుని గెలుచుకోడానికి పనికొస్తాయని తెలియగానే, ఫ్రెంచి గవర్నమెంటు చాలా డబ్బు ఖర్చుపెట్టింది. తరవాత ఇతరదేశాలు కూడా బాగా ఖర్చు పెట్టారు.

అనకూడదు గాని యుద్ధాలవల్ల ప్రాణనష్టం జరిగినా, వాటిమూలానే కొత్త కొత్త సదుపాయాలన్నీ కనిపెట్టడంజరిగింది. అందుకోసమని యుద్ధాలు రావాలని అనటం లేదు సుమా. ఇదవరకు జరిగింది ఇది. యుద్ధంలో గెలవాలన్న ఆశకొద్దీ గవర్నమెంటువాళ్లు డబ్బుపోసి, శాస్త్రజ్ఞులను తొందరపెట్టి, బతిమాలి, బలవంతపెట్టి అనేక కొత్త కొత్త సాధనాలు తయారు చేయించారు. గాలి గుమ్మటాలూ, ఆ తరవాత విమానాలూ, హెలికాప్టర్లూ, జెట్‌లూ, రాకెట్లూ గబగబ వచ్చేశాయి. తుపాకులూ, మరతుపాకులూ, ఫిరంగులూ, బాంబులూ, చేతిబాంబులూ, ఆటంబాంబులు, ఇపుడు హైడ్రోజన్ బాంబులూ ఇవన్నీ తయారైపోయాయి.

ఇవన్నీ గొప్పవైనా సంతోషం కలిగించేవి కావు. వీటివల్ల కూడా మంచిపనులు చేయడానికి వీలున్నా ఎక్కువగా చెడే జరిగింది. లక్షలకొద్దీ మనుషులను ఇవి చంపేశాయి. అణుశక్తి ఉందనుకో. దానివల్ల ఎంత మంచిపనులు చేయవచ్చునో అంత చెడ్డపనీ చేయవచ్చు. ఆటంబాంబులు ఉన్నవాళ్ళు తొందరపడి వాటిని పేల్చేస్తే, ఎంతేనా నష్టం ఉంది.

ఇంతకీ అసలు కథకి వద్దాం. బెలూన్‌లు కనిపెట్టిన కొత్తల్లోనే ఒక గొప్ప చిక్కు ఎదురైంది. (ఇంకా వుంది)

---

**మద్య ప్రదేశ్‌లో...**

బార్‌లో కూర్చుని చాలా సీసాలు ఖాళీ చేసిన తర్వాత ఒక తాగుబోతు ఇంకో తాగుబోతుతో:—

"భాయీ! ఇక చాల్లే, తాగకు. ఇప్పటికే నీ మొహం మసక మసగ్గా అయిపోతోంది!"

**టెలి విజ్ఞుడు**

"విజ్ఞానం కలిగించటంలో టెలివిజన్‌ను మించినది లేదని నా నమ్మకం. ఎవరన్నా టెలివిజన్ ట్యూన్ చేసినప్పుడల్లా, ఇంకో గదిలోకిపోయి పుస్తకం చదువుకుంటూ కూర్చుంటాను."

—హాస్యనటుడు గ్రూచో మార్క్స్.

# బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

మహమ్మద్ హుజాంగ్ (కరివెన. మహబూబ్ నగర్ జిల్లా) తేలప్రోలు ప్రేమదత్తు (కాకినాడ) గరికిపాటి వీరయ్య (పసుమటలంక కృష్ణా జిల్లా) డి. వెంకట రంగారెడ్డి (చండుపట్ల నల్లగొండ జిల్లా) పోతాప్రగడ సుబ్బారావు (కాకినాడ) చింతలపాటి బాలసుందరి (బెల్లారి) ఎమ్. వరదాచార్యులు (ఏలూరు) బి. వి. వి. జగదీశ్వరరావు (అకోలా) ఎస్. శ్రీధర్ రావు (సిద్దిపేట మెదక్ జిల్లా) వెంపరాల వెంకట రామలక్ష్మి (లక్ష్మీనరసు పేట శ్రీకాకుళం జిల్లా) ఢిల్లీ లక్ష్మీనరసమ్మ (ఛత్రపురం గంజాంజిల్లా) నీలి శ్యామసుందరి (విశాఖపట్నము) ఎస్. విజయనరసింహ ప్రసాద్ (ఎరుకలపూడి గుంటూరు జిల్లా) శ్రీపాద సుబ్బారావు (విశాఖ పట్నం).

వంగా శివరామిరెడ్డి (నల్లభాపురం గుంటూరుజిల్లా) పి. సంజీవరావు (వరంగల్లు) సూరంపల్లి లక్ష్మి (విజయనగరం) పి. రమాదేవి (వరంగల్లు) కొసరబాడ సచ్చిదానంద బాబు (వినుకొండ గుంటూరుజిల్లా) పోలిశెట్టి సీతారత్నం (విశాఖపట్నము) ధవళేశ్వరపు రామకుమార్ బొబ్బిలి (శ్రీకాకుళం జిల్లా) గ్రంధి ఉమా వెంకట రత్నాంబ (విశాఖపట్నం) గొల్లపూడి సీతా మహాలక్ష్మి (గుంటూరు) ముడియం వెంకటేశ్వర్లు (పెద్దబోదనం కర్నూలుజిల్లా) సి. వసంత (హైదరాబాదు) శేటి రెడ్డి సింహాచలంనాయుడు (నాగూరు, శ్రీకాకుళంజిల్లా) యర్రమిల్లి జ్యోతి కుమార్ రాయ్ (జంషెడ్ పూర్) కె. శంకరప్రసాద్ రెడ్డి (ఊరందూరు చిత్తూరు జిల్లా) కూచిపూడి చిట్టెమ్మ (సికింద్రాబాదు) కూచిపూడి రమణారావు (సికింద్రాబాదు) కలబరిగి నాగభూషణరావు (నెల్లూరు) గుంటబోలు మేఘమాల (చీపురుపల్లి శ్రీకాకుళంజిల్లా) గోరుగంతుల సత్యనారాయణమూర్తి (కాకినాడ) కుంతీపురం విజయకుమార్ (నెల్లూరు).

కొంభట్ల వెంకటరమణి (విశాఖపట్నం) సత్యవోలు సూర్యకుమారి (జంషెడ్ పూర్) తిమ్మన సుబ్బారావు (అనకాపల్లి విశాఖజిల్లా) కొసర్లపూడి దమయంతదేవి (మద్రాసు) ఘుడింబి రాజగోపాల్ (తిరుపతి చిత్తూరు జిల్లా) కాలాది రాజేంద్రవరప్రసాదరావు (గుంటూరు) కాశీ సోమరాజుల సరస్వతీదేవి (ఎలమంచిలి విశాఖజిల్లా) గోటేటి సోమేశ్వరరావు (రాజంపేట కడపజిల్లా) తిరుమలశెట్టి శకుంతల (వెంకటగిరిటవున్ నెల్లూరుజిల్లా) పోతాప్రగడ సూర్యకుమారి (కాకినాడ) ఎఱుకలపూడి సుదర్శన సాయినాధరావు (ఎఱుకలపూడి గుంటూరుజిల్లా) రాయమూరు మాధవబాబు (కల్యాణదుర్గం అనంతపురంజిల్లా) పొన్నలూరి జానకీదేవి (బాపట్ల గుంటూరుజిల్లా) వి. చెన్నా క్రిష్టారెడ్డి (చల్లబసాయపల్లె కడపజిల్లా) మాగంటి వెంకటస్వామి (గుడిబాల గుంటూరుజిల్లా) కొద లక్ష్మీదేవి (పాలకొల్లు ప. గో. జిల్లా) గుత్తికొండ పుణ్యావతి (పాలకొల్లు ప. గో. జిల్లా) పి. మోహన్ కుమార్ (జాలాడి గుంటూరుజిల్లా) ఘాలి శివరామకృష్ణ ప్రసాద్ (ఏలూరు) సముద్రాల సుబ్రహ్మణ్యం (సికింద్రాబాదు).

వారణాసి మోహన్ రావు (పార్వతీపురం శ్రీకాకుళంజిల్లా) కోణంకి శివరావు (సోంపేట శ్రీకాకుళంజిల్లా) మారెళ్ళ వెంకటమాచిరాజు (బరంపురం గంజాంజిల్లా) ఆర్. రవీంద్రనాథ్ రెడ్డి (హైదరాబాదు) మురళీ మనోహర్ రావు (బోథ ఆదిలాబాద్ జిల్లా) లక్కాడి మోహన్ రెడ్డి (నిర్మల్ ఆదిలాబాద్ జిల్లా) కె. అబ్బారావు (హైదరాబాదు) టి. సంపత్ కుమార్ (హనుమకొండ వరంగల్ జిల్లా) అత్తలూరి రామారావు (ఈమని గుంటూరుజిల్లా) ధర్మవరపు గౌరీశంకర నారాయణశర్మ (నరసరావుపేట (గుంటూరుజిల్లా) ఎమ్. బాబూరాజేంద్రప్రసాద్ (చాట్రగడ్డ గుంటూరు జిల్లా) కోడెబోయిన నాగభూషన్ రావు (గురజాడ కృష్ణాజిల్లా) ఎల్. లోకనాథశర్మ (విజయవాడ) కొంపుభొట్ల గోపాలక్రిష్ణయ్య (నరసరావుపేట గుంటూరుజిల్లా) బొమ్మారెడ్డి విజయకుమారి (పామర్రు కృష్ణాజిల్లా) పి. గీతావిశ్వనాథం (మద్రాసు) వంబూరు మంగపతిరావు (విజయవాడ) పాటిల్ హేమసుందర రాజశేఖర రెడ్డి (ఉరవకొండ అనంతపురంజిల్లా) చుక్కపల్లి తిరుమలరావు (తెనాలి గుంటూరుజిల్లా) 800 కొమ్మారెడ్డి శ్రీనివాసరావు (హైదరాబాదు).






"నాకోసం ఇంత శ్రమపడినందుకు చాలా సంతోషం. కానినాకు బయటికి రావాలని లేదు నేస్తం!"

# అవంతి హాస్యాలు

## శ్రీ ఆచార్య

[పూర్వ దేశంలో తెనాలి రామలింగడు, వీరబల్ లాగనే చీనా దేశంలో అవంతి అనే విదూషకుడుండేవాడు. అతని విచిత్రచర్యలు, విచిత్రమైన జవాబులు కొన్ని క్రింద వ్రాయబడి ఉన్నాయి, చదవండి.]

### దొంగకు స్వాగతం

ఒకరోజు ఒక దొంగ అవంతి యింట్లో చొరబడ్డాడు. అతన్ని చూడగానే అవంతి అలమారాలో దాక్కున్నాడు. దొంగ యిల్లంతా గాలించాడు. సామానులన్నీ కెళ్లించాడు. అయితే ఏమీ దొరకలా. ఆఖరికి అవంతి వుండే అలమారా తెరిచాడు. అందులో అవంతిని చూడగానే దొంగ అడిగాడు. "నీవు యీ అలమారాలో ఏం చేస్తున్నావు?" అని.

అవంతి చాల వినయంతో మెత్తగా బదులు చెప్పాడు: "అయ్యా, మీరు నా యింట్లో చొరబడుతూండగా చూశాను. అయితే మీకు స్వాగతం యివ్వటానికి తగిన వస్తు వేదీ మా యింట్లో లేదుకదా అని సిగ్గుపడ్డాను. అందుకని యీ అలమారాలో దాక్కున్నానండీ!" ఇది విని దొంగ తలవంచుకొని పారిపోయాడు.

### దప్పిగల జేబు

ఒకసారి అవంతి ఒక పెండ్లికి వెళ్లాడు. భోజనసమయంలో అతను ఒక మనిషిని చూశాడు. ఆ మనిషి ఫలహారాలు తింటూ తింటూ చాటుగా తన జేబునిండా ఫలహారాలు నింపుకొన్నాడు. అది అవంతిచూచి లేచి ఒక గ్లాసుడు నీళ్లు తెచ్చి అతని జేబులో పోశాడు. ఆమనిషి కోపంగా అతని అడిగాడు. "ఏమయ్యా, నా జేబుతో ఏం పోట్లాటకు వచ్చింది? ఎందుకని దాంట్లో నీళ్లు పోశావ"ని. అవంతి అన్నాడు: "అన్నా, కోప్పడకు. మీరు జేబునిండా ఫలహారాలు నింపుతుంటే చూశా. ఇంత ఫలహారం తిన్నాక, నీ జేబుకు దప్పిగా వుంటుందని దాహ మిప్పించా" నన్నాడు.

### గుడ్లగూబ ఏమంటున్నది?

అవంతికి పక్షుల భాష కూడా వచ్చును. ఒక రాజు వేటకై పోతున్నాడు. అతను తమాషాలాడుకోవడానికి, పక్షులమాటల్ని తెలపటానికీ, అవంతిని కూడా తీసుకవెళ్లాడు. దారిలో ఒక శిథిలగృహం కనిపించింది. అది ఒక కాలంలో కోటగా వుండేది. దానిమీద ఒక గుడ్లగూబ కూర్చుని యేదో అరిచింది. కొంతదూరం సాగిపోయినాక అది యేం చెబుతున్నదని రాజు అవంతిని అడిగాడు.

అవంతి చెప్పాడు: "అది యేం చెబుతున్నదంటే, రాజయినవాడు తన ప్రజల్ని మోసం చేయటం, ఏమార్చటం మానుకోకపోతే, అతని రాజ్యానికి కూడా యీ కోటగతే పట్టుతుందని, అది తనకు వాసస్థానమవుతుందని చెబుతున్నది దేవరా!" అన్నాడు.

### భూమి ఒరిగిపోతుంది

ఒకదినం అవంతిని అతని స్నేహితుడడిగాడు. "ఏమయ్యా, తెల్లవారగానే జనాలు యిటుకొందరు, అటుకొందరు పోతూ, వస్తూవుంటారే యెందుకని?"

ఆలోచించకుండానే అవంతి జవాబు చెప్పాడు: "ఓరే, యిది అందరికీ తెలిసిన విషయమేగా! సరే చెప్తా. ఈ జనాలు పలువైపులా పోకుండా ఒకేవైపుపోతే నేల ఒరిగి పోదూ!"



# గుర్రపు నాడా

[44-వ పేజీ తరువాయి]

"ఈ కాలునాడా ఎక్కడో రాలిపోయింది బాబూ. పేడ ఇప్పించండి వేసేస్తాను." అన్నాడు వాడు.

పేడ ఖర్చుచెయ్యడం చెంగయ్యకిష్టంలేకపోయింది. "ఒక్క నాడా పోతే ఏం మునుగుకుపోయింది; నీదారిని వెళ్లిపో" అన్నాడు. లేచి తిరిగి గుఱ్ఱంమీదబయలుదేరేడు. ఓ ఏడెనిమిదిమైళ్లు పోయేసరికి గుఱ్ఱం కుంటడం మొదలుపెట్టింది. కొంతసేపట్లో వేగం పూర్తిగా తగ్గిపోయింది.

అప్పుడప్పుడే చెంగయ్య ఒక చిట్టడవిలోకి ప్రవేశించేడు; సూర్యుడు పడమటికొండ వెనుకకు ప్రవేశించేడు. గుఱ్ఱం తిన్నగా నడవలేకపోతున్నాది. చెంగయ్యకు మనసులో దిగులుపట్టుకొంది—గుఱ్ఱంమీంచి దిగేడు; తను ఆ అడవి ఎలా దాటడం—తనదగ్గర అంత పైకముంది గదా, ఎవరైనా దొంగలు మొత్తేస్తే ఏంచెయ్యాలో తెలీలేదు. గుఱ్ఱాన్ని మెల్లిగా నడిపించుకు వెళుతున్నాడు.

ఇంతలో చీకట్లు దట్టంగా అల్లుకున్నాయి—రాత్రి సగంపైగా గడిచింది. ఎటుపోవాలో తెలియక చెంగయ్య తికమక పడుతున్నాడు—అంతట్లోకి ఎక్కడనుండో ఇద్దరు దొంగలు వచ్చేరు. చెంగయ్యమీద పడి కాళ్లూ, చేతులూ విరుగకట్టి, డబ్బుమూట పట్టుకుపోయేరు. చెంగయ్య నిస్సహాయుడై, గుఱ్ఱపు నాడా వేయించక పోయినందువల్ల గదా ఈ కీడు మూడిందని విచారిస్తూ అలా పడిఉన్నాడు.

ఆ మర్నాడు, తెల్లవారేక, సిరిపురంనించి వస్తున్న బాటసారులు చెంగయ్య పడిఉండడంచూసి, గుర్తుపట్టి, కట్లువిప్పి ఇంటికి చేరవేసేరు. ★



# సినిమా

బొంబాయిలేఖ

## నేటి మేటి నటులూ ఒకప్పుడు కొత్తవాళ్ళే

### మై నషే మెహూఁ

శంకర్, జైకిషన్‌ల సంగీతం, సహాయ నటి నిమ్మీ నిరుపమాన కృషీ గైరుహాజరై ఉంటే, వర్మా పిక్చర్స్‌వారి 'మై నషే మెహూఁ' చిత్రం అమందానందదాయకం అయిఉండేదికాదు.

కథ, ఢాకామజ్‌లిన్ వలువలా మహా పల్చగా, అనుభవహీనుడి నటనలా నిర్బలంగా, భయస్థుడి అభిప్రాయంలా పేలవంగా ఉంది. కాగా శ్రీమతి లీలావతీమున్షీ గారు, భారతీయ చిత్రాలలో క్రైమ్స్, సెక్స్‌లు శ్రుతిమీరిపోతున్నాయని దుయ్యబట్టుతూ ఒక ప్రకటన చేయడానికి ఈ కథ కొంత దోహదం చేసిందనికూడా అనుమానించాల్సి ఉంది. ఇదీ కథ. అయితే, ఇందులో ముందు చెప్పిన రెండూ కాక, మెచ్చతగ్గవి మరి రెండు అంశాలున్నాయి. ఒకటి హెలెనీస్ డాన్సు. రెండవది యువనృత్యకుడు నరేష్ సైగల్ కథనశిల్పం. ఇతనిలో చెప్పదలచిన సంగతి ధీమాగా ధాటిగా చెప్పగల సామర్థ్యం ఉంది. ఇది అతన్ని త్వరలోనే అగ్రశ్రేణి దర్శకుల మధ్య కూర్చోపెడుతుందనడానికి సందేహం లేదు. దర్శకత్వం సమర్థంగా ఉన్నా, చిత్రం తృప్తికలిగించలేదంటే, కథ అటువేపుకి ఎంత బలంగా లాగిందో ఊహించవచ్చు. చలనచిత్రంలో ఎంతటి హేమాహేమీలున్నా, అది రాణించడానికి కథ ముఖ్యం అన్న వాదానికినొక వాదం. ఇందులో హేమా - రాజ్‌కపూర్, హేమీ - మాలాసిన్హా. ఇంతటి వాళ్లున్నా దీనికి ఆటే సాయం చెయ్యలేకపోయారు. వాళ్ళని ఇందులో ఇలా వాడడం దండగ అనిపించింది.

కథనం బాగానే సాగినా, పాటలను చొప్పించడంలో దర్శకుడు శ్రద్ధ తీసుకోలేదు. 'కిసీ నర్గిస్ కి జరి' అనే మనోహరమైన గీతం ఒకటి, మాగుతినోట వినిపించడంవల్ల సగం దెబ్బ తింది. అయినా బాగుంది. పాటలో 'నర్గిస్' అనేమాట ఉన్నందువల్ల రాజ్‌కపూర్ దాన్ని తననోట పలకనన్నాడనీ అందువల్ల ఈ అన్యాయానికి వడిగట్టారనీ ఒకపుకారు. నిజమైతే, ఇది మరీ అన్యాయం...

మొత్తానికి 'మైనషే మేహూఁ' సంగీతం కోసమన్నా చూడతగ్గ చిత్రం.



'గొప్పింటి అమ్మాయి'లో ఎస్. ఎస్. రాజేంద్రన్, రాజసులోచన

### కరన్‌దివాన్ 50 వ చిత్రం

ఈ చిత్రంతో విడుదలఅయిన మరి మూడు చిత్రాలు: జాగీర్, బాజీగర్, మధు: ఈమూడు, చూడడం పడలేదుగాని, ఉన్న వాటిలో రెండవదే ఎన్నతగ్గదని చూచినవారు అంటున్నారు. చిత్రగుప్త సంగీతం ప్రత్యేకాకర్షణట.

జాగీర్, మధు-చిత్రాలు రెండిటా నాయిక మీనాకుమారి కావడమే వాటి గురించిన ముఖ్యవిశేషం. 'మధు' చిత్రంలో మూడింట రెండువంతులు కే. కే. గ్యాన్ (కిస్మత్, సర్గమ్) ముఖర్జీ దర్శకత్వంలో తయారైంది.

రజతోత్సవాలూ స్వర్ణోత్సవాలూ జరుపుకున్న అనేక చిత్రాల నాయకుడు కరన్



'ఇల్లరికం'లో రేలంగి, విజయలక్ష్మి, రమణారెడ్డి, నాగేశ్వరరావు

# ★ బొంబాయి లేఖ ★

దివాన ఇంగులో ముఖ్యపాత్ర ధరించాడు. ఆయనకిది 50వ చిత్రం.

కరన్ దివాన్ ఈ చిత్రానికి ముందు కొన్నాళ్లుగా తెరమరుగున పడిపోయాడు.

అతని చిత్రాలలో రజతోత్సవం జరుపుకొన్న తొలిచిత్రం 'భాయిజాన్' (1944). తరవాత రతన్, జీనత్ వచ్చాయి శాంతారాం చిత్రం 'దహేజ్' ఎ.వి.ఎం. వారి 'బహార్' కూడా జూబిలీ చిత్రాలే. బహుశా స్పాట్ లైట్ తన పైనుండి పక్కకి జరుగకుండా జాగ్రత్తపడడం, తననిబట్టి అది కదలకపోతే దానివెంట తను పరుగెత్తడం నేర్చుకుని ఉండనందువల్లనే—ఇన్ని హిట్ చిత్రాల హీరో అయినా—వెనకబడి ఉండాలి.

కరన్ ప్రస్తుతం నాలుగు చిత్రాలలో నటిస్తున్నాడు. పెట్రోల్ పంప్, సాల్గిరా, జాయెతో జాయె కహాఁ, అప్నా పరాయా. వీటిలో కనక ఏ ఒకటి జూబిలీ హిట్ అయినా చాలు, అశోక్‌కుమార్‌లా కరన్‌దివాన్ నట జీవితశకటం మళ్ళీ టాప్ గేర్‌లో పడి ఉత్సాహంగా ముందుకుపోతుంది.

## నేటి 'మేటీ' ఒకనాటి కుర్రవాడే

దర్శక నిర్మాత హెచ్. ఎస్. క్వాత్రా మొన్న తన కొత్త చిత్రం 'ఆస్రా' గురించి మాట్లాడుతూ అందులో హీరో పాత్రను కొత్త నటుడు కిషన్ కుమార్‌కు ఇచ్చినందువల్ల డిస్ట్రిబ్యూటర్లు కొందరు తమ డబ్బు వాపసు ఇమ్మని పేచీపెడుతున్నట్లు వెల్లడించారు. అతను జనానికి నచ్చడట.

ఈమాట అన్యాయమని, విన్నవారూ, చాలా అన్యాయమని కిషన్‌కుమార్‌ను చూసినవారూ అంటారు.

ఇక తగాదా చూదాం. 'ఆస్రా'లో మూడు బాక్సాఫీసు పేర్లున్నాయి. నటి మీనాకుమారి, రచయిత ముఖ్ రామ్‌శర్మ, సంగీతదర్శకుడు సలీల్ చౌదరి. అలాంటి హేమాహేమీలుండగా కొత్త హీరోవల్ల చిత్రం దెబ్బతింటుందనడం ఆ ముగ్గురి ప్రజ్ఞకీ అవమానం కాదా?

నేటి మేటినటులంతా ఒకనాటి 'కొత్త నటులే'నని మర్చిపోతే ఎలా. దిలీప్‌కుమార్, రాజ్ కపూర్, దేవానంద్, రాజేంద్ర కుమార్, మధుబాల, మీనాకుమారి, నూతన్ వీళ్ళంతా నిన్నటి నూతనులేగదా. కొత్తవాళ్ళు రావాలనీ కావాలనీ పత్రికలలో ప్రకటనలు చేసేవాళ్లు, ఉపన్యాసాలిచ్చేవాళ్ళూ తీరా వారొచ్చాక తగ్గిపోవడం సబబు కాదు.

డిస్ట్రిబ్యూటర్లు ఈ వైఖరి అవలంబించడంలో 'అర్థం' ఉంటే ఉండవచ్చుగాని న్యాయం లేదు. కొత్తవాళ్ళు రావడానికి ఇది పెద్ద అపశకునంలాంటిది. క్వాత్రా తన చిత్రంమీద ఇప్పటికి దాదాపు లక్ష రూపా

(55-వ పేజీ చూడండి)

# సంగీత వార్తలు

రష్యన్ సారస్వతమంతా గొగోల్ 'కోటు' వాక్యాల్లోంచి పుట్టినట్టు, ఆధునిక లలిత సంగీతబాణీలు అనేకం బడేగులామలీఖాఁ, కరీంఖాన్ వంటి స్వరనిధుల 'సరిగమ కోల్' లోంచి ప్రవహిస్తున్నవనిపిస్తుంది.

ముఖ్యంగా ఉత్తరాది సినిమా పాటల బాణీలను నిదానించి చూస్తే ఖాన్‌సాహెబ్ తుమ్రీలలో ఒక చిన్న పీకొరిదో గుర్తుకు వస్తుంది. ఖాన్‌సాహెబ్ ఒకవరస స్వరం వేస్తే అందులో పది హిట్ పాటలకు సరిపడ వరసలు దొరుకుతాయి.

## ఖాన్‌సర్ట్

గత వారం రాత్రి ఉత్తరాది నుండి ఇద్దరు దిగ్గరితులు వచ్చారు. ఒకరు సితార్ విద్వాంసుడు రవిశంకర్. మరొకరు ఖాన్‌సాహెబ్ బడేగులామలీఖాఁ.

తమిళ నటుడు శివాజీ గణేశన్ తమ సోదరుడి వివాహం జరిపిన సందర్భంలో ఈ 'ఖాన్‌సర్ట్' ఏర్పాటు చేశారు.

అంతకు ముందే, ప్రసిద్ధ వైణికుడు బాలచందర్ కచ్చేరీ, తరువాత కమలాలక్ష్మణ్ నృత్య ప్రదర్శనం జరిగాయి. ఖాన్‌సాహెబ్ పాట రాత్రిపన్నెండు నుండి ఒంటిగంటంపావు వరకూ జరిగింది. సంగీతదర్శకులు రాజేశ్వరరావు, ఘంటసాల, పామర్తి, కొత్త మంగళం సీను, బాలచందర్ కమలా లక్ష్మణ్, నటులు సావిత్రి, ఎం. ఎన్. రాజం, జెమినీ గణేశన్, ఎస్. వి. రంగారావు, గుమ్మడి, తంగవేలు మొదలగు వారంతా హాజరయ్యారు. ఖాన్‌సాహెబ్, చుట్టూ పరకాయించి చూసి 'శివాజీ కహాఁ హై?' అన్నారు. పెళ్లిపెద్దను పిలిపించి, 'మీరు తిరిగితే ఎలా? కూర్చొని వినండి' అన్నారు. శివాజీ గణేశన్ శిరసావహించి కూర్చున్నారు.

మూడు ఖ్యాల్‌లూ, మూడు తుమ్రీలూ పాడారు. ఖాన్‌సాహెబ్. ప్రయాణం బడలిక చేత మనిషి కొంచెం నలిగిపోయినందువల్ల, ఆరోజు పాట, ఎప్పుడూ ఉండేటంత ధాటీగా లేకపోయినా, శ్రోతలు అంతా మూడుగంటలసేపూ ముగ్ధులైపోయారు. అనన్యసాధ్యంఐనా నిరాడంబరమనిపించే ఖాన్‌సాహెబ్ పాండిత్య ప్రకర్ష, శ్రోతలందరికీ విడివిడిగా వినిపిస్తున్నట్లు వివరిస్తున్నట్లు స్వరకల్పన చేసే ఆయన మనోహరశిల్పం హృదయాలపై చిరముద్రలు వేశాయి.

ఖాన్‌సాహెబ్, ఎప్పుడు మద్రాసు వచ్చినా ఒకేచోట బసచేస్తారు. ఈ సారీ అక్కడే—ఘంటసాల వెంకటేశ్వరరావు గారి గృహం.

## స్వరాక్షరి

గోల్డెన్ స్టుడియోలో రికార్డింగు జరుగుతోంది. ఒక గాయకుడు పాటలో ఒక చరణం

# గాంధారి గర్వభంగం

జాగరిత జగతిలోంచి సుషుప్తావస్థలోనికి 'మేలుకొలుపు' మధురమైన బాలసరస్వతి పాటతో ఆరంభమౌతుంది 'గాంధారి గర్వభంగం' (శ్రీకృష్ణ సాయి ఫిలింస్) చిత్రం. ఆపాటా, అది ఆలంబనంగా ఉదయసంధ్యను చిత్రిస్తూ దర్శకుడు, ఛాయాగ్రహణ దర్శకుడూ చేసిన రూపకల్పన ఈ చిత్రానికి అలంకారప్రాయాలు.

తరువాతదంతా ఈ అందంతో అఖండమైన సంబంధంలేని వ్యవహారం. భారతంలోని పాత్రలను పరాభవించడం దీని వృత్తాంతం. కథకూడా అలాటిదే. పాండవులు తన బిడ్డలకన్న ఘటికులనిపించుకుంటున్నారన్న ద్వేషంతో గాంధారి, కుంతీదేవిని, ఆమె బిడ్డలనూ పరాభవించబోయి భంగపడడం ఇతివృత్తం. కుంతిని అవమానించడానికి ఆమె గజగౌరీవ్రతం తలపెడుతుంది. బలగం ఉన్న ఆమె బిడ్డలు మట్టితో కొండంత ఏనుగును చేసి, దానిపై తల్లిని ఊరేగించి ఉద్యాపన చేయిస్తారు. కుంతికూడా అలాగే వ్రతం చేయకపోతే కులక్షయం అని భయపెడతారు. అపుడు భీముడు, మట్టి ఏనుగును చేయబోయి, పెద్ద పెద్ద మట్టి ఉండలు విసిరి హస్తినాపురిని ధ్వంసంచేసినంత పనిచేస్తాడు. అర్జునుడు ఐరావతాన్నే దివినుండి భువికి తెద్దామంటాడు. అతను స్వర్గానికి వేసిన అమ్ముల నిచ్చెన ఎక్కి వెళ్ళి భీముడు ఐరావతాన్ని తెచ్చి తల్లి చేత వ్రతం పూర్తిచేయిస్తాడు. భారతంలో మనుషులు కొండంతవాళ్ళు. వాటికీ వేటికీ ఎన్ని వచ్చినా ఏ పాత్రా మహాభారతీయులంత ఠీవిగా ఎత్తుగా నిండుగా నిలబడలేదు. భీముడూ అర్జునుడూ ఎంతటి ఘనకార్యంచేసినా, అది సాధ్యమా అని ఆలోచించే అవివేకి ఉండడు గాని దీపావళీ సినిమా దేవతలను పాండవులను కౌరవులను చూస్తే రకరకాల అపోహాలు కలుగుతాయి. ఈ చిత్రంలో పాండవుల్ని చూస్తే సరేసరి. ఇందులో కథాకాలంనాటికి పాండవులు పదహారు పదిహేడు సంవత్సరాల ఈడువాళ్ళు అయి ఉండాలి. సినీ పాండవులూ కౌరవులూ పది పన్నెండేళ్ళకు మించరు. పన్నెండేళ్ళే అయినా భారత కాలంలో కుర్రాళ్ళు కాస్త పుష్టిగా ధాటిగా, ఇంకో నాలుగు పిడికెళ్ళు ఎత్తుగా ఉంటారనుకోవడం మనసుకు తృప్తినిస్తుంది. మరీ 1959 మార్కు కుర్రకారు అర్భకులు అయి ఉండరు. ఈ దృష్టితో లెక్కవేస్తే చిత్రంలో పాండవుల కౌరవుల మొత్తం వయస్సు పన్నెండేళ్ళు ఉంటుందనాలి. వాళ్ళ చేష్టాహావాలూ, బుద్ధులూ మాటలూ కూడా ఆ వయసులోనే ఉన్నాయి. పాత్రలకు ఎక్కడ మగసిరి అబ్బుతుందోనన్న భయంతో పాండవులకు పాత్రధారులుగా ఆడపిల్లలనే ఏర్పాటుచేసి స్థాయి చెడకుండా చూశారు. ధృతరాష్ట్రుడూ, భీష్ముడూ, ద్రోణుడూ, పాపం విదురుడూ తదితరులూ కూడా ఎక్కడ అపశ్రుతి పలుకుతుందోనని పిల్లల స్థాయిలోనే కనిపించారు.

అందువల్ల అనగనగా ధృతరాష్ట్రుడను ఒక రాజుగలడనీ, వానికి నూర్గురు పుత్రులనీ కుంతీ అనే ఒకామెకు పాండవులు అని ఐదుగురు కొడుకులనీ వాళ్ళకి డబ్బుండి వీళ్ళకి లేనందువల్ల, బీదవాళ్ళు గొప్పవాళ్ళు అనీ ధనికులు చెడ్డవాళ్ళనీ...ఇలా అనుకుని ఈ చిత్రం చూస్తే చక్కని చిన్నకథ. అందమైన సెట్లూ, చురుకైన మాటలూ, చతురమైన చిత్రణ, ఓ మోస్తరు నటన, అద్భుతమైన ట్రిక్ ఫొటోగ్రఫీ, మంచి మంచి పాటలూ మొదలుగువాటితో, విసుగు తెలియకుండా సాఫీగా కొంతవేగంలో అరవేగంతో సాగిపోయే చిత్రమని చెప్పుకోవచ్చు. ఇవన్నీ చూసి ఆనందించవచ్చు.

పాటలు దాదాపు అన్నీ వినడానికి హాయిగా ఉన్నాయి. బాలసరస్వతి, ఘంటసాల, పి. ఏస్. (ఆకాశవాణి) వైదేహి, రాణి పాడారు. అష్టవిధ నాయికలనూ చిత్రిస్తూ కూర్చిన నాట్యానికి వైదేహి పాడిన పాట చాలా బాగుంది. సంగీత దర్శకుడు సామర్తి రాగమాలికలో దీనికి వరసలు కూర్చారు. ఉన్న అన్నిటిలోకీ ఉత్తమం 'అనతగదో మానవుడిలమహానుభావుడు' అన్నది. శ్రీశ్రీ గారు, ఇష్టదేవతా స్తుతిచేస్తూ వ్రాసిన ఈ గేయం మానవుడి అంత ఎత్తుగా నిలబడి మానవుడి విశ్వరూపాన్ని మనోహరంగా మరోసారి అభివర్ణించింది. ఆనందోద్వేగభరితమైన ఘంటసాలకంఠం అంతగొప్పగానూ ఈస్తుతిని గానంచేసింది. చిత్రణకూడాపాటకు తగ్గస్థాయిలో (భీముడి విగ్రహం మినహా) ఒప్పింది. ఈ సన్నివేశాన్ని కని విని ఆనందించడానికైనా చూడదగిన చిత్రం. ★

తమిళనటుడు శ్రీ శివాజీగణేశన్ జూన్ 17 న తమ సోదరుడు చి॥ వి. సి. షణ్ముఖంకు, చి॥ సౌ॥ టి. శకుంతలను ఇచ్చి వివాహం జరిపించారు. వధూవరులను అభినందించి కానుకలు చదివిస్తున్న నటి శ్రీమతి సావిత్రి



దగ్గిర గమకం పలుకుతున్నాడు. సంగీత దర్శకుడు ఇంటిదగ్గిర కట్టుకువచ్చిన వరసల్లా స్టుడియోలో గాయకుడినోటవినే సరికి లోపం తోచింది.

ఆగమని, స్వరాలు సరిచూసుకుని, సరిచేసుకుని, "అక్కడ 'ప..ని.' మానేసి 'సరిగా' పాడండి" అన్నాడు.

పని మానేస్తే ఇంకపాడడం ఏమిటండీ అని చమత్కరించాడు ఆర్కెస్ట్రాలో

# యక్షప్రశ్నలు

సుకుమార్

## 3

(గతవారం తరువాయి)

"మహత్తరచిత్రం ఒకటి ఏ వూళ్ళో వస్తా రిలీజంటే జనం మోజుపడతారు వెంటనే చూట్టానికి. ఐందాండీ— అందులోనూ బోలెడంత డబ్బు పబ్లిసిటీకి ఖర్చుపెట్టి భారాభారీన సెట్లువేసి, హోరాహోరీగా పోరాటాలు పెట్టిన చిత్రం అని ప్రేక్షకులకు తెలిసేలాగా పత్రికల్లో రాయించిన చిత్రం ఐతే మరీ ఇది. ప్రతీవాడూ మొదటిరోజునే చూసి తీరద్దామనే ఉత్సాహం కలిగివుంటాడు. ఈ ప్రతీవాడు గాడు ఆ వూళ్ళో రిలీజయిన మీరు చెప్పిన చిత్రం గురించి అటువంటి ఉత్సాహమే చూపించాడు. ప్రతీవానికి ఒక సందేహం వచ్చింది. అది పేద్దభూతం అంతదన్నమాట. ఏమిటంటే..."

"త్వరగా చెప్పవయ్యా—ఫలానా" అన్నాడు చిరాగ్గా యక్షేశ్వరరావు క్లోజప్పు కొస్తూ.

"నా పేరు ఫలానా అని చెప్పాను. ఐతే ఫలానా కాదులెండి. ఫలానా ధర్మయ్య అని నా వుద్దేశం."

"ఫలానా ఇంటిపేరుగలవాళ్ళు మా బంధువులున్నట్టు జ్ఞాపకం."

ధర్మన్నగారూ చిరాకుపడ్డారు. అంతలోనే కారెక్టర్ ఆక్టర్ కు మల్లే ఎక్స్‌ప్రెషన్ మార్చేసి, శాంతం చూపించాడు కళ్ళల్లో.

"మీది చిత్రస్వభావం. అందుకే చిత్రలోకంలో వున్నారనుకుంటా. తమాషాగా మెడకూ కాలికీ వేసి మాట్లాడటం మీ స్వభావ లక్షణాల్లో ఒకలక్షణం"

"క్షణంలో కనిపెట్టేశావే - అన్నట్టు వూరికే డ్రాగ్ చేస్తూ చెప్పక ఆ ప్రశ్నకు త్వరగా సమాధానం చెప్పు. నువ్వు చెప్పిన దాంట్లో ఫస్టుహాఫ్ డ్రాగ్గా వుంది. జనాలకు నచ్చదు. సెకండ్ హాఫ్‌లో చకచకా ఎడిట్ చేసుకుపో" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"మొదటిరోజు చిత్రం చూడటానికి చాలా మందికి ఇష్టం అనికదూ అన్నాను. అందుకని ఆరోజు జనాలు ఎక్కువయిపోతారు. టిక్కెట్లు దొరకవు. బాక్సాఫీసు రూము బద్దలయేంత జనం. పోట్లాటలు, పోలీసులు. లోపల సినిమాలో గోల. ఒక్క ముక్క వినిపించదు. వినిపిస్తే అర్థంకాదు అసలే అర్థంకాని డైలాగులు కొన్ని వుంటాయికదా ఇవి అస్సలే అర్థంకావు అందుకని జనాలంతా ఏమనుకున్నారంటే, ఫస్టుకే వెళ్ళటంవల్ల రష్షు ఎక్కువైపోతుంది - సిక్స్ వీక్స్ గ్యారంటీకదా-మొప్పటయిన మూడోవారం చివరలోనో, నాల్గవదైన నాలుగోవారం మధ్యలోనూ వెళ్లి చూడొచ్చు అనుకున్నారు. వచ్చిన చిక్కేమిటంటే వూళ్ళోవున్న ప్రతీవాడూ, ఇటివిధంగానే భావించారు. అందరూ ఎవళ్ళకువాళ్ళే 'ఫస్టుహేరష్' అని వెళ్ళటం మానేశారు. ఇదీకథ, విపరీతమైన పబ్లిసిటీవల్ల వచ్చిన ముప్పు" అన్నాడు ధర్మన్నగారు పెదవి విరుస్తూ.

"భేష్. అదే సమాధానం. అవును గాని— నీకేమయినా కర్ణపిశాచి వుందా బ్రదర్?" అన్నాడు మామూలుగా యక్షేశ్వరరావు.

ధర్మన్నగారు 'హి హ్హి హ్హి' అని నవ్వాడు, తన గొప్పతనానికి మురుస్తూ.

"లేదండి" అన్నాడు ధీమాగా.

టీ పట్టుకొచ్చిన కుర్రాడు బల్లమీద పెట్టేసి, వెళ్ళిపోయి మళ్ళీవచ్చి 'యారో వందిర్క్రార్' అన్నాడు.

"యారది?" అన్నాడు యక్షేశ్వరరావు 'యారదో' వాడికి తెలిస్తే 'యారో' అనే మాట అనివుండడనే విచక్షణాజ్ఞానదూరమై. కుర్రాడు పిలవటానికి వెళ్ళాడు.

"మీరు మాట్లాడింది తమిళంకదూ!" అన్నాడు ధర్మన్నగారు.

"యస్, టమిల్"

"నాకు అర్థంకాలేదు ఆ మాటలు. తెలుగులోకి డబ్ చేస్తారు?" అన్నాడు సవినయ నయనకాంతులు వెదజల్లుతూ.

"డబ్బింగ్ ఇబ్బందిలేదా, వుందా?"



ఆంధ్రాఫిలింస్ వారి 'లవ్ మారేజ్'లో రంగారావు, సావిత్రి, జెమినిగణేశన్



'లవ్ మారేజ్'లో సరోజాదేవి



'రేణుకామాహాత్మ్యం'లో మిక్కిలినేని.



'మాయింటి మహాలక్ష్మి'లో జమున

# వార్తావరణం

రౌతూ పిక్చర్స్ వారి తొలిచిత్రం 'నిత్యకల్యాణం, పచ్చతోరణం' నిర్మాణం ఆరంభమైంది. గుమ్మడి, సి. ఎస్. ఆర్. కృష్ణకుమారి, చలం, రమణారెడ్డి, సూర్యకాంతం, హేమలత, సంధ్య, అల్లురామలింగయ్య, పేకేటి, నల్లరామమూర్తి మొదలగువారు పాల్గొంటున్నారు. రామకృష్ణ అనే కొత్త యువనటుడిని, [illegible]జశ్రీ అనే అమ్మాయిని ఇందులో పరిచయం చేస్తున్నారు. ఈ చిత్రానికి రచన, తొలిసారిగా దర్శకత్వం పినిశెట్టి శ్రీరామమూర్తి నిర్వహిస్తున్నారు. సంగీతం పెండ్యాల, నిర్మాత టి. కృష్ణమూర్తి.

* * *

రచన, దర్శకత్వంతోపాటు నిర్మాణం కూడా నిర్వహిస్తు కొండముది గోపాలరాయశర్మ భవానీ ప్రొడక్షన్స్ తలపెట్టిన చిత్రం శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్యం నిర్మాణం వాహినీలో సాగుతోంది. నాలుగుపాటలు రికార్డుచేశారు. జమున, హేమలత, లక్ష్మీకాంతమ్మ, జయలక్ష్మి, నాగయ్య, రమణారెడ్డి, సి.ఎస్.ఆర్, మిక్కిలినేని, కాంతారావు, చంద్రశేఖర్, బేబీ చంద్రకళ, మాస్టర్ నాగరాజు ఇందులో పాల్గొంటున్నారు. సంగీతం మోహన్ దాస్.

* * *

ఆంధ్రలో కాంట్రాక్టు నాటకాలు ముఖ్యంగా ఆడిన నాడు కూడా ఒకే హాలులో ఏకబిగిన రోజుల తరబడి సినిమాకు మల్లే రోజుకు రెండాటలు ఆడిన సందర్భాలు లేవు. తమిళనాడులో మటుకు ఇది పరిపాటి. మద్రాసులో తిరుమలిశై ఆళ్వార్, రామాయణం, ఇలంకేశ్వరన్, కట్టబొమ్మన్ వంటి కాంట్రాక్టు నాటకాలు, రక్తకన్నీరు వంటి సాంఘికాలూ నెలల తరబడి ఒకే థియేటర్ లో ఆడాయి. నవాబ్ రాజమాణిక్యంపిళ్లై, టి. కె. షణ్ముఖం, భగవతి, శివాజీగణేశన్ ఇక్కడ పెద్దపేర్లు. నాటక ప్రదర్శనంకూడా సాంకేతికంగా అద్భుతం అనతగ్గస్థాయిలో ఉంటుంది. ఈ శిల్పంలో ముఖ్యాంశం తెరఎత్తిన తరువాత నాటకం ముగిసేలోగా మళ్లీ విరామం (సగంలో ఇంటర్వెల్ తప్ప) ఉండకపోవడం. సరిగ్గా తెలుగు నాటకాలలో చిరకాలంగా ఉన్న లోపం ఇదే. ప్రతి రెండంకాలకూ మధ్య విసుగెత్తించే విరామం—కొండొకచో అక్కడ హాస్యము, వగైరాలు ఉండడం మామూలు.

తెలుగుసినిమా, రంగస్థల నటుడు సి. నాగభూషణం ఈ అంశం గురించి చాలా ఆలోచించి, ఈ లోపం సరిదిద్ది నాటకం ఆడితే ప్రేక్షకులు ఆదరిస్తారన్న నమ్మకంతో ఆ పని ఆరంభించారు. తమిళనాడులో బహుళ జనాదరణ పొందిన నాటకం 'రక్తకన్నీరు'ను పాలగుమ్మి పద్మరాజుగారు అనువదించారు. మామూలు నాటకంలా కాక, ఇందులో దృశ్యాలు అరవై డెబ్భైదాకా ఉంటాయి. దృశ్యం మారినప్పుడల్లా విరామం లేకుండా హంగులు సమకూర్చుకొని, నాగభూషణం బృందం (రవి ఆర్ట్ థియేటర్స్) వారు ఆంధ్రదేశంలో పర్యటన ఆరంభించారు. ఆంధ్రకు సంబంధించినంతవరకూ అపూర్వమనతగ్గ ఆదరణను సంపాదించుకొన్నారు. ఈ నాటకం కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరులలో మొత్తం 71 సార్లు ప్రదర్శించబడింది. కాకినాడలో వరుసగా 2 వారాలు ఆడింది.

* * *

వేళకు నటులు వచ్చేరాకా, వచ్చినా రానివాళ్ళ స్థితిలో ఉండే నాటకాలు అభాసు అయే స్థితి గతించాక, పరిషత్తుల సీజన్ ఆరంభమైంది. పరిషత్తులలో ఆడే నాటకాలు ప్రత్యేకం ఉత్సవాలకే పరిమితం అవుతున్నాయి తప్ప ప్రజలలోకి ఎక్కి స్థిరంగా నిలబడి డబ్బు గడించలేకపోతున్నాయన్న విమర్శ వింటునే ఉన్నాం.

సజీవమైన నాటకరంగం పుట్టి పెరగాలన్న ఆశ దురాశ కాదనీ, కట్టుదిట్టంగా బాధ్యతాయుతంగా, కొత్త పద్ధతులలో ప్రదర్శిస్తే వ్యాపారస్థాయిలో నాటకాలు రాణిస్తాయనీ ధైర్యం చెబుతుంది నాగభూషణం బృందం సాధించిన విజయం.

ఇందుకు రవి ఆర్ట్ థియేటర్స్ అభినందనీయులు. ★

## చిత్ర లేఖలు

ఆర్యా,

హిందీవాళ్ళూ, తమిళులూ, ఇంకా ఎవరు పెడితే వాళ్లు తాముతీసే చిత్రాలలో ప్రాధాన్యమైనన్ని పాత్రలకు పెద్ద పెద్ద బవిరిగడ్డాలూ, జహాంగీరు మీసాలూ అమర్చగలరని నా ప్రార్థన. అవి ఉంటే డబ్బింగుకు చాలా హాయిగా సదుపాయంగా ఉంది.

పూర్వం మనదేశంలో అందరికీ గడ్డాలు ఉండేవిట. అందువల్ల పనిలో పనిగా సంప్రదాయాన్ని పోషించినవారముకూడా అవుతాము.

డబ్బింగీస్ జనుడు.

# ఆరుద్ర గళ్ళనుడికట్టు 7

## ఆధారాలు

### అడ్డం

3. ఎవరి పిచ్చి వాళ్ళకి......
5. 3 అడ్డానికి వ్యతిరేకం.
7. చీపురులాంటిదే; కలమీద సాధారణంగా ఉంటుంది.
8. మధ్యలో అంగు చేర్చి పది స్వంతం అనుకోవచ్చు.
9. అంగద రాయబారంలో వెంట తీసుకెళ్ళిన ఆయుధం.
10. అపరకర్మ చేసేరోజు. ఆ మాటకొస్తే ఏ రోజైనా కావచ్చు.
12. తోక తెగిన యముడు అలాంటి కవిని మధ్య కలుపుకొని తెచ్చిపెట్టే కీర్తి.
14. కానివి చెల్లాచెదురైనాయి.
16. ఆకారం మొదలుదాల్చిన సంతోషం జిడ్డు జిడ్డు!
18. భూమి ఖరీదు.
19. పరుసవేది కచ్చితంగా ఎక్కే శిఖరం.
20. (శ్రీ శ్రీ చెప్పినట్టు) ఒకడు, ఇంకొకడు.
21. 3 అడ్డానికి పర్యాయపదం.
23. తుమ్మెదకోసం వెంగపెట్టుకొని మధ్య పరువమైనపువ్వు.



### నిలువు

1. నాగానందంలో సంగీతం.
2. వాచాలత్వం బయటపడేది ఇలా గ. తప్ప మరొకలాగ అసాధ్యం.
3. శ్రీ కూడలేనిది.
5. రెండో తిథి.
6. స్థలము. వాడుక ప్రకారం అంకములో ఉండేది.
11. మృణాళిని మధ్యన కలిపి తలకొడితే కలువపువ్వు.
13. కతకములోనుంచి గణనకొచ్చే కాలం.
14. భారవి సంసారంలో, తారుమారైనా ప్రణయం వికారంగా ఉంటుంది!
15. ఇందుకా? వేషంలో ద్వేషం!
16. మిన్ను.
17. మధ్యలో తారుమారైనందున పంతుగ దండాల్లో ఉద్దేశం వ్యర్థం!
22. వెనుకనుండేది, దీనితో కలిపితే మధ్యనుంటుంది?
24. మురిపెం పురి విప్పితే అందులో వృద్ధి

## 6-వ నుడిగట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 జ | 2 యా | 3 ప | జ | య | 4 ము | లు | |
| 5 గ్రా | | 6 మం | దు | | | కు | | 7 స |
| 8 మ | 9 ని | | 10 గు | రు | 11 తు | | 12 హ | త్య |
| 13 క | న్న | 14 వా | రు | | 15 ది | 16 వ | | మే |
| ర | | చ | | | | ర | | వ |
| ణ | | 17 వి | 18 ని | | 19 పా | ద | 20 పూ | జ |
| 21 ము | ప్పు | | 22 శ | బ | రి | | 23 మా | య |
| లు | | 24 రా | | | 25 జా | 26 న | | తి |
| | 27 మా | ట | కా | రి | త | న | ము | |

## బొంబాయి లేఖ

(50 వ పేజీ తరువాయి)

యలు ఖర్చు పెట్టి కొంతభాగం షూట్ చేశాడు. డిస్ట్రిబ్యూటర్లకి శివన్‌కుమార్ మొహం నచ్చలేదని ఇప్పుడు తొలిస్తే, తీసిన ఫిలిమంతా ఏం కావు?

* * *

### ఆరు కామెరాలతో

ఖ్వాజా అహమద్ అబ్బాస్ తన కొత్త చిత్రం 'చార్ దిల్ చార్ రహే'లో పతాక సన్నివేశాన్ని మొన్న ఆరు కోణాలలోంచి ఆరు కామెరాలతో చిత్రించారు. ఇది క్లయిమాక్సులో ఒకభాగమే. బొంబాయికి వందమైళ్ళ దూరంలో ఉన్న అందమైన ప్రాంతంలో విల్సన్ డామ్ దగ్గర షూటింగ్ జరిగింది. దాదాపు వెయ్యి వేలమంది ఆ దృశ్యంలో పాల్గొన్నారు. 50 ట్రక్కులూ, వంద ఎద్దుబండ్లూ తెచ్చారు. 50 వేల రూపాయల ఖర్చుతో రంగులలో తీసిన ఈ సన్నివేశం తెరమీద ఒక నిమిషం కనిపిస్తుందట. ఈ పనికన్న ఆరు కామెరాలూ తీసిన ఫిల్ములు చూసి ఎడిట్ చేయడం ఎక్కువ కష్టమని అబ్బాస్ అన్నారు.

### ఆషిక్

దక్షిణభారత దర్శకనిర్మాత ఎల్. వి. (శారద, ఛోటీ బెహన్) ప్రసాద్, విశ్రాంతి కావాలని వెళ్ళినందువల్ల, నిర్మాతలు బన్నిరూ శివ్ విజయ్ కిషోర్ దూబేలు తమ చిత్రం 'ఆషిక్' దర్శకత్వాన్ని హృషీకేశ్ (అనాడీ) ముఖర్జీకి అప్పగించారు.

ఈ చిత్రంలో రాజ్ కపూర్, పద్మిని, నంద, అఘా, మొన్నటిదాకా బేబీనాజ్ అని మనం పిలుచుకున్న ఒక నవయువతటి, శోకర్ జానీవాకర్, లీలా చిట్నిస్, రాజ్ మెహ్రా, అచలా సచ్‌దేవ్, నానా పల్సీకర్, ముక్రీ పాల్గొంటున్నారు. సంగీత దర్శకులు శంకర్, జైకిషన్‌లు.

—టచ్ స్టోన్

## ఎథెల్ బారిమోర్ మృతి

నట ప్రపంచంలో మకుటం లేని చక్రవర్తులుగా వెలిగిన బారిమోర్ కుటుంబీకులు ముగ్గురిలోనూ నటి ఎథెల్ బారిమోర్ జూన్ 18 న హృద్రోగం వల్ల మృతి చెందింది. ఆమె వయసు 79 ఏళ్ళు. ఆమె అన్నదమ్ములు జాన్ బారిమోర్, లయొనెల్ బారిమోర్ లు కొంతకాలం క్రితం గతించారు.

ఎథెల్ బారిమోర్ 1894 లో బ్రాడ్వే రంగస్థలం అధిరోహించింది. ఆమె తొలి చిత్రం 'ది నైటింగేల్'.

# పుస్తక సమీక్ష

## తెరమరుగులు

నాటికల సంపుటి. పుస్తకాలు దొరికే చోటు: శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ; వెల రు 1-50 న॥ పై॥; పేజీలు 186.

ఇందులో రావికొండలరావు, పోతుకూచి సాంబశివరావు, హితశ్రీ, కొండముది శ్రీరామచంద్రమూర్తి, అంగర సూర్యారావు గారు రాసిన 8 నాటికలున్నయ్. ఈ నాటికలన్నీ కొత్తపక్కీలో వున్నయ్. అంటే ఒక పిల్లవాడు ఒక పిల్లది అకస్మాత్తుగా ఎక్కడో కలుసుకోవటం, తరువాత ప్రేమించుకోవటం, వివాహం కావటమో లేక తప్పిపోవటమో లాగా. అంగర సూర్యారావుగారి 'స్త్రీలకు ప్రత్యేకం' అనేది చదవటానికి సర్దాగా వుంటుంది. అందులో, రంగమ్మగారి సంభాషణలు ఇంపుగా వున్నయ్. 'కుక్కపిల్ల దొరికింది'లో కుక్కపిల్లనిగాని, పిల్లినిగాని అంటే ఇంట్లో తిరిగే జంతువులను పెంచితే వాటిమీద ప్రేమ ఏవిధంగా పరిణమిస్తుందో చక్కగా దిద్దిరాశారు. దీనికి ప్రత్యేక వ్యక్తిత్వం వుంది ఇందులో.

'దొంగ' నాటికను తేలికగా చదవొచ్చు గాని 'తెరమరుగునీడలు' 'తెల్లవారింది' ఇవి కాస్త 'టేడియస్'గా వుంటయ్. కాని మొత్తంమీద నాటికలన్నీ 'టకటకా' చదవాలనిపిస్తుంది. సంభాషణలు చిన్నవి. భాష సరళంగావుంది. ఢిల్లీ, కలకత్తా నగరాలలో వుండే ఆంధ్ర సంఘలవారికి ఇటువంటి చిన్న చిన్న నాటికలు 45 నిమిషాల్లో మీటింగు లప్పుడు ఆడుకునేందుకు బాగుంటాయ్.

రచయితలపరిచయం చివర పేజీలో రాశారు. ఇందలి నాటికలను ప్రదర్శించుటకు ఆయా రచయితల అనుమతి అవసరం. వారి చిరునామాలకు రచయితల పరిచయం చూడండి అని రాశారు. రచయితల పరిచయం మొదట్లోనో లేక వారి వారి కథల మొదట్లోనో చూపిస్తే బాగుండేదేమో! చదివే వ్యక్తి ఈ విషయంలో ఖంగారుపడటానికి అవకాశాలు వున్నయ్.

'రాధ'

## 'కూలిన వంతెన'

రచయిత: థారన్టన్ వైల్డర్. అనువాదం: శ్రీ వందూరి విఠల్. ప్రచురణ - దేశికవితామండలి, విజయవాడ (దక్షిణ భారతపుస్తకసంస్థ సహకారమున ప్రకటితము. ప్రాప్తిస్థానము: ఆంధ్ర ప్రగతి బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు.)

1714 వ సంవత్సరంలో పెరూలో ఒక వంతెనకూలిపోయి అయిదుగురు చనిపోతారు. ఇద్దరు చిన్నపిల్లలు, ఇద్దరు నడివయస్సు వారు. అయిదవవాడు ఒక యువకుడు. ప్రత్యేకం ఈ అయిదుగురికే ఈ ప్రమాదం ఎందుకు జరిగి ఉండాలి అని భావించి ఒక 'ఫ్రాన్సిస్కన్' మత ప్రచారకుడు వారి జీవితచరిత్రలను సేకరించి ఒక గ్రంథంగా తయారుచేస్తాడు. దానిలో ప్రతిపాదించిన సిద్ధాంతాలవల్ల ఇతనికి మరణదండన విధింపబడుతుంది. అసలు "సత్యాన్ని" తెలుసుకొనగలిగిన వ్యక్తి ఈ ప్రమాదంలో చనిపోయిన వారందరికీ తెలిసిన ఒక మఠాధ్యక్షురాలు (Abess) మాద్రెమారియాడెల్ పిలార్. ఈ కథలోని అయిదుగురూ, ఎవరికివారు తాము ప్రేమించిన వారికి ఎడమయిపోతూ ఉంటారు. వారి మధ్య ఒక "అగాధం" ఏర్పడుతుంది. మాటలవల్ల, చేష్టలవల్ల వారు తమ ప్రేమను వ్యక్తం చేయబోయి మనస్సు కలతచెంది బాధపడుతూ ఉంటారు. చివరకు "ప్రమాదనకాత్తు," ఒక్కొక్కరూ తమ వేదన అనవసరమని గ్రహించి మరొక వ్యక్తితో కలిగిన సాన్నిహిత్యంవల్ల శాంతిని పొందగలిగి వెంటనే మరణిస్తారు. కాని జ్ఞానోదయానికి కారణమయిన ఈ క్రొత్తబాంధవ్యమే శాశ్వతమైనదని, అదే జీవితానికీ మరణానికీ మధ్య ఉన్న "వంతెన" అనీ మాద్రెమారియా భావిస్తుంది. సాధారణంగా మనుష్యుల మధ్య ఏర్పడే బాంధవ్యాలు (మాటలవల్ల, తక్కిన లోకసామాన్యమయిన వ్యాపారాలవల్ల మనకు తెలిసేవి) కూలిపోయిన వంతెనవంటివి.

ఈ వస్తువునుబట్టి మూలంలో శైలి ఎంత ముఖ్యమయి ఉండాలో ఊహించవచ్చు. కాని మూలాన్ని చదివినవారికి అనువాదం కొంచెం అసంతృప్తికరంగా ఉంటుంది. మూలంలోని సున్నితమయిన వ్యంగ్యం మనం మామూలు కథలలో, కొంచెం తక్కువ తరకం శరత్ నవలలలో చదివే "ఆర్ద్రత"గా మారిపోయినదనిపిస్తుంది. ఉదాహరణకు - పెరికోల్ మార్క్విస్సాను క్షమాపణ కోరినప్పుడు ఆమె (మార్క్విస్సా) ఆశ్చర్యాన్ని, నిస్సహాయతను చిత్రించటానికి వైల్డర్ వాడిన పదాలన్నిటినీ (Maudlin, loquacious) వదలి "ఆర్ద్ర"మని కొట్టివేశారు అనువాదకులు. ఇటువంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నా మొత్తానికి ఈ అనువాదం, మూలం చదవాలనే ఆసక్తి పాఠకులలో కలిగిస్తుంది.





Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press. 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



'ఇంటికి'

చిత్రకారుడు : కె. శేషగిరిరావు (హైదరాబాద్)